# 'జీవన సంధ్య'

## రమేశ చంద్ర దత్తు

శ్రీ శివ శంకర శాస్త్రి
వంగభాషనుండి తెలిగించినది

1923.

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమహేంద్రవరము

## పీఠిక

శ్రీ రమేశ చంద్ర దత్తు మొట్టమొదట నాంగ్లభాషలో గ్రంథములు రచింప నారంభించెను. సుప్రసిద్ధ నవలాప్రణేత యగు, శ్రీ బంకిమచంద్ర చట్టోపాధ్యాయుఁ డొకనాఁడు కలకత్తాలో నితనిని జూచి, మాతృభాషలో పుస్తకములు రచింపు మని నొక్కి చెప్పెను. "బెంగాలీభాషలోనా రీతి యెట్టిదో నాకుఁ దెలియదే!" అని రమేశుఁ డనెను. "నీవంటి సంస్కారి యెట్లు వ్రాసిన నదే రీతి. శక్తి యున్నచో రీతి తనంతన తానే పట్టువడును." అని బంకిమచంద్రుఁ డితనిని సమాధాన పఱచెను. నాటినుండి రమేశుఁడు బాంగ్లాభాషలో గ్రంథములు రచింపఁ జొచ్చెను.

బాంగ్లాభాష, బాంలాభాష, వంగభాష యివి సమానార్థకములు. పూర్వులు దీనిని గౌడభాష యనెడువారు. ఆంగ్లేయుల వలన దీనికి బెంగాలీ యనుపేరు వచ్చినది.

మాతృభాషలో నితఁడు మొదట రచించినది వంగవిజేత. తరువాత మాధవీకంకణము, రాజపుత్ర జీవనసంధ్య, మహారాష్ట్ర జీవనప్రభాతము, సంసార కథ, సమాజము ననునవి రచియించెను. మొదటినాలుగు చరిత్రాత్మకనవలలు; కడపటి రెండును సాంఘికములు.

చరిత్రాత్మకము లగునవలలు నే నాంధ్రీకరించితిని. చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు సుధాశరశ్చంద్ర మనుపేరిట సంసార

కథ కాంగ్లమగు The Lake of Palms ఆంధ్రీకరించినారు. సంసారము నింతవఱ కెవ్వరు తెలిగింప లేదు.

మామిత్రులు వేంకట పార్వతీశ్వర కవులు వంగవిజేతను తమ ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలయందు ౧౯౧౪ సంవత్సరమునఁ బ్రకటించిరి.

దత్తునవలను మనభాషలోనికి మొట్టమొదట మార్చినది తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారు. మాధవీకంకణమున కింగ్లీషుపరివర్తన మగు The Slave Girl of Agra అను దానిని వారు ౧౯౧౧ సంవత్సరమున నాంధ్రీకరించి ప్రకటించినారు. ౧౯౧౭ సంవత్సరమున నేను వంగమాతృక తెలిఁగించితిని.

ఏలూరులో నెవరో దత్తునవల నొకదానిని "హైమవతి" యనుపేరిట ననువదించినా రఁట.

శ్రీమాన్ యం. టి. వల్లభ అయ్యంగార్ ఈనా తెలుఁగు గ్రంథమును కన్నడలోనికి తర్జుమా చేసినారు.

హల్దీఘాట్ యుద్ధకాలమున సలీమ్ పసివాఁ డనియు, యుద్ధమునకు వెళ్ళనే లేదనియు వంగమహాశయుఁ డొకఁడు వ్రాసినాఁడు. ఇందలిసత్య మితిహాసజ్ఞులు పరిశీలింపఁ దగినది.

తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి

సాహితీ సమితి
గుంటూరు ౧౯౨౩

# ౧

క్రీస్తుశకము ౧౫౭౬ సంవత్సరమున ఫాల్గునమాస ప్రథమ దివసమందు మేవాడ్ సంస్థానమందలి సూర్యమహాల్ దుర్గమున కోలాహలము వినవచ్చెను. ఉన్నతశిఖరముపై నీదుర్గము నిర్మితము. దీనికి నల్దిక్కుల దట్టముగా చెట్లు పెరిగి యున్న పర్వతములు బహు దూరము కాన్పించుచుండెను. బాలభాస్కరుఁడు ధరణీతలమందలి చెట్లుచేమలకు బంగారపుఁబూఁత పూయుచుండెను. ప్రాభాతికమందపవమానముచే వృక్షములనుండి మనోహర మర్మరధ్వని బయలుదేఱుచుండెను. ప్రతిపర్ణమునందును శిశిరబిందువులు ముక్తాఫలసౌందర్యంబు ననుకరించుచుండెను. వృక్షశాఖలయందు విహంగములు గానములు సేయుచుండెను. దుర్గప్రాకారమునుండి కనుచూపుమేరలో మహీధరములు నీరెండయందు రమణీయముగాఁ గన్పట్టుచుండెను. ఝణఝణధ్వానముతో దుర్గకవాటము తెఱచిరి. అపుడు నూర్గురు రాశ్వికులు బల్లెములు చేబూని వెలుపలికి వచ్చి క్రిందికి దిగఁ జొచ్చిరి. వారలయాయుధములు సూర్యరశ్మియందు ధగధగ లాడుచుండెను. సైంధవఖురాఘాతములచే శిలాఖండములనుండి యగ్నికణములు లేచు చుండెను. కొలది సేపటిలో రావుత్తులు భూమిమీదికి డిగ్గి, చేరువ నున్న వనములోనికిఁ జనిరి.

నేడు మృగయాదివసము. ఈనాటివేటయందలి ఫలాఫలములంబట్టి వత్సరముపొడవున సంభవించు యుద్ధముల జయాపజయములు పరిగణింపఁబడును. కావున సూర్యమాల్ దుర్గాధినాథుఁ డగుదుర్జయసింగు వందమందిరౌతులతో వేటకు బయలుదేఱెను. మేవాడ్ దేశమున చోండావతులు యుద్ధములందు ముందడుగు వేయువారు. ఆ సుప్రసిద్ధకులమునఁ దుర్జయసింగుకంటెఁ బరాక్రమశాలి లేఁడు. చూడగానే యతఁడు ముప్పదియేండ్లవాఁ డని తోఁచును. దీర్ఘకాయుడు; అతని నేత్రములు మండుచున్న నిప్పులవలె నెఱ్ఱగా నుండును; మాంసపేశికలుక్కుతోఁ జేసినట్లుండును. కుడిచేతిలో పొడవైనబల్లెముండెను. అతని యనుచరులును చోండావతులే.

వన్యమృగముల నరయుటకయి పోయిన పదాతులొక్కఁడొక్కఁడుగా వచ్చి జంతువులు కనఁబడలేదని దుర్జయసింగుతోఁ జెప్పిరి. యోధులంతటితో నిరుత్సాహులు కాక ముందునకుఁ బోవ సాగిరి. ఆ కాననము మిక్కిలి రమణీయమయినది. సూర్యకిరణము లెట్లో చెట్లయాకుల సందులనుండి భూమిమీదికిఁ బ్రసరించి కాననకుసుమములతోడను, దూర్వాంకురములతోడను సయ్యాట లాడుచుండెను కొన్ని ప్రదేశములందు విపినము పగటివేళనే యంధకారప్రాయమై యుండెను. జోదు లెల్లరు నుత్సాహవంతులై పొద లనక, వాగు లనక, గుట్ట లనక, త్రోవలో నేమి వచ్చినను లెక్క సే

యుక ప్రయాణము చేయుచుండిరి. రాజస్థానమునందు వేటను బోలు నుత్సాహకర వ్యాపారము వేఱొకటి లేదు; మృగయా దినమువంటి పండుగురోజు మఱియొకటి లేదు.

కొంతతడవు పయనముచేసి వార లొకమైదానముఁ జేరిరి. సమీపమున పర్వతదుర్గము చెట్లమఱుగున నుండుటచే సరిగా గానవచ్చుట లేదు. ఇప్పుడు దుర్జయసింగు తన యమాత్యునిఁ జూచి "అది పాహాడ్జి భూమిజా దుర్గముకాదా? అని యడిగెను.

"ఔను. ఇట్టిదుర్గము సన్న్యాసి భూమిజాల యధీనమున లేకుండ చోండావతుల యధీనమునందుండునేని, మహారాణా వారి కీయుద్ధసమయమున నెక్కువ తోడ్పాటు కలుగును" అని యమాత్యుఁడు పలికెను.

"భూమిజాలు రణశిక్షణ నెఱుఁగరనుట నిక్కమే; కాని తమ దుర్గమును, పొలములను, శత్రువులు ముట్టడించునప్పుడు వారు కొంతవఱకు పోరాడుదురు" అని దుర్జయసింగు పలికెను.

"సత్యమే కాని వారు బల్లెమును పట్టుటకంటె నాగటిని పట్టుటయందు నేర్పరులు!" అని యమాత్యుఁడు నుడివెను.

ఎల్లరును బిగ్గరగా నవ్విరి. వారిలో నొకఁ డి ట్లనెను: "భూమిజాలు దుర్గసంరక్షణయందు మిగుల నాసక్తి కలవారు. వీరులు నయిత మప్పు డప్పుడు దుర్గభ్రష్టు లగుదురు. భూమి

జాలభూమికి భయము లేదు. శత్రువులు కారు గదా మహా రాణావారే దానిని లాగివేయ లేరు!”

“ఎలుక రంధ్రములోనికిఁ దూఱినపిమ్మట దానిని వెలువరించుట దుస్సాధ్యము!” అని యమాత్యుఁ డనెను.

సురల నందఱును బెద్దపెట్టున నవ్విరి. పిదప యోధులు వరాహముకొఱకు గహనము, పర్వతము, పొదరిండ్లు, గుహలు మొదలగుచోట్లు కలయ వెదకిరి. వెనుకటి సంవత్సరము సూకరము కానఁబడిన ప్రదేశమును బరికించిరి.

రెండుజాముఁ లయ్యెను. ఆతపము తీక్ష్ణము కాఁజొచ్చెను అశ్వికులు మొగములనుండి స్వేదమును దుడిచికొనిరి. దుర్జయసింగు కొంచెము యోజించి, “బంధులారా, మన గుఱ్ఱములలసినవి, మనముగూడ బరిశ్రాంతి నొందితిమి. ఇఁక వృథాన్వేషణ మేల? నడువుఁడు, అశ్వములకు విశ్రాంతి నొసఁగుదము మనము సయితము బడలిక దీర్చుకొందము. పిమ్మట నీయరణ్యమునం దెచ్చటనైన వరాహము దాగియుండెనేని దుర్జయసింగు దానిని వధించును, కానిచో బల్లెము పాఱవేయును!” అని పలుకగా, నందఱును సమ్మతిఁ గనఁబఱచి నిబిడనికుంజమువంకకుఁ జనిరి.

ఆప్రదేశము కమనీయ మయినది. మధ్యాహ్నమందును సూర్యరశ్మి క్రిందికి దిగకుండునట్లు వృక్షములందు పత్రములు దట్టముగా నుండెను. కాని, యక్కడక్కడ నొక్కొక

మయూఖము సువర్ణరేఖవలె భూమిమీదికి వ్రేలాడుచుం
డెను. భూతలము పరిశుభ్రముగా నుండెను. పచ్చికకోమలము
గాఁ బెరిగి తివాచీపఱచిన ట్లుండెను. వృక్షములనుండి పండు
టాకులు రాలు ధ్వనియు, వనవిహంగముల రుతంబును,
సమీపమునఁ బ్రవహించు సెలయేటిమర్మరస్వనమును దక్క
నచ్చటి ప్రశాంతస్థితికి భంగము నాపాదించుశబ్ద మేమియు
లేదు. పరిశ్రాంతు లగుజోదు లాప్రదేశ రామణీయకమును
నిశ్శబ్దముగా విలోకింప సాగిరి. వనదేవతాపూజకొఱకుఁ బ్రకృతి
వృక్షము లను స్తంభములతో మందిరము నిర్మించినట్లును,
నిర్ఝరిణి వ్యయముగా వీణె వాయించుచున్నట్లును బోధపడు
చుండెను.

ఇంచుక సేదదేరి వారలు సెలయేటినీటిలో ముఖములు
కడుగుకొని ఫలములు భుజింపఁ గూరుచుండిరి. పూర్వాచార
ప్రకారము దుర్గేశుఁడు మిక్కిలి సాహసు లగువారికి “దోనా”
(అనగా తనపత్రమునుండి యాహారమును) నొసఁగగా, వారు
దానిని సాదరముగా గ్రహించిరి. వివిధవృత్తాంతములతోను
హాస్యధ్వనులతోడను వనము ప్రతిధ్వను లీనుచుండెను. సైని
కులు వెనుకటియుద్ధవిషయములను జెప్పుకొన జొచ్చిరి. దుర్గ
ప్రాకారములను లంఘించుటయు, శత్రువులను వధించుటయు,
సాళుంబ్రాధిపుని యనుగ్రహపాత్రు లయినతీరును తుదకు మహా
రాణావారిచే మెప్పు వడసినవిధము నింకనేమేమో సంగతులను
జెప్పుకొన సాగిరి.

“ఈపర్యాయము మేవాడ్‌సంస్థానమున కనేకులు విరోధులయిరి. మార్వాడ్, అంబీర్, బికానీర, బుంది మొదలగు సంస్థానాధీశులు డిల్లీచక్రవర్తిపక్షమునఁ జేరి, మేవాడను జయించుటకు దయచేయుచున్నారు. కాని మహారాణావారికి జయము తప్పదు. అథవా పరాజయము కలుగు ననుకొందము. చోండావతులు మాత్రము యుద్ధరంగమున మృతినొందుట తప్ప పలాయన మనుమాట నైనఁదలపెట్టరు! “అని దుర్జయసింగు వచింపగా, వారెల్లరు నుల్లాసవంతులై యతనిని ప్రశంసించిరి.

మరల దుర్జయసింగి ట్లనెను: “ఎనిమిదిసంవత్సరములక్రిందట అక్బర్ షాహ చితోడ్ దుర్గము నాక్రమించినప్పుడు రాణా ఉదేసింగు వెడలిపోయినను, సాళుంబ్రాధినాథుఁడగు షాహీదాను మాత్రము ద్వారమును విడువ లేదు. చారణదేవా! ఏది, యా గీతము పాడుము! చోండావతుల పరాక్రమక్రమము నాకర్ణింపవలెను.”

చారణుఁడు వేటకువచ్చినాఁడు. ప్రభువునానతి చొప్పున నతఁడు షాహీదానుని యశోగీతము నారంభించెను. దుర్జయసింగు నతనియోధులును చితోడ్ ధ్వంసమును గన్నులారఁ జూచియుండిరి. చారణుఁడు గీతము పాడుచున్నకొలది వారల హృదయములం దానాటి సంగతులు వర్తింపసాగెను.

ఘోర మయినట్టి యానాటి పోరితంబు
వినుఁడు సావధానముగ నో వీరులార!
దుర్జయుండు సాళుంబ్రేశుతోడ నుండి
కాంచియుండెను దత్పరాక్రమ విధంబు.

అపుడు యోధ, చోండావ త్కు లాధిపుండు.
దేశభక్తాగ్రగణ్యుఁ, డుదీర్ణయశుఁడు,
షాహిదాను సూర్యద్వార సమ్ముఖమున
స్థిరముగా నిల్చె సైనికశ్రేణితోడ.

గాలితాకున "ఉదయసాగర"పు టలలు
కూలమును మాటి మాటికిఁ గొట్టునట్లు,
షాహిదానుని సేనపై శత్రుబలము
కవియఁ జొచ్చెను భూరివేగంబుతోడ.

కాని, దరులను దాకి, వెన్కకును బాఱి
యల్లకల్లోల మగుప్రవాహంబు వోలె,
మొగలు వాహిని మనవారి మొగ్గరంబుఁ
దాకి మఱలగఁ జొచ్చెఁ జీకాకుపడుచు.

కాననంబున నేరీతిఁ గారుచిచ్చు
నలుదెసల దారుణంబుగ నలము కొనునొ,
ఆవిధంబున మనవారి నవిరతముగ
శత్రువులు చుట్టుముట్టగ సాగి రపుడు.

కాని, చోండావతులు పరాక్రమము మెఱయ
సారె సారెకు మిక్కిలి శ్రమకు నోర్చి,
ద్వారమును జేరనీకుండ దూరముగను
బాఱఁద్రోలుచు నుండిరి పరబలంబు.

అయిన నేమాయె ? పరిపంథు లపరిమితులు
వారిదంబులువలె వానకారునందు.
కొన్ని దళములు నేలపైఁ గూలుచుండఁ
దోడనే క్రొత్తదళములు దుముకుచుండె.

ఎంత బలవంతు లయ్యును నేమి చేయఁ
గలరు తమపగవా రధికముగ నుండ ?
రోషమున వైరివీరుల రూపు మాపి,
ధరణిపై వాలి రపుడు చోండావతులును.

తుట్టతుదదాక నొక్కఁడే పట్టుమీద
శాత్రవులతోడఁ బెనఁగి యీషాహి దాసు,
వీరలోకవరేణ్యుఁడు విడిచెఁ దనువు
సంగరమున సూర్యద్వార సమ్ముఖమున !

ఆదినంబున దుర్జయు నాహవమునఁ
జూచియే తీరవలయు నో సుభటులార !
వఱలుచున్నది యీనాటివైరిఖడ్గ
చిహ్న మింకను దుర్జయసింగునొసఁట !

ఈగీతము నాలకించునెడ చోండావతుల నేత్రములు ధగ ధగలాడుచుండెను; గీతము సమాప్తినొందునప్పటికి వారు సింహానాదము చేసిరి దుర్జయ సింగి ట్లనెను: "యోధు లారా! ఈరోజులు మనదేశమున కనర్థదాయకములు. కాని చోండావతులు విపత్తుల కపరిచితులు గారు. నేడు మనకు చిత్తోడ్ దుర్గము లేదు; కాని యనేక పర్వతములు కలవు. మహారాణా ఉదే సింగు మృతి నొందినపిమ్మట ప్రతాపసింగు మహారాణావారు రాజ్యమునకు వచ్చినారు. వారికి జయ మగుగాక! సిసోదియా వంశమునకు జయ మగు గాక! చోండావతులకు విజయము కలుగును గాక!"

ఉత్సాహపరవశులై వారు వేసిన కేకలకు నిరంతర పర్వత శ్రేణి పలుమారు ప్రతిధ్వను లీనెను. అంతట దుర్జయసింగు "చారణదేవా! మరల మనము వరాహమును వెదకుటకు బయలు దేఱవలెను. కాబట్టి యీదినము నిష్ఫలము కాకుండు నట్లు మృగయా గీతము పాడుము" అని పలుకగా, ప్రభుని యాజ్ఞానుసారముగా చారణుడు క్రమ్మఱ వీణియ చేబూని, నింగిచాయ గొంచెముతడవు దృష్టి నిలిపి పిమ్మట గీతము ప్రారంభించెను.

ఎన్నిదేండ్లకు మున్ను ఢిల్లీశ్వరుండు
బల్మిని "చిత్తోడు" స్వాధీన పఱచుకొనియె.
ఢిల్లితో సంగరము శిశోదీయులకును
గలుగ నయ్యాదియే మొదల్ కాదు నుండి!

మూడువందల వత్సరములకుఁ బూర్వ
మించు మించుగ నకట! ఢిల్లీశుఁ డొకఁడు
గెలిచెను చితోడు దుర్గము ఖిల్జివంశ
ముఖ్యుఁ డగు "అల్లావుద్దీను" మొదటిసారి.

రాజపుత్రులకును గంతరత్న మయిన
దుర్గ మెన్ని దినంబులు తురకవాండ్ర
చేతులం దుండు? మనవారు చీల్చి వైరి
బలము, దానిఁ గ్రమ్మఱ గెలుచుకొనిరి.

దుర్గరత్నమును "హమీరు" తొడరి యపుడు
లాతివారలకడనుండి లాగివేసె;
సింహాసంకాశుఁడు ప్రతాపసింహుఁ డిపుడు
మొగలువీరుల నెత్తిపై మొట్టె లాగు!

ఊరుసింహుఁడు, యువరాజు, యోధ, మఱియు
జ్యేష్ఠపుత్రుఁడు లక్ష్మణసింహునకును
దుర్గసంరక్షణక్రియఁ దొఱఁగెఁ దనువు
వానిచరితంబు నెఱుఁగని వాఁ డెవండు?

అతఁడు మున్నొక యా హేరియా దినమున
నతులసమ్మద మొప్ప వేటాడుకొరకు
బయలు దేఱెను నూర్గురు భటులు తన్ను
వెంబడింపగ నొకమహా విపినమునకు.

పోవ నొక కొంతదూరము పోత్రి యొకటి
గహనభూమిని నాతని కంటఁ బడియె;
వెంటనే భూరిరయమున వీరు లెల్ల
వీకతోడ వరాహంబు వెంటఁ బడిరి.

పొదలు, డొంకలు, వాగులు మొదలగునవి
శీఘ్రముగ దాటుచును వారిచేతఁ బడక
ప్రాణభయమునఁ గడుదవ్వు పఱుగువాఱి
దూఱె నొకజొన్న చేనిలోఁ దుదకుఁ బంది.

మంచెపై నుండి పైరు రక్షించుచున్న
వనిత యొక్కతె వారల వాలకములఁ
గాంచి యి ట్లనె; "మీ రరి కట్టవలయు
పొలము, నావయిఁ బందిని పొడిచి తెత్తు."

పిదప నొక జొన్నదంటును బెఱికి, యామె
పదను బెట్టి తదీయాగ్ర భాగమునకు
ఘోణి నద్దానితోడను గూలనేసి
పట్టి చరచర లాగెను భటులకడకు.

ఆమె సల్పిన చిత్రకార్యంబుఁ గాంచి
వార లాశ్చర్య మొంది నిర్వాక్కు లయిరి.
పైరు గాచుచు నున్నట్టి పడతిఁ యేడ?
అతిభయంకర మహా వరాహం బ దేడ?

అంత జోదులు భుజియించు నవసరమున
నార్తనాదము చేసెను హాయ మొకండు!
చూడగా నప్డు, మిక్కిలి చోద్య మొదవ
భగ్నమై యుండె ఘోటకపాద మొకటి!

పిట్టలను దోలుటకు మంటిపెల్ల నామె
విసరివేయగ, నయ్యది బెసకి పోయి
తాకె గుఱ్ఱముకాలికి, దానితోనె
చచ్చుటకు సిద్ధ మయ్యె నా సైంధవంబు.

పాలకుండను శీర్షముపై నిడుకొని,
పట్టుకొని రెండుదున్నల గట్టిగాను
రెండుచేతులతో, నాదరిద్రయువతి
సదనమున కేగుచుండెను సంజవేళ.

ఆమెబలముఁ బరీక్షింప నాత్మ నెంచి,
"ఆమె చనుచున్న త్రోవకు నడ్డముగను
తురగమును భూరిరయమునఁ దోలు" మనుచు
ఊరుసిం గొకభటునకు నొసఁగె నాజ్ఞ.

వడివడి న్వచ్చుచున్నట్టి వాజిఁ జూచి,
పాలకుండను క్రింద దింపకయె యామె
స్థిరముగా నిల్చి, రాహుత్తు చేరఁగానె
త్రోసె నొకమహిషంబును దురగముపయి!

పాప ! మారాతు, గుఱ్ఱముఁ ద్రోపు నడిన
తత్క్షణంబునఁ బడిరి భూతలముమీఁద !
ఊరుసింహాఖ్యుఁడు విస్మయ మొంది, యామె
కులమువృత్తాంత మారసి తెలిసికొనియె.
ఆమె చందానవంశంబు నందుఁ బుట్టి,
చోహానాన్వయశాఖయై శోభిలు నది.
క్షత్రియాంగన యగుటకు సంతసించి,
పేర్మి నామెను యువరాజు పెండ్లియాడె.
కలిగెను హమీరసిం గామెగర్భమునను,
మాతులగృహంబునం దుండె మాతతోడఁ
జిన్నవాఁడు చిత్తోడు ఖిల్జి జయించు
నాఁడు, పెద్దయై వైరుల నఱకివైచె.
గట్టిగాఁ బట్టి బల్లెముల్ కదలుఁ డిపుడె
నాటి యాహేరియావలె నేటివేట
సఫల మగుఁ గావుత ! చిత్తోడు నరగ గెల్చి
తనరుఁ గావుత రాణా ప్రతాపసింగు !

చప్పున హయములపైఁ గూరుచుండి యాశ్వికులు శర వేగమునఁ బరుగెత్తిరి. ఈపర్యాయము వారి యత్నము విఫలము కాలేదు. పెద్దపొదనడుమ మహావరాహము కానఁబడెను. దానిలావును గాంచి వేటకాండ్రు పొందిన యానందమునకు మేర లేదు. పందియు వారి నవలోకించి వేటకాప్రత్య-

నుండి పరుగువాఱెను. మహోల్లాసమున వారు దానివెంటఁ బడిరి.

వరాహము పరుగెత్తి పరుగెత్తి వెనుదిరిగి చూచెను. రౌతులు కడుసమీపమునకు వచ్చుచుండిరి. అప్పు డా సూకరము వారిపైఁ బడనెంచెను; కాని పదనుబెట్టిన బల్లెములు ధగధగ మెఱయుచుండుటచే నాయత్నము మాని, లతాగృహములోఁ దూఱెను. ఇంతలో రౌతు లాయాారమును జుట్టివేసిరి. వా రెంత చప్పుడు చేసినను, ప్రాణభయమున దాగియున్న వరాహము వెలుపలికి రాలేదు. కొందఱు రాలు రువ్విరి. కొందఱు బల్లెములతో నాకులపైఁ బొడిచిరి. కొంతకాలమీతీరునఁ జనెను. వరాహము మాత్రము బైటకు రాలేదు.

అంతట దుర్జయసింగు వారితో "యోధులారా, ఈ లాగునఁ బ్రయాస పడ నేల? చూడుఁడు—సూర్యాస్తమయము కాఁబోవుచున్నది, ఇక నెంతో ప్రొద్దు లేదు. మన మందఱము నల్వంకల మూగి, జాగ్రతతో మధ్యభాగమును జేరుదుమేని, వరాహము తప్పక బల్లెపుఁ బోటులతో జచ్చును" అని పలికెను.

వారల కింతకంటె వేఱొక యుపాయము తోఁచినదికాదు. రౌతులు గుఱ్ఱములపై నుండి దిగి మెలకువతో సూకరమును వధింప ముందునకు జనుచుండిరి. వరాహ మాశ్వికులయభిప్రాయమును గ్రహించి, తటాలున నెగిరి, యిర్వురి పాదములను చీల్చి, మహావేగమునఁ బాఱిపోయెను.

గాయములు తగిలినవారి కుపచారములు చేయుటకు నలుగురు జోదులు నిలిచిరి. తక్కినవారు క్రమ్మఱ దాని వెంబడిఁ బడిరి. పంది వడివడిఁ బరుగెత్తుచు, నొక్కమాఱు దాగికొనుచు, మరల వెలుపలికి వచ్చుచు, బహువిధముల ప్రాణము రక్షించుకొనఁ జూచుచుండెను. వాసరం బవసానంబు నొందెను. పంజచీఁకటి క్రమముగా వ్యాపించుచుండెను. ఆశ్వికులు చెదఱిపోయి, కొంద ఱిక్కడ, కొంద ఱక్కడ మఱికొంద ఱింకొక చోటను దిగఁబడిరి.

దుర్జయసింగొక యరణ్యమధ్యమునఁ జేరెను అతని సైంధవము ఫేనపుంజముతో నిండియుండెను. వదనము నుండి చెమ్మట కాఱుచుండెను. అతనిదృష్టి చెదఱ లేదు. ఆశ్వికు లందఱిలో నతఁడే వరాహముపై దృష్టి నిలిపి యున్నవాఁడు. సూకరము తక్కినవారల చూడ్కుల నుండి తప్పించుకొనెను, గాని యతని బాఱినుండి తప్పించుకొనలేక పోయెను. అతఁ డే పొదవంకఁ జూచెనో, వాస్తవముగా క్రోడ మక్కడనే దాగి యుండెను.

ఈసారి పోత్రియు మహోగ్రహము నొందెను. జామునుండియుఁ గాననమునుండి కాననమునకును, గహ్వరమునుండి గహ్వరమునకును బరుగెత్తుచు, బ్రాణములు దక్కించుకొనఁ జూచుచున్నను, ఇంకను నొకయోధ తనపై దృష్టి నిలిపి తన్ను వధింపనున్నాఁ డని చూచి, సూకరము మహాకోపముతో దుర్జయసింగుపైఁ గుప్పించి దుమికెను.

దుర్జయసింగు వామహస్తముతోఁ జెమ్మట దుడుచుకొని, వ్రేలాడుచున్న కేశములను సవరించుకొని, తీవ్రదృష్టితో బల్లెము పందిపై విసరెను. అతడు డస్సి యుండుటచేతనో, యంధకారవశముననో, యాపోటు వ్యర్థ మయ్యెను. వరాహమునకుఁ దగులుటకు మాఱుగా నతని కుంతము ఒక శిలాఖండమునకుఁ దగిలి విఱిగిపోయెను నిముసములో వరాహము తురంగోదరమును జీల్చివై చెను.

ప్రత్యుత్పన్నమతి యగు దుర్జయసింగు పతనోన్ముఖ మగు సైంధవము మీఁదినుండి శీఘ్రముగా వెనుకకు దుమికెను. మృతాశ్వమును వదలి వరాహ మాతనివైపునకుఁ బరుగెత్తెను. మరణమనివార్యము! రాజపుత్రయోధ నిష్పందదృష్టితో మృత్యువున కెదురు చూచుచుండెను. కాని మృత్యువు రాలేదు!

ఎవ్వఁడో విసరిన బల్లెము తగులుటచేత వరాహము మేను రక్తధారలు స్రవించెను. ఆపోటుతో నది మృతి నొందకపోయినను, దుర్జయసింగును విడిచి, వెను దిరిగి చూడకుండ, విపినాభ్యంతరమునకుఁ బరువెత్తెను. ఆయంధకారమున వరాహము కానఁబడ లేదు.

దుర్జయసింగు పరికించి చూడఁగా దీర్ఘకాయుఁ డొకఁడు కట్టెదుట నిలిచి యుండెను!

మృగయాదివసమున వరాహము తప్పించుకొని పోయెను. తన బల్లెపుఁబోటు వ్యర్థ మయ్యెను, అన్యసాహాయ్యమున తన ప్రాణములు దక్కెను, అనుతలంపులు దుర్జయసింగును వేధింపఁ జొచ్చెను చింతాకులుఁడై యుండుటచే నతఁడు ప్రాణదాతను ప్రశంసింప మఱచి, కొంచెము కఠినస్వరముతో, "తమ రెవ్వరో నే నెఱుఁగను. నాప్రాణములను రక్షించిన వారు తమరే యని తోచుచున్నది" అని పలికెను.

"మనుష్యమాత్రులు మానవుని రక్షింప యత్నింతురు. విశేషించి, దుర్జయసింగు జీవనము రక్షించుట రాజపుత్రున కుఁ గర్తవ్యము. దుర్జయసింగు యోధ. ఈ విపత్సమయమున స్వదేశమున కుపకరించును" అని యానూతనపురుషుఁడు వచించెను.

సామాన్య వేషధారియు, నపరిచితుఁడు నగు జనునినోట నిట్టి పలుకులు విని, దుర్జయసింగు కొంచె మచ్చెరు వొంది, "తమ నామధేయ మేమో యడుగ వచ్చునా?" అని యతనిని ప్రశ్నించెను.

"తరువాతఁ దెలిసికొందురు గాని, ఇప్పుడు బడలి యున్నారు, కావున నాకుటీరమునకు వచ్చి, కొంచెము విశ్రమింపుఁడు" అని యాపురుషుఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

దీర్ఘకాయుఁడు, మహాబలవంతుఁడు నగు నాపడుచువాడు ముందు నడువ, దుర్జయసింగతనివెంటఁ జనుచుండెను చీకటి రాత్రి యోధ లిర్వురు విపినమార్గమున నిశ్శబ్దముగా నడువఁ జొచ్చిరి.

దుర్జయసింగు దుర్బలుఁడు కాఁడు; కాని యావయస్కుని యున్నతదేహమును, విశాలవక్షమును, దీర్ఘబాహువులను, ధీర పదన్యాసమును విలోకించి, యాశ్చర్య మొందెను. ఇట్టి మహా కాయు నతఁ డెన్నఁడును జూడ లేదు; అథవా యెనిమిది సం వత్సరముల క్రిందట నొకనిని గాంచి యుండవచ్చును.

కొంతసేపటికి నూతనపురుషుఁడు చప్పున నాగి, దుర్జయ సింగుతో "కారణ మడుగ వలదు. తమ పాగాతోఁ గన్నులు కట్టికొనుఁడు. మీచేయి పట్టుకొని నడిపించుకొని పోయెదను. మీ కిష్టము లేనిపక్షమున నిచ్చటనే విడిపోవుదము" అని పలికెను.

దుర్జయసింగు మఱింత యాశ్చర్య మొందెను; కాని తరు ణుని ముఖమండల మవలోకింప సమ్మతింపకుండుట నిష్ప్ర యోజన మని యతనికిఁ దోఁచెను. ఇంతకుఁ బూర్వమే తన ప్రాణములను రక్షించినవాఁ డగుటచే నూతనపురుషుఁడు తనకు హాని చేయఁ డనియు, నతనితోడ్పాటు లేకుండ నట్టి సాంద్రా రణ్యమున మార్గము కనుఁగొనుట కష్ట మనియు దలఁచి

దుర్జయసింగు తన పాగా విప్పి, యతనిచేతిలో నుంచగా, నాతఁడు నిశ్శబ్దముగా దుర్జయుని కన్నులకు గంతకట్టెను.

అనంతర మతఁడు చేయి పట్టుకొని దుర్జయసింగును రమా రమి క్రోసెడుదూరము తీసికొనిపోయెను. మార్గమధ్యమున నెవ్వరు మాట లాడ లేదు. తా నేదిక్కుగా నరుగుచుండెనో దుర్జయునకుఁ దెలియదు. కాని యాకులచప్పుడు వినఁబడుట మాని, పైకిఁ బోవుచున్న ట్లుండుటచేతఁ బర్వతము నారో హించుచున్నట్లు స్పష్ట మయ్యెను. ఒకచోట మార్గదర్శకుఁడు నిలువగా దుర్జయసింగుకూడ నిలువఁబడెను. పడుచువాఁడు కట్టు విప్పి, పాగా దుర్జయున కిచ్చెను. ఆశ్చర్యముతో దుర్జ యుఁడు దిక్కులు పరికింపసాగెను.

అప్పటికి జాము ప్రొద్దు వోయెను. తా నొక పర్వతగుహా యందు ముక్కు మొగమెఱుఁగని భిల్లులమధ్య నుంట దుర్జ యుఁడు గాంచెను. అచ్చట చిన్నదీప ముండెను; దాని వెలు తురులో నెటు చూచిన ననాగరకు లగుభిల్లు లాతని కగ పడుచుండిరి. వారలు తమలోఁ దా మేమో మాటలాడు కొనుచుండిరి. దుర్జయసింగున కామాటలు తెలిసినవి కావు. మాటిమాటికి గుంపులు గుంపులుగా గుహలోనికి వచ్చి భిల్లు లాతనిదెస తేఱి చూచి వెలుపలికిఁ బోవుచుండిరి. దీనికిఁ గారణ మేమో యతనికి బోధపడ లేదు. అతఁడు హిందీ భాషలో మాటలాడఁ బ్రక్క నున్న తరుణునకుఁ దక్క

మఱెవ్వరికిని దెలియు లేదు. ఆ ప్రాయపువాఁడు తన్ను రక్షించి విశ్రాంతికొఱకు నిజమందిరమునకుఁ గొనిపోయి, తన యెడ మరియాదతోఁ బ్రవర్తించుచున్నను, నతని మొగముఁ జూచుటకు దుర్జయసింగు సంకోచించుచున్నాఁ డేల? ఏమో, యతనికే తెలియదు. కాని యాగుహాలో, ఆ భిల్లులను, ఆయల్పభాషి యగు తరుణుని జాడఁ జూడ, దుర్జయసింగు మనస్సులోని యనుమానము మెం డగుచుండెను.

పరిచారకుఁ డొకఁడు నిర్మలసలిలముఁ దెచ్చి యొసఁగగా దుర్జయసింగు కాలుసేతులు గడుగుకొనెను ఆ సేవకుఁడే ఫలములు కొన్ని తెచ్చి యతని యెదుటఁ బెట్టెను. దుర్జయుఁ డనుమానముతో నిటునటుఁ జూచెను. నూతనపురుషుఁడు కానఁబడ లేదు. అంత నతఁడు కొంచెము కోపముతో "నే నారాజపుత్రుని యతిథిని. గృహస్థు అతిథియెదుట భోజనపాత్రము నుంచుట రాజపుత్రధర్మము. ఆలోచించి చూడగా భిల్లుల సాంగత్యముచేఁ జిన్నవాఁడు స్వజాతిధర్మమును విస్మరించినట్లు తోఁచుచున్నది" అనెను.

హిందీభాష నెఱిఁగిన యాభృత్యుఁడు దుర్జయుని వాక్యముల కెంతమాత్రము జంకక "మా ప్రభువుగారు స్వజాతిధర్మమును మఱచిపోవ లేదు. ఒకానొక వ్రతముచేత వారు చోఁడావతులతోఁ గలిసి భుజింపరు ఆకారణమున వారిప్పుడు రాకపోయిరి" అని బదులు చెప్పెను.

అనుమానము దృఢ మగుటచే దుర్జయసింగే మియు స్పృశింపక ఫలములను వదలి లేచి నిలువఁబడెను. అప్పుడు తరుణుఁడే తెంచి గంభీరవాక్కుతో "ఆతిథ్య ధర్మము నెఱపఁ జాలక పోతిని. కారణము పరిచారకుఁడు తమకుఁ దెలిపినాఁడు. తమకు భోజనముపై నిష్టము లేనిపక్షమున విశ్రమింపుఁడు. శయ్య సిద్ధముగా నున్నది" అని పలికెను.

దుర్జయసింగు నల్దిక్కులు పరికించి చూచెను. భిల్లులు గుహాలోనికి వచ్చుచుఁ గ్రమ్మఱ వెలుపలికిఁ జనుచుండిరి. వారిచేతులందు ధనుర్బాణము లుండెను. ఎవ్వరును మాట లాడుట లేదు కాని రాజపుత్రతరుణుని వంక భిల్లులు తమ దృష్టిఁ బఱపుచుండిరి. అతఁడు సనుసైగ చేసినపక్షమున వారు తన ప్రాణములను దీయుటకు సిద్ధముగా నున్నట్లు కనఁ బడుచున్నది. రాజపుత్రయోధమాత్ర మట్టి పని కవకాశ మీయ లేదు

దుర్జయసింగు మిగుల సాహసి, ధీరుఁడు కాని, యట్టి పర్వతగుహాలో, నసంఖ్యాకు లగు భిల్లులనడుమ, నసహాయుఁడై యుండుట జూచుకొన, నతనిగుండె చెదఱిపోయెను. అపరిచిత రాజపుత్ర తరుణుని గంభీరవదనము నవలోకించుచు దుర్జయసింగు నిశ్చేష్టుఁడై యుండెను.

"శయ్య సిద్ధముగా నున్నది" అని యాపడుచువాఁడు పలికెను. అతఁడు దుర్జయుని మిత్రమా? శత్రువా? విరోధి

యగునేని యతనిని రక్షించు టేలనో? అంతియే గాక తననివా
సమున కతనిని దోడుకొనిపోయి ఫలముల నొసగి శయనిం
చుటకు పక్క వేయింప నేల? అతఁడు కులీనరాజపుత్రుఁడు
కావచ్చును. ఏదో కారణమున స్వస్థానచ్యుతుఁడై, భిల్లుల
యందుఁ జేరియుండును. రాజపుత్రు డగుటచే సాటివానిని
విపత్తునుండి తప్పించినాఁడు దుర్జయసింగు నిష్కారణముగా
సందియము నొంద నేల?

ఏమో యతనికే సరిగాఁ దెలియుట లేదు. కాని, యా
దీర్ఘకాయమును, ఉజ్జ్వలనేత్రములను చూడం జూడ నతనిసంశ
యము మెండగుచుండెను. ఆహవరంగమున నెందఱు వైరులు
తనచుట్టు నున్నను సంచలింపని వీరునిహృదయము నే డేల
సడలిపోవలెను? సాలుంబ్రాధిపుని చూడ్కులకును, సాహూ
న్మహారాణావారి దృష్టికిని ఈషన్మాత్ర మయిన వెనుదీయని
స్థైర్యశాలి నేఁ డొక యాటవికుని నేత్రములవంకఁ జూచుటకు
వెనుదీయ నేల?

దుర్జయసింగు మనస్సులో తన్నుఁ దా నిందించుకొని,
సందేహము విడిచి, తనప్రాణరక్షకునితో నిరాఘాటముగా
సంభాషింపఁ దలఁచి "ఆర్యా, తమగుహను, బరిజనులను
గాంచి, యింతవఱకును విస్మయములో మునిగియుండుటచే
తమరు నాకుఁ జేసిన మహోపకారమునకు బదులుగా నొక
మాఱు కృతజ్ఞతావందనము సమర్పించుట సయితము మఱ
చితిని" అని వచించెను.

"వందనములతోఁ బని లేదు. నేను స్వదేశమునకుఁ జేయ వలసిన ధర్మమును మాత్రము నెఱపితిని"

"అయినను మీఋణము నే నెట్లు తీర్పఁగలను ?"

"ఈనాడు తమ రున్నట్లు ఏయనాథ గాని, బాలుఁడు గాని, యసహాయస్థితియం దున్నపక్షమునఁ దమరు వారి కుప కారము చేయుఁడు! ఎవ్వరి కయిన నష్టము జేసియుంటి రేని యిప్పు డయిన ధర్మానుసారముగాఁ బ్రవర్తింపుఁడు. నాకుఁ గావలసినది మ రేదియు లేదు"

దుర్జయసిం గదరిపడెను! ఆచిన్నవాఁడు గతవృత్తాంతముల నెఱుఁగునా యేమి? దుర్జయుఁడు సభయముగా భిల్లులవంకఁ జూచెను. వా రెల్లరు ధనుర్ధరులై యుండిరి వారి నాయకుని మోము వీక్షించెను. అతఁడు వెనుకటివలెనే గంభీరముగా నిలిచియుండెను. భయ మనుమాట నెఱుఁగని దుర్జయసింగు హృదయమున నేఁడు భయసంచారము కలిగెను. ఆభిల్లనాయ కుఁ డెవ్వఁడు?

"పక్క నేసియున్నది" అని యతఁడు మరల పలికెను.

దుర్జయసింగు హృదయోద్వేగము నణచుకొని సదర్ప ముగా "ఇప్పుడే సూర్యమహల్ దుర్గమునకుఁ బోయెదను. పరులయింట నివసించుట దుర్జయసింగున కలవాటు లేదు" అని పలికెను.

“ మీ యిచ్ఛ వచ్చినట్లు చేయవచ్చును. దాని కేమి కాని, తమరు పరులయింట నివసింతురని యే నే ననుకొంటిని. ”

“ తమ రెవరో నే నెఱుఁగను మీకు తోఁచిన యెడల నీయాటవికులచే నన్ను జంపింపఁగలరు. కాని, దుర్జయసింగు నిష్కారణనిందను సహింపఁడు. రాథోడ్ తిలకసింగుతో మాకు వంశానుగత విరోధము కలదు. ఆకారణమున బహిరంగ యుద్ధమున సూర్యమహాలును జయించితిని. అయ్యది కేవలము క్షాత్రధర్మము. ”

“తమరు బహిరంగ యుద్ధపటిష్ఠులు ! సందేహము లేదు కావుననే తిలకసింగు మృతి నొందినపిమ్మట ఆయనభార్యతో యుద్ధము చేసి, స్త్రీని వధించితిరి. తమరు క్షత్రధర్మజ్ఞు లనుటకు సందేహము లేదు !”

ఒక్కపెట్టున వేయివృశ్చికములు కుట్టినట్లు లీమాటలు దుర్జయుని మానసమును బాధించుటయు, రోషముతో మొగము జేవురింప, కన్నులనుండి యగ్నికణములు రాల, నాపాదమస్తకము దేహము కంపిల్ల దేశకాలములను మఱచి, యతఁడు కుప్పించి దుమికి, భిల్లనాయకుని కుత్తుకఁ బట్టెను.

క్షణములో భిల్లులు చాపములందు బాణము లెక్కుపెట్టిరి. తరుణుఁడు వామహస్తముతో వారిని వారించి కుడి చేతితో దుర్జయసింగును తృణమువోలె విసరివైచెను.

దుర్జయసింగు లేచి, యావీరునిదెసఁ జూచెను. ఆపిన్న వాఁడు నిస్పందశరీరుఁడై యుండెను. ఒఱలో నున్న ఖడ్గముపైఁ జేయి వేయ లేదు. వెనుకటి గంభీరస్వరముతో నతఁడు "శయ్యా సిద్ధముగా నున్నది" అని పలికెను.

దుర్జయసింగు తల వంచుకొని "ఇప్పుడే సూర్యమహాలు నకుఁ బోయెదను" అని వచించెను.

అంతట నాపురుషుఁడు దుర్జయుని నేత్రము లుష్ణీషముతో బంధించి, చేయి పట్టుకొని, గుహనుండి బయలుదేఱెను. త్రోవలో నెవ్వరును నోరెత్త లేదు. నిశా వాతముచేఁ బర్ణములు మర్మరధ్వని చేయుచుండెను. అచ్చటచ్చటఁ గొండ వాగుల చప్పుడు వినవచ్చుచుండెను. నడుమ నడుమ నక్క కూతలు మఱియితర వన్యమృగముల కంఠధ్వనులు చెవి సోకుచుండెను. ఆ నిశావాతముచే దుర్జయుని యుష్ణవదనము చల్లఁ బడ లేదు. ఆ ప్రశాంతిచేతను హృదయము శాంతి నొంద లేదు.

రమారమి క్రోసెడుదూరము చనినపిమ్మట నాపిన్నవాఁడు దుర్జయుని కన్నులకట్లు విప్పెను చూడగా నది వరాహము దుర్జయునిపైఁ బడ యత్నించినచోటు. జరిగిన వృత్తాంతము జ్ఞప్తికి వచ్చుటచే నతని యాననము కషాయకాంతి వహించెను. కాని యతఁ డేమియుఁ బలుకక, చీకటిలో తన దుర్గమువంకఁ జనెను.

తూర్పు తెల్లవాఱుచుండ దుర్జయసింగు సూర్యమహాల్ దుర్గములోఁ బ్రవేశించెను అంతవఱకును బ్రభువు వచ్చినాఁడు కాఁడని దుర్గములోనివా రెల్లరు వ్యాకులముగా నుండిరి. అతఁడు వచ్చుటఁ గాంచి, వారు దుర్గాధిపుని సమీపించిరి. కాని, యతని ముఖభంగి నవలోకించి నిశ్శబ్దముగాఁ దొలఁగి పోయిరి. దుర్జయుని స్వభావము వారు బాగుగా నెఱుఁగుదురు.

దుర్జయసింగు చీఁకటిగదిలోనికి కరిగి, మంత్రిని బిలిపించెను. అమాత్యుఁడు యుద్ధమునందు వీరుఁడు, ఆలోచన యందు నిపుణుఁడు. కనుసన్నచేఁ బ్రభువు మంత్రిని గూరుచుండ నియమించెను.

"ఈ దుర్గములో మనము ప్రవేశించి యెన్నిసంవత్సరములయ్యెను ?"

"ఎనిమిదిసంవత్సరములు దాటినవి."

"తిలకసింగుభార్య మరణించినపిమ్మట నతనిపుత్రుఁ డేమయ్యెను ?

"ఈ గవాక్షమునుండి క్రిందిహ్రదములో దుమికి, మృతి నొందెను."

"తిలకసింగు కుమారుఁ డిప్పటికిని బ్రాణములతో నున్నాఁడు."

"తిలకసింగు కుమారుఁడా!"

"ఔను."

"తేజసింగు ? బాలుఁడు తేజసింగు ?"

"అతఁడే! ఇప్పుడు తేజసింగు బాలుఁడు కాఁడు."

"దేవరవారు భ్రాంతి నొందినారు. ఇంత యెత్తునుండి నీటిలోఁ బడినచో మనుజుఁడే బ్రదుకుట కలలోనిమాట! ఇక బాలునిమాట చెప్పవలెనా ?"

దుర్జయసింగు ప్రత్యుత్తర మీయ లేదు, కాని యతని యాననమున క్రోధచిహ్నములు కాన్పించెను.

"అంతకాలముక్రిందటఁ జూచినవాని నానవాలుపట్టుట కష్టముగదా, తమరు వాని నేలాగుఁ గుర్తించితిరి ?"

"వాని మొగమును జూచి కాదు వాని మాటల వలన ఇంకొకసంగతివలన."

"అడుగవచ్చునా ?"

"తిలకసింగుతో నే నొకసారి బాహుయుద్ధము చేసితిని. అతనివంటి బలవంతుఁడు మేవాడ్ రాజ్యమునఁ లేఁడు. అతనికిఁ గల రణకౌశలము రెండవవానికి లేదు. తేజసింగునకు జనకుని బలము నేర్పును గలవు."

ఉభయులు మిన్నకుండిరి. అమాత్యుఁడు ప్రకటముగాఁ జెప్పలేకపోయినను, ప్రభునిమాటలు విశ్వసింప లేదు; రాత్రి వేళ నెవ్వనినో మహాబలవంతుని గాంచి, దుర్జయసింగు భ్రమపడె నని భావించెను.

క్రౌంచెము సేపటికి దుర్జయసింగు "ఇంక కాకమాట" అని పలికెను.

"ఆజ్ఞాపింపుడు."

"తేజసింగు నాప్రాణరక్షణము చేసినాఁడు?"

ద్వారము తెఱచిరి. ఒంటిగా దుర్జయసింగు మేడపై నిటు నటు దిరుగుచుండెను. ఆతని ముఖభంగి నవలోకించుచో నెంతటి ధైర్యశాలి యయినను బెగడొందుచుండెను.

## ౩

ప్రాతఃకాలమునుండియు సూర్యమహాల్ దుర్గమున ప్రయాణ సన్నాహము కాఁజొచ్చెను. తూర్పుదిక్కునుండి లేతనీరెండ సైనికుల ఖడ్గములమీఁదను, బల్లెములమీఁదను ప్రసరించి, ప్రతిఫలించుచుండెను. భటులు మహోల్లాసముతో సమావేశము కాఁదొడఁగిరి. దుర్జయసింగు యోధుల కోలాహలము నాకర్ణించి, మేడమీఁదినుండి క్రిందికి డిగ్గి, యశ్వారోహణము చేసి, వారినడుమఁ జేరెను. తోడనే వేయికంఠములనుఁడి వెలువడిన జయధ్వని దుర్గమున మాఱు మ్రోఁగెను.

ఉల్లాసకర మగు వసంతసమయ ప్రాతఃకాలమున సేన పర్వతములమీఁదుగను, బీలములగుండను, అరణ్యముల నడుమగను బయనము చేయుచుండెను. వృక్షములందు విహంగ

ములు గానములు చేయుచుండెను; ఆకులపై నుండు బిందువులు మెఱయుచుండెను. ప్రభాతసమీరణము సైనికుల పతాకలతో పర్యాటలాడుచుండెను; పర్వతశిఖరములు మేవాడ్ దేశపు రక్షకభటులవలెఁ గానఁబడుచుండెను. ఇంతలో సైన్య మొక పర్వతము మీదుగాఁ జర జొచ్చెను: కొన్ని నిముసములవఱకు నా శైలముమీద సమరవాద్యములు మ్రోయుచుండెను. అటు నిటు గదలు జెండాలు కన్నులపండువుగాఁ గానఁబడుచుండెను. వాహిని కొండ దిగి, వనములోఁ బ్రవేశించెను. మహీధరము వెనుకటివలెనే నిర్జనము ప్రశాంతము నయ్యెను.

వనశోభ గాంచి భటులు మహానందము నొందిరి. సూర్యకిరణములు ప్రయాసతో నేలపై వ్యాపించుచుండెను; పులుగులు మనోహరధ్వనులు చేయుచుండెను. ఆ వనస్థలి పక్షుల యుత్సవమందిరమువలెను, నయ్యది పండుగు దినమువలెను నుండెను. బలము విపినమును దాటి చనెను. మరల నా ప్రదేశము ప్రశాంతి మయ్యెను. విహంగముల మధుర కూజితములు మాత్రము కాననమునఁ జెలఁగుచుండెను.

వనము దాటినపిమ్మట విస్తీర్ణ మగు మైదానము సైన్యము ప్రవేశించెను. అటుతరువాత చంద్రపుర మను గ్రామము త్రోవలో నుండెను. చంద్రపురము మొదలుగాఁగల కొన్ని యూళ్ళు సూర్యమహాల్ దుర్గాధినాథుని "వశి" గ్రామములు. యుద్ధసమయములయందు కొన్నియూళ్ళ ప్రజలు తమతమ

ప్రాణములను, సంపదలను, రక్షించుకొనఁ జాలక పరాక్రమశాలి యగు నధిపునికి లోఁబడుచుందురు. ఆ యధిపుఁడు వారిని రక్షించును. అప్పటినుండియు వార లతని "వశీలు" అగుదురు. వారు వ్యవసాయము చేయుదురు. కాని వారి కిక స్వాతంత్ర్యము లేదు. ప్రభువు భూమిని విడిచి పోవుటకు వీలు లేదు. అతని యానతి నుల్లంఘింప వలను పడదు.

చంద్రపురము మొద లగు గ్రామములు మేవాడ్ దేశపు నిరంతరయుద్ధములచే విసిగి వేసారి, తమ్ముఁ దాము రక్షించుకొనలేక, సూర్యమహాల్ దుర్గాధిపతికి లోఁబడెను.

రాథోడులు సూర్యమహాల్ దుర్గప్రభువులుగా నున్నంత కాలము చంద్రపురవాసులకుఁ గష్టములు లేకుండెను. కాని, తిలకసింగు మృతి నొందినతరువాత నాయూరు దుర్జయసింగు చేతులలోఁ బడెను. స్వభావముచేతనే దుర్జయుఁడు కోపిష్ఠి; చంద్రపురగ్రామవాసులు మృతి నొందిన ప్రభువునెడ ననురక్తులై యుండి రని గ్రహించి మఱింత క్రుద్ధుఁ డాయెను. అతఁడు ప్రజలను సర్వదా పీడింపఁ జొచ్చెను. వారలపై పన్నులు విధింపఁ జొచ్చెను, కొందఱ సర్వస్వములను హరింప సాగెను. ఈ యక్రమకార్యముల కలిగి, యాగ్రామములో ప్రముఖుఁ డగు గోకుల దాసు కుమారుఁడు కేశవదాసు, "ఈదౌర్జన్యము చాలకాలము జరుగఁ బోదు, తిలకసింగు కుమారుఁడు రాజ్యము నేలును. దైవానుగ్రహమున

నా సుదినము శీఘ్రముగా వచ్చునుగాక !" అని పలుకుచుండు వాఁడు.

దుర్జయసింగు ప్రజాపీడనము దినదినము హెచ్చఁజొచ్చెను. ప్రజలు వాని దుండగమునకు తాళఁజాలక, తుదకు సభ చేసిరి. "మన మెందుల కీదుర్జయుని దాసుల మగుదుము? మనప్రభువు తిలకసింగు మృతి నొందినాఁడు. దుర్జయసింగాయన యుత్తరాధికారియా? త్రోవలు కొల్లపెట్టు దొంగకు విరుద్ధముగాఁ బ్రవర్తించినను మనలను స్వామిద్రోహ దోషము చుట్టుకొనదు. మన "బాపతా" (పరంపరగా వచ్చు హక్కు) దుర్జయసింగునకు విక్రయించలేదే! తిలకసింగు నుత్తరాధికారి వచ్చునేని మన మాత్మదాసులము. ఇంకొకనితో మనకుఁ బని లేదు" అని ప్రజలు నిశ్చయించిరి.

ఈ వృత్తాంతము తెలియగా, దుర్జయసింగు మండిపడి గ్రామములోని ప్రధానపురుషులను గొందఱను దన దుర్గమునకు లాగుకొని పోయి, యెల్లరకును జరిమానా విధించెను. సర్దారు కుమారుఁడగు కేశదాసుపై రాజద్రోహము మోపి, యతని నురిదీయించెను.

మూడు సంవత్సరములు దాటినవి. దుర్జయసింగు నేఁడు ససైన్యముగాఁ జనుచుండ, చంద్రపురము వెలుపల పొలములో దీర్ఘకాయుఁ డొక డతనికిఁ గనఁబడెను. అతఁడు గోకులదాసు. అతనిం జూచి దుర్జయసింగు ద్వేషముతో "ముసలి

వికా! వన్ను తెచ్చి యీఁదలఁచుచున్నావా? స్వజాతి ధర్మానుసారముగా దురాలోచనలు చేయుచున్నావా?" అని ప్రశ్నించెను.

సైన్యము వచ్చుచుండుటచే గోకులదాసు ప్రక్క కొదిగి నిలిచియుండెను. దుర్జయునిచే నవమానము నొంది గోకుల దాసు కుపితుఁ డయ్యెను. కాని, దాసుఁడు బలవంతుఁ డగు తనప్రభువు నేమి చేయఁగలఁడు? మెల్లగా నతఁడు తన పుత్ర హంతకు నమస్కారము చేసెను.

దుర్జయసింగు మరల వెనుకటివిధముననే వృద్ధుని బ్రశ్నించెను. రెండవపర్యాయ మావాక్కుల నాకర్ణించి, వచ్చిన కోపము నణచుకొని మెల్లగా "దేవా, దురాలోచనలుచేయుట మావంశాచారము కాదు" అని మాత్రము పలికెను.

"ఓహో! పిటికినక్కవంగన మెన్నిదినములనుండి సదా లోచనలు చేయనారంభించినది? వశీ వంశ మెన్నిదినముల నుండి సన్మార్గమునఁ బ్రవేశించినది?"

"ప్రభూ, మాదౌర్భాగ్యవశమున మేము వశీ వంశముకార మగుట నిక్కమే. కాని దానత్వముతోఁ బిటికితన మింకను బట్టువడ లేదు. మేము రాజపుత్రులము."

తెలివిమాలిన గోకులదాసు తనకుఁ దానే మృత్యువును గొనితెచ్చుకొనుచున్నవాఁ డని సైనికులు భావించిరి. దుర్జయ సింగు మహాగ్రహముతో "ఓరీ ముసలిదొంగా! కొడుకు

చచ్చినను రాజునెడల నెట్లు ప్రవర్తింపవలెనో తెలియలేదా? దుర్జయసింగు తన దాసులకు సత్ప్రవర్తన నేర్పుట యిట్లే" అని పలికి, దగ్గఱ నున్న గోకులదాసును కాలితోఁ దన్నెను. పాప మావృద్ధుఁడు నేలపైఁ గూలెను. నిశ్శబ్దముగా సైన్య మచ్చోటు వాసెను.

శ్వేతశ్మశ్రువు, దీర్ఘకాయుఁడు, వృద్ధుఁడు నగుగోకులదాసు మెల్లగా లేచి నిలువఁబడి, నభోమండలము దెస దృష్టి నిగిడ్చెను. పిమ్మట దుర్జయసింగు చనుచున్న వైపు చూచి, "దుర్జయా, నీకు నమస్కారము. పుత్రశోకమును మఱచుచున్న సమయమున నీవే యీసంగతి నాకు జ్ఞాపకము చేసితివి. ఒకనాఁడు దీనికిఁ బ్రతిఫల మనుభవింతువులే!" అనెను.

## ౪

సాలుంబ్రాపర్వతదుర్గ మీనా డెంత మనోహరరూపమును దాల్చి యున్నది! చోండావదస్వామ్య ప్రధాన ధ్వజము కొండకొమ్ముపై గాలితాకులఁ జలించుచున్నది. దుర్గమునం దచ్చటచ్చట మఱికొన్ని పతాకలు తేలియాడుచున్నవి. అనేకతోరణములచే దుర్గ మలరారుచున్నది. చోండావద్వంశ్యు లగు దండనాయకు లెల్లరు సాలుంబ్రాకు విచ్చేసినారు. కొందఱు సేనానులు రెండువందల దళములతోను, మఱికొంద

అయిదువందల బలముతోను, వేఱొకకొందఱు సహస్రసైన్య ముతోను చోండావత్కులాధీశ్వరుఁడగు రావత్ కృష్ణసింగు సన్నిధికి వచ్చినారు. సేనాధిపులు ప్రభుదర్శనార్థము ప్రాసాదమునెదుట వేచియుండిరి. సైనికులు పర్వతపాదమందలి సమతలమునఁ బటకుటీరములను నిర్మించిరి. నల్దిక్కుల సమర వాద్యములు మ్రోగుచుండెను. యోధులయుల్లాస ధ్వనులు నడుమ నడుమ వినవచ్చుచుండెను. బాలసూర్యాతపము శిబిరములపైఁ బ్రసరించుచుండెను. ప్రభాతశీతలపవమానము పతాకలతో నయ్యాట లాడుచు, రణవాద్యధ్వానమును బహు దూరము విస్తరిల్లఁ జేయుచుండెను.

రణవాద్యములతోఁబాటితర వాద్యములు గూడ వినఁబడెను. ఫాల్గునము హోళీమాసము మార్గములయందును గృహములందును పౌరులు గానములు సేయుచుండిరి. బుక్కా పొడి నిరర్గళముగా రాలుచుండెను. మేవాడ్ రాజ్యమునకు రానున్న మహావిపత్తు ప్రస్తుతానందమున విస్మృతమయ్యెను. పలుతెఱఁగుల వింతలు జరుగుచుండెను. బుక్కా పొడినుండి తప్పించుకొనుటకు వీలు లేకుండెను పండుగునాఁడు గొప్పవారు కొద్దివారు సమానులగుదురు సాలుంబ్రా ప్రభువు గాని, మంత్రి గాని, మార్గమునఁ జనునప్పుడు పౌరులు వారిపై బుక్కా చల్లుచుండిరి: వారును విసువు చెందుటలేదు చిన్న పిల్లవాండ్రు వృద్ధుల తెల్లగడ్డములకు రక్తవర్ణము నాపాదించు

చుండిరి. ఆముసలి వాండ్రు తమ్ము దండింప రాగా, వారల కన్నులనిండ మఱింత పొడి చల్లి, కరతాళములు వైచుచు, పెద్దపెట్టున నగుచుండిరి. కృష్ణసింగుప్రాసాదము మొదలు దరిద్రుని కుటీరము వఱకు నెక్కడఁ జూచినను బుక్కాపొడియే! బాలురు వృద్ధులు గుంపులు గుంపులుగా మార్గమువెంట నడచుచుండిరి. లలనాజనము తండోపతండముగాఁ గూడి మనోహరముగా గీతములు పాడుచుండెను.

రమారమి మూడవ జామునకు రావత్ కృష్ణసింగు 'దరీ శాలకు' అనగా సభాభవనమునకు విచ్చేసెను. చోండావతుల యశోగీతములం బాడుచు, గాయకుఁడు రాజున కెదురుగా భవనములోఁ బ్రవేశించెను. సభాభవనమున దుర్జయసింగు మొద లగు సామంతయోధులు భయభక్తులతో నిలిచియుండి "మహారాజునకు జయ మగుఁ గాక!" అని పలికి అతనికి నమస్కారము చేసిరి. కృష్ణసింగు నతశిరస్కుఁడై, విజాభ్యుదయము నభిలషించుచున్న యోధుల యభివాదనములను స్వీకరించెను

పిమ్మట రావత్ కృష్ణసింగు సింహాసనము నధిష్ఠించెను. అతని కిరుప్రక్కల యోధులు నిలువఁబడి యుండిరి. వారల హస్తములయందు ఖడ్గములు డాలులు మెఱయుచుండెను. ఆవీరులను సానందముగా వీక్షించి, సాలుంబ్రాధిపతి కూరుచుండ నియమించెను. యోధులు తమతమ స్థానముల యందుఁ

గూరుచుండిరి. డాలుతో డాలునకుఁ గలిగిన సంఘర్షణధ్వని సభాభవనమున నిండిపోయెను.

ఎల్లరు నాసీను లయిన పిమ్మట వృద్ధుఁ డగు కృష్ణసింగు గంభీరవాక్కులతో ని ట్లుపన్యసించెను:

“వీరులారా, నేడు మన మండలము నిచ్చట సమావేశ మగుటకుఁ గారణము మీకు విదితమే. చితోడ్ దుర్గము తుర్కీవాండ్ర చేఁజిక్కినది. మేవాడ్ రాజ్యపుటుర్వరయు సమభూమియు వారి యధీనమునందే యున్నది. పర్వతభూము లందును గాననసీమలందును మాత్రము మేవాడ్ రాజ్యలక్ష్మి దాగి యున్నది. తత్ప్రదేశములనుండి మ్లేచ్ఛు లామెను పారింపఁ దలఁచుచున్నారు.

“ఉత్తరమున కుమల్నేరునుండి దక్షిణమున రుక్సనాథము వఱకును గల పర్వతప్రదేశము మాత్రము మహారాణావారి యధీనమునం దున్నది. మిగిలిన దేశమంతయు మొగలుల యాజ్ఞలో నున్నది. కాని దానివలన వారి కేమియు లాభము లేదు. మహారాణావారి యానతిచొప్పున నాప్రదేశ మంతయు మహారణ్యముగా మాఱినది. అచ్చోట నిప్పుడు కాపువాండ్రు నేల దున్నుట లేదు; గొల్లలు పశువులు మేపుట లేదు; నరసంచారమే లేదు. మహారాణావారి యాజ్ఞానుసారముగా జను లెల్లరుఁ బర్వతభూములలో నివసించుచున్నారు. బనాస్ రావి నదీతీరములందలి యుర్వరం భూతుంపమ్ముగ శరణ్య మగు

శరణ్యముగా నున్నది. ఆరావళీపర్వతములకుఁ దూర్పుననుండు
మేవాడ్ భూమి ప్రదీపశూన్యమై యున్నది !

"మహారాణావారి యాదేశము నెవ్వఁ డుల్లంఘింపఁ
గలఁడు ? వారు స్వయముగా నాయాప్రదేశములను దఱచుగా
దర్శించుచుందురు. వారివెంట సాలుంబ్రా యనేక పర్యాయ
ములు చనియుండెను. అరణ్యము నిశ్శబ్దముగా నుండునది;
పొలములయందు దడవిగడ్డి మొలచి యుండునది; అదివఱకు
మార్గములుగా నున్నతావులందు తుమ్మచెట్లు పెరిగి యుండు
నవి; మానవులు నివసించుపట్ల శ్వాపదములు వాసము చేయు
చుండునవి. ఒకపర్యాయము గోరక్షకుఁ డొకఁడు బునాస్
నదీతీరమున వివిక్త స్థలమునందుఁ బశువులను మేపుచుండెను.
ఆ యపరాధమువలన వాని యస్థిపంజర మిప్పటికి వృక్షమున
వ్రేలాడుచుండ వచ్చును. అటుపిమ్మట నెవ్వఁడు గాని చండ
శాసను లగు మహారాణావారి యానతి నతిక్రమింప లేదు.

"ఉద్యానమువంటి మేవాడ్ దేశ మిప్పుడు పనికిరాని
మహారణ్య మయ్యె నని మొగలులు తెలిసికొందురు. మహా
రాణావారితో యుద్ధము చేయవలె నన్నఁ గారడవులు దాట
వలసి యుండు ననియుఁ దమకు భోజనసామగ్రులు లభింప
వనియు నిలుచుటకు తావు దొరకదనియును తెలిసికొందురు.
సూరత్ మొదలగు పశ్చిమ సముద్రపు రేవులతో డిల్లీకిఁ గల
వాణిజ్య సంబంధము విచ్ఛిన్నమయినది. ఇపుడు సరకులు

కాననము గుండఁ జనవలెను. అవి గమ్యస్థానమును జేరుట కల్ల!

"యోధులారా! యివ్విధమున మనము మేవాడ్ బహిర్ద్వారమును రక్షించుచున్నాము. పర్వతభూములలోఁ బ్రతి దుర్గమునందును సైన్య మున్నది. చోండావతులు శీఘ్రముగా మహారాణావారి సన్నిధి కరిగెదరు; ఇతరవంశముల వారును జనుచున్నారు. బహిరంగయుద్ధమునకై మహారాణావారికి బలములు దొరకక పోవు. రణపటిష్ఠులు కాని భూమిజాలు తమతమ నివాసములను రక్షించుకొనుచుందురు. ఆటవికులు ధనుర్ధరులై సంగ్రామమునఁ జొత్తురు. దక్షిణమునుండి భిల్లులు తూర్పునుండి మీరులు, పశ్చిమమునుండి మీనాలు తుర్కీవాండ్రను సంగరమున కాహ్వానింతురు. మానసింగ్ మహారాజు సలీమువెంట మహాసన్నాహముతో వచ్చుచున్నాఁ డని తెలిసినది. అతనిని మన మాహ్వానింతము.

"వీరులారా, యీ హోళీపండుగునాడు పౌరులనుండి మీకుఁ బరిత్రాణము లేదు. మీమీ దేహములనిండ బుక్కాపొడి కాన్పించు చున్నది. కొంటెపిల్లవాండ్రు మీ పలిత శ్మశ్రువును, కేశములను నెఱ్ఱగాఁ జేసినారు; పురమునకుఁ గెంజాయ ఘటించినారు. యోధులారా, మఱియొక హోళీ దినము వచ్చుచున్నది; అయ్యది వీరులకు సంతోషదాయకమగు వాసరము. ఆనాఁడు యోధుల మస్తకములు, వక్షములు,

నితరావయవములును మఱియొక ప్రకారముగా రక్తవర్ణముఁ దాల్చును; ఈపర్వత ప్రదేశమంతయు రక్తాలంకృత మగును. ఇప్పుడు మీరు నాగరకులగానమును వినుచున్నారు; అప్పుడు మఱియొక విధ మగు గానము వినఁబడును. యోధులారా, యాయుత్సవమునకు సంసిద్ధులై యుండుఁడు !”

సాలుంబ్రాధిపతి వచించిన వాక్యములచేఁ బరవశులై యోధు లెల్లరు సింహనాదము చేసిరి. ఖడ్గముల ఝణఝణ ధ్వానము సభాగృహమున నిండెను; ఆసింహనాదము నా ఝణఝణధ్వనియు సాలుంబ్రా పర్వతశిఖరము నతిక్రమించి నభోమండలమున వ్యాపించెను. ఆనిస్వన మాగినో లేదో సభాభవనమున గీతధ్వని వినఁబడ సాగెను. ఆస్థానకవి యగు వృద్ధచారణుఁడు గీతము నుపక్రమించెను.

ప్రాయమం దున్న మీ దృష్టి భావికాల
మును విలోకించుచుండును; ముసలివాఁడఁ
గాన, నాతలంపులు భూత కాలమువయి
నిలిచి యుండును నిరతంబు నిశ్చలముగ.

నేడు రాణాకు లేదు “ చితో ” డతండు
శిఖరి భూములఁ గానన సీమలందు
కాలముం బుచ్చుచున్నాఁడు కష్టములను
బరిగణింపక తన కుటుంబమ్ముతోడ.

ఇట్టి వీరాగ్రగణ్యు నే నింకొకనిని
చూచి యుంటిని పూర్వ మోశూరులార !
అతఁడును బర్వతంబుల నాశ్రయించి,
తిరుగు చుండెను గటకటా ! దిక్కు లేక.

అతఁడు తన చిన్నతనమున నన్నతోడఁ
జనియె నొకనాఁడు చారణీ సముఖమునకు.
అచటఁ బఱచిన యొక్క వ్యాఘ్రాజినంబు
పైనఁ గూర్చుండె నప్పుడు డా బాలకుండు.

చారణీదేవి యదిగాంచి సంభ్రమంబు
తోడ నిట్లనియెను : " పులితోలు మీఁద
నిప్పు డెవ్వఁడు కూర్చుండె నింక మీఁద
నతఁడె కూర్చుండుఁ దండ్రి సింహాసనమున. "

అనుటయును నాగ్రహోద్రగుఁ డగుచు నన్న
గారు తమ్మునిపైఁ బడి, ఖడ్గమునను
బొడువగా గన్నొకటి లొట్టవోయె నకట !
బాలకుఁడు మాత్ర మెట్టులో పాఱిపోయె.

అరయుఁడీ ! గొల్లవాండ్ర మధ్యమ్మునందు
జీర్ణవసనంబుఁ గట్టిన చిన్నవాఁడు
కనఁబడుట లేదె యొకఁడు మీకున్నులకును ?
పాఱిపోయినవాఁడె యా బాలకుండు !

క్షాత్రతేజంబు పోవునే త్యాగములను
గాచు చున్నంత మాత్రాన కాని, పెద్ద
గొల్ల యెఱుఁగడు బాలుని కులము తెఱఁగు :
కానిచో నేల దండించుఁ గఠినముగను ?

వెదకుఁడీ జాగరూకులై విపినభూమి
తరువుక్రింద ఖడ్గంబుపాధానముగను
చక్కఁగా నిద్రపోయెడి సైనికుండు
కనబడుట లేదె యొకఁడు మీకన్నులకును ?

శ్రీపురాధీశుఁ డైన కరీము చాఁదు
నొద్ద కొలువున కున్నట్టి యోధుఁ డితఁడె;
పాప ! మీతఁడె యగ్రజు బారి నుండి
పాఱిపోయిన యానాటి బాలకుండు !

సాగి పోయెను కొన్ని వత్సరము; లప్పు
డతఁడు పొందెను తండ్రిసింహాసనమ్ము
పదియు నెన్మిదిపోరులఁ బరుల గెల్చి
వీరుఁ డాత్మీయ రాజ్యంబు వృద్ధి చేసె.

వింధ్య భూమీధర శతద్రూ ద్వీపవతుల
నడుమ నున్నట్టిదియు, యమునా నదికిని
సింధు నదమునకును నడిసీమ యెల్లఁ
జిక్కియుండెను సంగ్రామ సింహుచేత.

కెరలి భారతఖండంబు గెల్చి పృథ్వీ
రాజ చోహాణురీతి సంగ్రామసింగు
సార్వభౌముడు కాఁగల సమయ మబ్బె
నే మిగుల దీనులై యున్న హిందువులకు !

అట్టి భాగ్యము లే దయ్యె నకట మనకు !
'బాబ' రనియెడు నొక మొఘల్ ప్రభువు మిగుల
గొప్ప సైన్యము నొకదానిఁ గూరుచు కొని
వచ్చి మనవారిపైఁ బడె వర్షమువలె.

చెలఁగి వీరుఁడు సంగ్రామసింహుఁ డపుడు
బాబరునితోడఁ బోరెను భయదముగను.
మ్లేచ్ఛరక్తప్రవాహంబు మించి పాఱె;
కాని ద్రోహముచేత సంగ్రాముఁ డోడె !

ఓడి పోయినపిదప నాయోధుఁ డిట్లు
ప్రతినపట్టెను నెల్లరు భటులు వినఁగ
"వాని యుద్ధమునం గెల్చువఱకు నేను
కాలుపెట్ట చితోడు దుర్గమ్మునందు !"

చెప్పిన ప్రకార మాతఁడు చేసినాఁడు
రాజధానిని జొరలేదు, రాజభోగ
ములు విసర్జించి 'కాణ్వహా' భూములందు
చివరవఱకును సంగ్రామ సింహుఁ డుండె.

అతని సామంతు లే మయి రకట, పదియు
నార్గు రుండెడివారు, శతాధిపు లగు
రావతులు రావలును బరాక్రమనిధు
లెచట నున్నారు? సైన్యంబు లెచటి కేగె?

జగమునందుండి సర్వాతిశాయి యయిన
యామహాతేజ మెచటనో యణగిపోయె!
కాని యాలాటి తేజస్సు తన్మాతలమునఁ
దిరుగఁ వెల్గుచు నున్న దీదినములందు!

మనకు వెనుకటి రోజులు మరల వచ్చు,
క్రిమ్మట చితోడు వేగ రాఁగలదు మనకు
ధన్యుఁ డైనట్టి రాణాప్రతాపుయశము
నిండియుండును భారతఖండమందు!

గీతము సమాప్తి నొందెను. సభామందిరము నిశ్శబ్దముగ నుండెను. చప్పున యోధుల సింహనాదము సాలుంబ్రా పర్వతమును జలింపఁ జేసెను. కొండక్రిందివారలు దాని నాకర్ణించి శతగుణముల వృద్ధి నొందించిరి.

చారణదేవుఁడు నిజస్థానమున నాసీనుఁ డయిన పిమ్మట సాలుంబ్రాధిపతి వారి నుద్దేశించి యి ట్లనెను: "వీరులారా, యుద్ధమున కిక నెంతో యాలస్యము లేదు. కదనమునందు సర్వదా సాలుంబ్రా మహారాణావారి దక్షిణపార్శ్వమున

నుండును. సేవలను సమకూర్చుటకు నే నిచ్చటికి వచ్చినాను. చోండావతులలోఁ బ్రధానదండనాథులు విచ్చేసినారు. మహా రాణావారి ప్రస్తుతరాజధాని యగు కుమశ్నేర్ దుర్గమునకుఁ బ్రభాతమునఁ బయనము చేయుదము. వీరులారా, సభ చాలింతము. హోళీపండువు గదా నేఁడు! ఒక్కపర్యాయము వాత్సరికోల్లాసము ననుభవింతము నడువుఁడు! ముందువచ్చు హోళీ చూడఁ గల మని యెవ్వఁడు చెప్పఁగల్గును?”

ప్రాసాదము నెదుట విశాలమగు సమప్రదేశమున గుఱ్ఱముల నెక్కి, యోధు లొండొరులపైఁ జూర్ణము చల్లుకొనఁజొచ్చిరి. వారల శరీరములు గుఱ్ఱముల మేనులును గుంకుమతో నిండి పోవుచుండెను. అశ్వముల పాదధ్వనియు, వారి యుల్లాసరవ మును గలిసి నల్దిక్కుల వ్యాపించుచుండెను. హయములు నయితము క్రీడామగ్నము లయిన చాడ్పున నొకసారి వేగముగాఁ బరుగిడుచు, మఱియొకమాఱు చప్పున నిలిచి పోవుచు, ఇంకొక తడవు కుప్పించి దుముకుచు, నానావిధముల సంతోషము నను భవించుచుండెను. అశ్వారోహులు మిగుల నిపుణతతోఁ దుర గముల నడపుచుఁ, దమతమ ప్రతిద్వంద్వులు చల్లు కుంకుమ పొడినుండి తప్పించుకొనుచు, దాము వారలపైఁ జల్లుచుండిరి.

పర్వతము క్రిందనున్న సైనికులును పౌరులతోఁ గలిసి క్రీడామగ్ను లగుచుండిరి. ముందు సంవత్సరమునాటికి సైనికు

లలోను, దండనాథులలోను నెందఱు హోళీపండువును జూడఁ గల్గుదురో! అంతకు బూర్వమే మఱి యెన్ని వేలమంది యుద్ధ రంగమునఁ జిర నిద్రాభిభూతు లగుదురో!

## ౫

చోండావత్కులాధినాథుఁడు సాలుంబ్రాధిపుఁడు నగు కృష్ణ సింగు చోండావత్సైన్యముల నెల్ల వెంటఁ బెట్టుకొని, కొద్ది దినములలో కుమల్మీర్ దుర్గమున నున్న మహారాణావారిని సందర్శించెను. ఇతర గోత్రముల యోధులు గుంపులు గుంపులుగా రాఁ దొడఁగిరి. దేవగఢమునుండి సంగావత్కులేశ్వరుఁడు రెండువేలబలముతో వచ్చెను. సంగావద్గోత్రము చోండావత్కులము శాఖయే. బేద్నూర్ నుండి మర్త్యకులాధిపు లపరిమిత సైన్యముతో విచ్చేసిరి. వారు రాఠోడ్ వంశీయులు. మేవాడ్ రాజ్యమున వారికంటె సాహసులు లేరు. ఈవంశము లోనివాఁ డగు జయమల్లు చితోడ్ ధ్వంసనమయమున నసామాన్య శౌర్యము గనఁబఱిచి, తుదకు అక్బర్ చేత నిహతుఁ డయ్యెను. అతనిపుత్రు లిప్పటికి నావృత్తాంతమును మఱువ లేదు. జనకునివలె విక్రమముఁ జూపుటకు మహారాణాసన్నిధి కేతెంచిరి. కైలవానుండి గజావద్వంశము విశేషవాహినితో నరుదెంచెను. ఇదియును చోండావద్వంశశాఖయే. ఈగజావ

ద్వంశోద్భవుఁ డగు 'పత్తు' అను వీరశ్రేష్ఠుఁడు చితోడ్ ధ్వంస సమయమున మహాపరాక్రమము మెఱయ మొగలులతో యుద్ధము చేసెను. సాలుంబ్రాధిపతి షాహీందాస్ నేలఁ గూలిన తరువాత సూర్యద్వారమును రక్షింపఁ జొచ్చెను. తనతల్లియు భార్యయును గన్నులయెదుట యుద్ధక్షేత్రమునఁ గూలినను, మొక్కవోని ధైర్యముతోఁ బోరిఁ తుదకు తానుగూడ నీ లోకము విడిచెను. అతనిజ్ఞాతి యొకఁడు గజావద్వంశప్రభుఁడై, వంశగౌరవమును నిలుపుటకు మహారాణా సన్నిధానమున కేతెంచినాఁడు. దైలవారానుండి ఝూలావంశము; బైదలా కోటారులనుండి చవాణ్ వంశము; బిజలీనుండి ప్రమర వంశము; ఇతరప్రదేశములనుండి యితరవంశములును మహాపరాక్రమశాలి యగు ప్రతాపసింగునకు సల్వంకల మేఘరాసుల వోలె సమావేశ మయ్యెను. భరతఖండమున నిట్టి దేశభక్తులుఁ స్వాతంత్ర్యప్రియులు, స్వధర్మనిరతులు, మహావీరులు నగు పురుషులు మఱి లేరు.

నేఁడు ఫాల్గుణమాసావసాన దివసము. సాంవత్సరికోత్సవవుఁ జివరరోజు. కాబట్టి సైనికు లుత్సవపుమత్తులో నుండిరి. పర్వతశృంగముల మీఁదను, బాదమునందును, బురవీధులందును, గృహావరణముల యందును నగ్నిగుండము లనేకములు వెలుఁగు చుండెను. వాని వెలుతురు నిర్ఝరిణీగర్భములఁ బ్రతిఫలించుచుండెను. సైనికు లెల్లరు నుల్లాసముతో గీతములు

పాడుచుండిరి. నడుమ నడుమ చారణులు మేవాడ్ దేశమును గూర్చి బహువిధముల గీతములను బాడుచు, వీరభటులకు సంతసము కలిగించుచుండిరి. ఎచ్చట విన్నను నానంద ధ్వనియే.

ఈయుత్సవమునకు దూరముగాఁ బర్వతముమీాద యోధుఁ డొకఁ డిటు నటు దిరుగుచుండెను. అతఁడు మాటిమాటికి నాగుచుండెను; కాని గీతముల నాలకించుటకుఁ గాదు. అప్పు డప్పుడు నేత్రయుగ్మమును బైకెత్తి కనుచూపు మేరలో నున్న వస్తువులపై నిలుపుచుండెను; కాని యగ్నికుండములను జూచుటకుఁ గాదు. నడుమ నడుమ దుర్గశోభ నవలోకించు చుండెను; వాహినులపై దృష్టి ప్రసాదించుచుండెను; గుండె లపైఁ జేయి వైచుకొని నక్షత్రవిభూషితం బగు నభోమండ లముదెసఁ జూడ్కులు నిగిడ్చుచుండెను. అతఁడు మహారాణా ప్రతాప సింగు!

ప్రతాపసింగు కటిబంధమున ఖడ్గము వ్రేలాడుచున్నది. చెంగట తృణశయ్య యున్నది. "చిత్తోడును మరల స్వాధీ నము చేసికొనక పూర్వ మన్యశయ్యపైఁ బవ్వళింప" నని యాయోధ ప్రతిజ్ఞ చేసినాఁడు. తన మనోరథ మీాడేరువఱ కును ప్రతాపసింగు బంగారు వెండివస్తువులను స్పృశింపఁడు, వపనము చేయించుకొనఁడు, ఆకులవి స్తరియందే భుజించును, సామాన్యపరిచ్ఛదమును ధరించును. తమకోరిక నెఱవేఱుటకుఁ

బ్రాచీనఋషులు ప్రతాపసింగు ప్రతముకంటెఁ గఠోర ప్రత మును బూనియుండరు. లోకములో వీరాగ్రగణ్యులు సయి తము తమ యభీష్టసిద్ధికొఱకు ప్రతాపునికంటె నెక్కువ యత్నము జీవితాంతమువఱకును జేసి యుండరు.

హిందూ దేశములోని యైశ్వర్యము, బుద్ధిబలము, వీర్యము, బాహుబలము, ఆయుధబలము నతనికి విరుద్ధముగా నేకీభవించి నిలిచినవి. ఈ నిర్జనపర్వతముపై నున్న వీరుఁడు దేశమంతయు దన కెదురుగా నిలిచినను యుద్ధము చేయ సమకట్టినాఁడు. పరాజయ మైనను నే మయినను సంఘటిల్లును గాక, నిజప్రయ త్నమునుండి విరతి నొందఁడు. స్వదేశ స్వధర్మ స్వాతంత్ర్య ములకొఱకు మేవాడ్ దేశమందలి కొండలయందు నిజరక్త మును విడిచి ప్రతాపసింగు వీరస్వర్గమును జేరుట కయినను సిద్ధముగ నున్నవాఁడు!

అర్ధరాత్రము దాటినపిమ్మట మహారాణా ప్రధానసేనా పతులలో కొందఱు తత్ప్రదేశమునకుఁ జనిరి. అతఁడు వారి రాకకై నిరీక్షించుచుండెను. వారు వచ్చుటచేఁ జింతాసూత్రము విచ్ఛిన్నము కాగా నతఁడు వారిని గూరుచుండ సాదరముగా నియమించెను.

అందఱు నాసీను లయినపిదప ప్రతాపసిం గిట్లని పలికెను: "వీరులారా, మీ సాహసము నుత్సాహమును విలోకించి,

మిగుల నాహ్లాదము గాంచితిని. నాకృతజ్ఞతను దెలుపుటకే మిమ్ము నిచ్చటికి రావించితిని.”

రాణాకు దక్షిణభాగమునఁ గూరుచున్న రావత్ కృష్ణసింగు ప్రభువుం జూచి “మహారాణా, యుద్ధకాలమున రాజపుత్రులు దేవరవారిని విడిచిన దెప్పుడు? ఆకనఁబడుచున్న సైనికుల జీవనము, మాజీవనము ప్రభువువారికొఱకే!” అని విన్న వించెను.

“కృష్ణసింగ్, మీ ఋణము నే నెన్నటికిని దీర్చలేను. మానాయనగారు మృతి నొందుటచేత మాయన్న యోగమల్లు సింహాసనము నారోహించినాఁడు. తమ రాతనితో మహారాజా, పొరబడితిరి. ఈస్థానము మీ సహోదరుఁది! అని పలికి, నాయొఱలో ఖడ్గము నుంచితిరి. కరవాలము నాహస్తమునం దున్నంతకాలము సాలుంబ్రాధిపతి నాదక్షిణ పార్శ్వము నలంక రించును!” అని ప్రతాపసింగు బదులు పలికెను.

“సాలుంబ్రా యింతకంటె వేఱుబహుమానము వాంఛింపదు. స్వామిభక్తియే సాలుంబ్రా వంశానుగత ధర్మము. అదియే బహుమానము!” అని కృష్ణసింగు నుడివెను.

అటుపిమ్మట రాథోడ్ గోత్రోద్భవులను, గజావద్వంశ్యులను, నవవారలను సంబోధించి, మహారాణా యిట్లనెను: “చితోడ్ ధ్వంసకాలమున జయమల్లు, పత్తు వీరిద్వారు దఱు

ప్రాణములు నర్పించి, సంపాదించిన కీర్తిని మీరు మరల చితోడ్ దుర్గమును స్వాధీనము చేసికొని సంపాదింప వలెను."

"జయాపజయములు మనుష్యాధీనములు కావు. ప్రయత్నమున లోప మెంతమాత్రము నుండదు." అని వారు విన్నపము చేసిరి.

పిదప కోటారి చవాణ్ కులాధిపతి నుద్దేశించి ప్రతాపుఁ డిట్టులనెను: "ఆతతాయి యగు రణవీరుని బారినుండి నాయన గారిని తప్పించి తీసికొని వచ్చినపిదప ఈదుర్గమున పెరుగు చుండగా, నెల్లరును వారిపుట్టువును గూర్చి సందేహము నొందిరి. కాని చవాణ్ కులాధిపతియే నాయనగారితో భుజించి, యెల్లరసందియము వాపెను. చవ్వాణ్ వంశ మిప్పటికిని స్వామి భక్తి గలిగియున్నది."

"చవ్వాణ్ వంశము కలకాలము స్వామిభక్తిఁ గలిగి యుండును!" అని యతఁడు విజ్ఞాపన చేసెను.

"బిజిలీపతీ, మానాయనగారు దురవస్థలో నున్నప్పుడు మీనాయనగారే కదా వారికిఁ గన్యాదానము చేసిరి! మాతులా, రానున్న యుద్ధమున మీరు ప్రతాపునిపేరు నిలుప వలెను" అని రాణా వేడెను.

"అందుకయి ప్రమరవంశము సానందముగాఁ బ్రాణముల నయిన విసర్జించుటకు సిద్ధముగ నున్నది!" అని బిజలీపతి యుల్లాసముతోఁ బలికెను.

తరువాత ప్రతాపసింగు దైలవారా దిక్కు చూచి, "ఝూలావంశము మేవాడ్ దేశమునకు స్తంభము వంటిది. యుద్ధమున ఝూలావంశమే నాతనుత్రాణము!" అని వచించెను.

"ఝూలా స్వామిభక్తి నెఱుగును. యుద్ధములో మహా రాణావారిని విడిచియుండదు!" అని ఝూలాప్రభువు బదులు చెప్పెను.

ఈప్రకారముగా యోధులతో నించించుక సంభాషించి, తుదకు ప్రతాపసిం గివ్విధమున నుపన్యసించెను:

"వీరులారా, మిమ్ము నాహ్వానించిన కారణము స్పష్టమే. మొగల్ సైన్యములు మేఘరాశివలె గుమిగూడుచున్నవి. వాన కారునకు ముందుగానే మేవాడ్ భూమిపై వచ్చిపడును. మనము నిద్రించుట లేదని శత్రువులు తెలిసికొందురు. మఱియు సారవంతములగు భూములకు మాఱుగా నరణ్యములను విలోకింతురు. పర్వతపరివేష్టితము లగు ప్రదేశములలోనికి శత్రువుల ప్రవేశమే దుర్ఘటము!

"బప్పారావులవంశము తుర్కవాండ్రకుఁ దల వాంచునా? సమరసింహ సంగ్రామసింహుల సంతానము విదేశీయులకు దాస్యము చేయునా? ఆలాగున జరుగుటకుమున్నే శిశోదీయ వంశ మొక్కమాఱుగా నశించును గాక! సుందరమగు మేవాడ్ రాజ్యము సపర్వతముగా జలధిలో మునుగునుగాక!

“ప్రతాపసింగు మాతృముఖమును ప్రకాశింపఁ జేయును; తుర్కీవాండ్రతో యుద్ధము సలుపును; పూర్వపురుషుల పరాక్రమము తనకు గలదో లేదో చూచుకొనును. యోధులారా, మనము కందరములందు నివసింతము. బప్పారావుల సంతతి స్వాతంత్ర్యము నిలుపుకొనును. సమరసింహ సంగ్రామ సింహుల సంతానము దాస్య మెఱుంగదు! ఎన్నటికి నెఱుగకుండును గాక!

“ఉత్సవము నేటితో ముగిసినది. ఇక వ్యవసాయదివసముదయించుచున్నది. యోధులారా, కార్యతత్పరు లగుఁడు! ఖడ్గము గట్టిగాఁ బట్టుకొనుఁడు మేవాడ్ రాజపుత్రగౌరవ మింకను నశింప లే దని మానసింగు అక్బరును విలోకింతురుగాక!”

## ౬

రెండుమూడు మాసములు గడచెను. ప్రతాపసింగు నిరుద్యోగియై యుండలేదు; తాను రక్షింపనెంచిన ప్రదేశమందలి దుర్గములను, గుహాలను, అడవులను బరీక్షించుచుండెను; ఖాద్యములను సంగ్రహించి భద్రముచేసెను; సైనికులకు ప్రజలకు నుత్సాహము కలిగించుచుండెను. దుర్గాధిపతులు సేనలతో వచ్చి రాణాకు బాసటగా నుండిరి. బహిరంగ యుద్ధము నెఱుఁగకున్నను భూమిజాలు తమతమ భూములను

రక్షించుటకుఁ గృతనిశ్చయు లయిరి. ఆటవికులు నయితము
ప్రతాపునికిఁ దోడయిరి. అందఱు యుద్ధమున కెదురు చూచు
చుండిరి.

మహారాణా కొంతపరివారముతో బయలుదేఱి, యెవ్వఁ
డయినను దన యానతి నుల్లంఘించునేమో యని పరికించు
చుండును. పూర్వము జనులు నివసించిన తావులందు హిం
సక్రమృగములు తిరుగుచుండెను. సస్యక్షేత్రములు విపినభూ
ములుగా మాఱెను. బునాస్ రాపీనదీతీరములయందు మను
జునిజాడయే లేదు. ప్రతాపుని భటులం జూచి వనవిహంగ
ములు నిజకులాయములను విడిచి, యెలుంగులతో నాకసమున
కెగురును. అడవిజంతువులు దూరనికుంజములకుఁ బరుగు
లిడును. ఎటు జూచినను మానవనివాసభూములు దైవికముగా
నిర్జనము లయినట్లు తోచుచుండును. జనపదములు తుమ్మ
లతో నిండియుండెను. నిశ్శబ్దముగా సంచరించి, ప్రతాపుఁడు
మఱలుచుండువాఁడు. "మేవాడ్ రాజ్యమంతయు నీవిధమున
నిర్జనారణ్య మయినను సరే! కాని యీపవిత్రభూమి తురుష్క-
వాండ్ర పాదవిక్షేపముచే కలుషితము కాకున్నఁ జాలును!"
అని యతఁడు వచించువాఁడు. రాణా పగటివేళ యుద్ధసన్నా
హము చేయుచు, రాత్రులందుఁ దనగుహకుఁ జనును. అప్పుడు
పాటేశ్వరీ దేవి మంట చేసి, స్వహస్తములతో వంట చేయు
చుండును. సంతానము జీర్ణవస్త్రములను ధరించి, యాడుకొను

చుండును. యుద్ధనేపథ్యమును విడుచుచు ప్రతాపసింగు సస్నేహముగా "భగవన్ అమరసింగు, వాని తల్లియు నెల్లకాల మీా గుహాలో నివసించినను సరే! కాని తుర్కీవాంద్రకుఁ గప్పము గట్టుచుఁ బ్రాసాదములందు నివసింపకుందురు గాక!" అని పలుకుచుండును.

కొన్ని నెలలు చనెను. తుదకు చక్రవర్తిపుత్రుఁడు సలీమ్ రాజా మానసింగుతోఁ గలిసి మేవాడ్ దేశముపై దండెత్తి వచ్చెను. సాగరతరంగములవలె ససంఖ్యాకము లగు సేనలు మేవాడ్ రాజ్య బహిర్భాగమును స్వాధీనము చేసికొనెను. అప్రమత్తుఁ డగు ప్రతాపసింగు వాని కడ్డము పోలేదు. క్రమముగా మొగల్ బలములు పర్వతప్రదేశమునకు వచ్చి చూడగా మార్గము విరుద్ధ మయియున్నది. అద్యేకమాత్ర ప్రవేశ ద్వారము హాల్దీఘాట్! ఇరువదిరెండువేల రాజపుత్రులు ద్వారపాలకులు! మానసింగు చింతాకులుఁడై పటకుటీరములను స్థాపింప సైనికుల కాజ్ఞ యొసఁగెను. మొగలులు యుద్ధమునకు సిద్ధముగా నుండిరి.

గుడారముల వరుసనుండి వెలువడు దీపకాంతిచే నంధకార బంధుర మగు పర్వతప్రదేశము కాంతిమంత మయ్యెను. సైనికులచ్చటచ్చట గుంపులుగాఁ గూడి, సందడి చేయుచుండిరి. మఱునాటి సంగరమునుండి పాపము, వారిలో నెందఱు మరల ఆగ్రానగరమునకు బోవుదురో!

శిబిరశ్రేణి నడుమ రక్తవస్త్రమండితము, బహుదీపకళికా దీప్తము, పతాకావిభూషితము నయి, యువరాజు శిబిరము దృగ్గోచర మగుచుండెను. సలీమ్ లోపలఁ గూరుచుండి, ప్రఫుల్ల హృదయముతో సంగీతము వినుచుండెను. అతని యెదుట సురాపాత్రము మిలమిల మనుచుండెను. ఇరుప్రక్కల కలకంఠకంఠు లగు కొందఱు ప్రౌఢగాయను లుండిరి. యువరాజు దీర్ఘకాయుఁడు, బలిష్ఠుడు, స్ఫురద్రూపి. యుద్ధ మిప్పుడో యెప్పుడో యనునట్టు లున్నను, నాతని యాననము చింతాశూన్యమై దరహాసరంజితమై యుండెను.

ఉల్లాసమునఁ దేలియాడుచున్న సమయమున యువరాజు కడకు సేవకుఁ డొకఁడు చని, సలాం చేసి, "జహాపనా, రాజా మాన్ సింగ్ వారు వచ్చినారు, ముఖ్యముగా మాట లాడఁ గోరి తమదర్శనము నున్నారు" అని విన్నవించెను.

యుద్ధమునుగూర్చి మాటలాడుటకు మానసింగు వచ్చె నని సలీమ్ భావించెను. సంగీతము నిలిచెను. యువరా జందఱకు సెల వొసంగెను. ఇంతలో మానసింగు లోపలికిఁ జని, సలీమునకు సలాము చేసెను. చిఱునగవుతో యువరాజు మాన సింగునకు స్వాగతము చేసి తలుపు మూసెను. ఉభయులు కూరుచుండిరి.

మానసింగు, సలీమ్, ఇర్వురు తరుణులు, ఉత్సాహవంతు లు, యోధులు. కాని సలీమ్ చక్రవర్తిపుత్రుఁ డగుటచే

విలాసప్రియుఁడు. అతఁడు సత్స్వభావుఁడు, ఉదారహృదయుఁడు. అయినను రాజ్యమునకు వచ్చినతరువాత గూడ నతఁడు విలాసములందు మునిఁగియుండువాఁడు : రాజ్యతంత్రము నూర్జహాన్ రాజ్ఞి నడుపుచుండెడిది. మదిరతోడను, మగువలతోడను జహాంగీర్ కాలయాపనము చేయువాఁడు. ఇక మానసింగు, అతఁడు ధీమంతుఁడు, ప్రతిజ్ఞావంతుఁడు, కార్యదక్షుడు, విశేషించి మహాయోధ. ఆగ్రానుండి బయలుదేఱిన దాదిగా సమస్తకార్యములను నిర్వహించుచున్నవాఁడు మానసింగే. సలీమ్ కార్యభారము నతనిమీఁదనే విడచిపెట్టెను.

"రాజా, శత్రువుల యుద్ధసన్నాహములను జూచితిరి కదా, యెపుడు యుద్ధము ప్రారంభించుట మే లని మీ యభిప్రాయము ?" అని సలీమ్ మానసింగు నడిగెను.

"రేపే యుద్ధము ప్రారంభించుట మంచిది; ఎంతశీఘ్రముగాఁ బని నెఱవేరిన నంత మంచిది" అని మానసింగు ప్రత్యుత్తర మిచ్చెను.

"నామతముగూడ నదియే. చక్రవర్తివాహినుల నిప్పటికిని రజపూతు లడ్డగింప లేదు, రే పయిన నంతే !" అని సలీమ్ పలికెను.

"కేవల మాలాగున కాదు. ఇక జరుగు యుద్ధమునుగూర్చి యోజించినయెడల నిదివఱకు మనము పడినకష్టములు దాని యెదుట కేవలము బాలక్రీడలవలె నుండును."

" బహిరంగయుద్ధమే తై మూర్ లంగ్ వంశమువారికి తగి నది. కాని యుద్ధ మెంతసేపు? వ్యాఘ్రములకు లేళ్ళకు నెంత కాలము పోరు జరుగును? నాయనగారి సేనలను జూచి, యా పిటికిరాణా శీఘ్రముగా పాటిపోవును! "

" మీనాయనగారి వాహినులయెదుట నిలువఁ గల బల ములు హిందూదేశమునందే లేవు కాని, ప్రతాపుఁడు శీఘ్ర ముగాఁ బాటిపోవఁడు. నా కాసంగతి బాగుగా తెలి—" అని మానసింగు పలికెను.

" తమ రేమో చెప్పుచు చప్పున నాగితి రేమి? ఈ ప్రతాపుని పరాక్రమమును గూర్చి నేను గూడ విన్నాను. అది గాక మఱేమైన నున్నదా?" అని యువరాజు పలికెను.

" మును పొకసారి ప్రతాపునితో మాటలాడితిని; అందు చేత గొన్ని సంగతు లెఱుఁగుదును."

" ఆజ్ఞాపింపుఁడు "

" ప్రతాపుఁడు పరమశత్రువు, చక్రవర్తికి హృదయశల్యము మనము లేపు తప్పక యుద్ధము చేయుదము."

" మంచిది: మీ రింక నేమో చెప్పదలచి యుండలేదా? నేను మీపై సమస్తకార్యభారము నుంచితిని, నామనసులోని మాటలు మీకుఁ జెప్పితిని. మీరు నాకడ నేమో దాచు చున్నారా?"

"మీకుఁ జెప్పగూడని దేదియు లేదు. ప్రతాపునకు నేను గొంచెము బాకీ పడియున్నాను. ఆసంగతి జ్ఞప్తికి వచ్చుటచేత మాటలాడలేకపోతిని."

"మీ రిర్వురు హిందువులు; మీకు స్నేహము ఋణము మొదలగు సంబంధము లుండుట స్వాభావికమే. మిత్రుసితో యుద్ధముచేయుట మీ క్షేమము కానియెడల దూరముగా నుండ వచ్చును. సలీమ్ ఒక్కఁడే యుద్ధము చేయును; ప్రతాపుని బాహువులలో నెంతశక్తి కలదో పరీక్షించును."

"ఆఋణము ప్రతాపుని రుధిరముతోఁ దీఱును. మీకు నేనుఁ జెప్పరాని దేమియు లేదు. మీనాయనగారికిఁ జెప్పిన విషయమును మీకుఁగూడఁ జెప్పెదను: ఆకర్ణింపుఁడు!

"షోలాపూర్ నుండి హిందూస్థానమునకు దిరుగవచ్చు నపుడు మహారాణా ప్రతాపసింగును దర్శింపఁ గోరి మేవాడ్ దేశమున కరిగితిని. రాణా సూర్యవంశజుఁడు, కులీనుఁడు; కాబట్టి క్షత్రియుల కెల్లరకు పూజనీయుఁడు. ప్రతాపుఁడు క్రొత్తగా సింహాసనము నెక్కె నని విని యతనిని చూడనేగితిని.

"చిత్తోడ్ విజయము తరువాత ఉదయ సింగు ఉదేపూర్ రాజధానిగాఁ జేసికొనెను. కాని ప్రతాపుఁడు జనకుని నగరమును వదలి కుమల్మేర్ దుర్గమున నివసించుచుండెను. నా యాగమనవార్త నాకర్ణించి నన్ను గౌరవించుటకు రాణా ఉదయసాగరమువఱకు వచ్చెను.

"ఉదయసాగరకూలమున మహాసన్నాహముతో నాహా రాదికము సిద్ధముగా నుండెను. నేను భుజింపఁ గూరుచుం టిని. కాని రాణా కానఁబడ లేదు. ప్రతాపుని పుత్రుఁడు అమ రసింగు నాదగ్గఱకు వచ్చి, తనతండ్రికి శిరోవేదన కలుగుటచే నతఁడు రా లే దనియు, నాతిథ్య మొసఁగుటకుఁ దన్నుఁ బంపె ననియు, దోష మెంచక భోజనము చేయవలె ననియు చెప్పెను.

"కాని, నేను వానిమాటలు విశ్వసించ లేదు. అతల నొప్పి నిజ మైనది కాదు. సంగతి గ్రహించితిని. మ్లేచ్ఛచక్ర వర్తితో బాంధవ్యము నెఱపుటచే ప్రతాపుఁడు—అగర్వి నాతో భుజించుట యవమాన మని తలంచెను." ఇచ్చట మానసింగు వాక్కు మహారోషమున స్తంభించెను.

"అటు తరువాత?" అని సలీమ్ హెచ్చరించెను.

చంచలస్వరముతో మానసిం గీలాగున చెప్పఁ జొచ్చెను.

"అమరసింగుతో నే నిట్లంటిని: "అతలనొప్పికి గారణము తెలిసినది. కడచినదానికి వగచిన నేమి లాభము? మహా రాణా నాయెదుట పాత్ర నుంచనియెడల మ జెవ్వ రుంతురు? ఈలాగని వారితోఁ జెప్పుము!

"ఈనాప్రార్థనకు ప్రతాపుఁడు బదులు పలికిన వాక్యమును మానసిం గీజన్మలో విస్మరింపఁడు; అథవా ఱేపు రణరంగమున మఱచును!

"కొంతసేపటికి కతఁడు నాకడకు వచ్చి, తుర్కీవానికి సహోదరి నొసఁగినవాఁడు వానితో భుజించి యుండవచ్చును. అట్టివానితో రాణా భుజింపఁడు! అని పలికెను.

"నేను భోజనము చేయ లేదు: కొన్ని గింజలుమాత్రము అన్న దేవునిపేరిట నుష్ణీషములో నుంచుకొంటిని. నీమానమును పాలింపనియెడల నా పేరు మానసింగు కాదు. అని వానితోఁ బలికితిని. ఆప్రతిజ్ఞ రేపు వానిరక్తములోఁ దీఱును!"

మానసింగు శరీరము వణకఁ జొచ్చెను, నేత్రములు జాజ్వల్యమానము లాయెను సలీమ్ సయితము కోపము దెచ్చుకొని యి ట్లనెను:

"వీరాగ్రణీ! మిమ్ము నవమానించు టొకటి, మమ్ము నవమానించు టొకటియు నగునా? మనయవమానములకుఁ బ్రతీకార మొకటియే! రేపు మన ప్రతిజ్ఞలు నెగ్గించుకొందము. ఇప్పుడు మీరు కలత నొందవలదు."

ఈవాక్యముల నాకర్ణించుటచే మానసింగు కడుపుమంట కొంచెము తగ్గెను. అతని నేత్రములయందు నీరు గ్రమ్మెను. మాఱుమా టాడక సలీమును బరిష్వజించి, మానసింగు నిష్క్రమించెను.

ఆరేయి యువరాజు శిబిరమున నిక సంగీతము వినఁబడ లేదు, వాద్యములు మ్రోగ లేదు. ప్రభాత మయ్యెనో లేదో కాని వేలొకవిధ మగు వాద్యములు మ్రోయఁ జొచ్చెను.

తుములయుద్ధము ప్రారంభ మయ్యెను. ఒక ప్రక్క నసహాయ్యవ మాన పరిశోధనవాంఛ, రెండవప్రక్క స్వాతంత్ర్యరక్షణ ప్రతిజ్ఞ ఒకవంక నపారతార్తారసైన్యము, రెండవదెస నప్రతి హతరాజపుత్రధ్వని !

హాల్దీఘాటునకు రెండుప్రక్కలఁ బర్వతములమీఁదను, క్రిందను ఇరువదిరెండువేల రాజపుత్రసేన యుద్ధసంసిద్ధమై యుండెను. తమతమ కులాధిపతి యాజ్ఞానుసారముగా వీరభటులు ప్రావృడాసారమువలె రిపుసైన్యములపై నాకస్మికముగా దుమికి వానిని జెల్లాచెదరు చేయుచుండిరి. మఱియొకసారి పుంఖానుపుంఖముగా శరవర్షముఁ గురుపుచుండిరి.

పర్వతశృంగముల మీఁదినుండి ధనుర్ధరు లగు నాటవికులు తెఱపి లేకుండ మొగలులపై నలుగులు విడుచుచుండిరి; వీలు దొరకినప్పుడు పెద్దపెద్ద శిలాఖండములను దొరలించుచుండిరి.

నేటి తుములసమరోత్సవమునుండి పరాఙ్ముఖుఁ డగువాఁ డెవ్వఁడు ? చహ్వాన్, రాఠోడ్, ఝూలా, చోండావత్, గజావత్, ప్రమర ప్రముఖ వంశములవారు సింహనాదములతో రిపుబలములపైఁ బడిరి. ఒకపటాలము కూలినతోడనె వేఱొకటి ముందునకుఁ జనుచుండెను. శవములమీఁదుగా సైనికులు నడచిపోవుచుండిరి.

అపారము లగు మొగల్ చక్రవర్తిసేనల కెదురు నిలిచి యెంతపరాక్రమవంతు లయినను కొద్దిమంది రాజపుత్రు లేమి చేయఁగలరు ? మొగల్ ఫిరంగుల బారునుండి మృత్యుదేవతా దేశము భయంకరముగా బయలు వెడలుచుండెను : రాజ పుత్రులు గుంపులు గుంపులుగా వచ్చి విగతజీవులు కా జొచ్చిరి.

ఈ భీషణోత్సవమున ప్రతాపసింగు వెనుజిక్కి యుండ లేదు : యుద్ధప్రారంభమునుండియు నతఁడు మానసింగుపైఁ బడ యత్నించుచుండెను. కాని యనంత తార్తార బలమును భేదించి, యతనిని సమీపింపలేకపోయెను.

పిమ్మట ప్రతాపుఁ డేనుగుపై నెక్కి సలీమ్ యుద్ధము చేయుచున్న ప్రదేశమునకుఁ దన యశ్వమును బరుగెత్తించెను. ఈపర్యాయము రాజపుత్రులు సింహనాదముతో మొగల్ రేఖలను భేదించి, కొండవాగులవలె సమస్త ప్రతిబంధములను నెట్టివేయుచు శత్రుమధ్యమునకు జొచ్చిరి. ప్రతాపసింగు సలీమును సమీపించెను.

ఇరుపక్షములలోని మహాయోధులు తమతమ యేలికను రక్షించుటకు ముందరికిఁ బరుగెత్తిరి. అప్పు డచ్చటినంక్షో భము వర్ణనాతీతము. మొగలులు రజపూతులను భేదముగాని, శత్రువులు మిత్రులను భేదము గాని లేకుండెను. ఆర్తనాదముల తోను జయధ్వనులతోను బర్వతములు మాఱు మ్రోగెను.

రెండుపక్షముల ధ్వజములకును నల్వంకల శవములు రాశీభూతము లయ్యెను.

ప్రతాపుని యవ్యర్థఖడ్గాఘాతములచే యువరాజు సంగరక్షకులు నిహతు లయిరి. అంతట ప్రతాపుఁడు తన నిడివిబల్లెమును సలీముపై విసరెను; కాని యంబారీప్రక్కల నున్న యినుపఱేకులు బల్లెమున కడ్డ మగుటచే నానాఁడు సలీమ్ ప్రాణములు దక్కెను. మహాతేజోవంత మగు చైతకము (ప్రతాపుని యశ్వము) మాతంగమును ముందటికాలితోఁ దన్నెను. ప్రతాపుఁడు మావటివానిని ఖండించెను. ఆగజము తన యేలిక యాపదను గ్రహించెనో యనునట్లు వేగముగా నావలకుఁ బాఱి పోఁ జొచ్చెను. రోషమున హుంకారము చేసి ప్రతాపసింగు వేదండమువెంటఁ బడెను. అప్పు డాతని యతిమానుష వీరవిహారము నవలోకించి హిందూసైనికు లర్జునుని వృత్తాంతము స్మరించిరి, మునల్మానులు విభ్రాంతు లైరి.

అంతట మ్లేచ్ఛులు తమ స్థితి నెఱింగి యొక్కపెట్టున "అల్లా హూ అక్బరు!" అని యార్చి ప్రతాపునిచుట్టు ముట్టిరి. మునల్మానులు భీరువులు కారు; అనేక సంవత్సరములనుండి హిందూదేశమును శాసించుచుండిరి అట్టివాండ్రు నేడు హిందువుల వలన బరాభవము నొంద నొప్పుదురా? రాజపుత్రులు పలాయన మనుమాట నెఱుంగరు, కావున తమ ప్రభువుచెంగట నిహతు లగుచుండిరి. శరీరమున నేడుచోట్ల

గాయములు తగిలినను, దనయుపాయము నెఱుంగక ప్రతాపసిం గింకను ముందునకుఁ జనుచుండెను.

ఒక రాజపుత్ర కులాధిపతి మహారాణా విపత్తును గ్రహించి, సింహనాదము చేసి, సిసోదియా పతాకమును దీసికొని శత్రుమధ్యమున కురికెను. ధ్వజమును జూచి సైనికు లాతని వెంటఁ బరుగెత్తిరి. మహాప్రయత్నముమీఁద రాజపుత్రులు రాణాను నిశ్చయమృత్యువు నుండి తప్పించి తీసికొనివచ్చిరి. ఆ యుద్యమమున ననేకులు మృతి నొందిరి.

క్రమ్మఱ ప్రతాపసింగు యుద్ధపిపాసచే నొడలు మఱచి మొగల్ చమువులోఁ బ్రవేశించెను. నురల రాజచ్ఛత్రము శత్రుపరివేష్టిత మగుటఁ గాంచి, రాజపుత్రు లతిప్రయత్నము మీఁద నాసమరోన్మత్తమహావీరుని మృత్యుముఖము నుండి యీవలకు లాగుకొని వచ్చిరి

కాని, నేఁడు ప్రతాపసింగు విజృంభించినాఁడు. అట్టివానిని నిరోధించుట యెవ్వరితరము? మైమఱచి ప్రతాపుఁడు మూఁడవ సారి మొగల్ వరూధిని మధ్యమునఁ జొచ్చెను. ఈ పర్యాయము పరిపంథులు రాణాను దట్టముగా ముట్టడించిరి. ప్రతాపసింగు వెనుకకు మరలుటకు మార్గము లేకపోయెను ఇప్పుడు ముసల్మానులు శాఫర వీరుని సంహరించి చక్రవర్తి హృత్కంటకమును లాగివేయుదురా? మానసింగు నవమానమునకుఁ బ్రతిఫల మొసంగుదురా!

మహారాణా విషమస్థితి నవలోకించి, రాజపుత్రులు తమ ప్రభువు నుద్ధరింప నిరంతరప్రయత్నము చేయుచుండిరి. కాని యహితచక్ర మపారముగ నుండుటయు, తాము క్షీణబలు లగుటయు సంభవించుటచే మేవాడ్ భానుని యవస్థ సందిగ్ధముగా నుండెను. ఈపర్యాయము రాణా ప్రాణములతో బైటబడునా !

దూరమునుండి దైలవారాధిపతి ప్రభుస్థితి నుపలక్షించెను. ఆ రాజభక్తాగ్రగణ్యుడు తనయిష్టదేవతను స్మరించి, స్వర్ణ సూర్య కేతనము భటునిచేతినుండి లాగి, ససైన్యముగా విపక్షుల నడుమ నురికెను.

మొగలు లాసంరంభమునకు దాళలేక పోయిరి. దైలవారాధిపతి సపత్నసేకిని భేదించి, యున్మత్తరణకుంజరము వోలె మహారాణా యుద్ధము చేయుచున్న ప్రదేశమును జేరెను. అప్పు డతిప్రయత్నముమీద నతడు ప్రతాపుని సేవలకు తప్పించి తీసికొనివచ్చెను. కాని యాయుద్యమమున దైలవారాధిపతి ప్రాణములు విడిచెను.

పతనోన్ముఖుడై యున్న దైలవారాధిపుం జూచి "దైలవారా, మీశరీరమును విడిచి నాశరీరమును రక్షించినారు !" అని మహానుభావుడు ప్రతాపసింగు వచింపగా నతడు క్షీణ స్వరముతో "ఝాలా స్వామిభక్తి నెఱుగును. యుద్ధములో మహారాణావారిని విడిచి యుండదు !" అని పలికెను.

ఫాల్గుణమాసపుఁ జివరరోజున దైలవారాధిపతి యీ మాటలనే వచించెను; ఇప్పుడు ప్రతాపున కామాటలు జ్ఞప్తికి వచ్చెను. దైలవారాధిపుఁడు నేలపైఁ వాలెను.

ఇరువదిరెండువేల రాజపుత్రులలోఁ బదునాల్గువేలమంది యుద్ధరంగమున మృతి నొందిరి. విధి లేక ప్రతాపసింగు యుద్ధ క్షేత్రమునుండి తొలఁగెను. మొగలులకు జయము గలిగెను. ఆనాటి సంగరవృత్తాంతము లోకము శీఘ్రముగా మఱవలేదు. బహుసంవత్సరములు గడచినతరువాత సయితము హిందూస్థానమున, దక్షన్ దేశమున, వంగదేశముననుఁ వృద్ధసైనికులు తరుణ సుభటులతో హాల్దీఘాట్ యుద్ధమునఁ దా మనుభవించిన పాట్లను, మహారాణా ప్రతాపసింగు కావించిన యతి మానుష విక్రమచర్యలను జెప్పుచు, రాత్రులు గడుపుచుండెడి వారు.

౮

ప్రతాపుఁడు సంగరక్షేత్రమును విడిచినను నతనినిమాత్ర మాపద విడిచినది కాదు. ముల్తానీవాఁడు, ఖొరాసానీవాఁడును నతనిని వెంబడించిరి ఘోటకరాజ మగు చైతకము త్రోవలో నున్న కొండవాగును దుమికి దాటిపోయెను. మొగలులు దానిను త్తరించుటలో కొంచెము జాగయ్యెను. చైతకము గాయము

లచే మిక్కిలి డస్సియుండెను. ప్రతాపుఁడు నయితము పరి
శ్రాంతుఁడై యుండెను. పగతు రాతనిని సమీపించుచుండిరి.
వారి తురంగముల ఖురాఘాతధ్వని యతని చెవి సోఁకుచుండెను.
ఇఁక దప్పించుకొనుట కష్ట మని భావించి, ప్రతాపసింగు వీరో
చిత మరణము నొంద నిశ్చయించెను.

ఆకస్మికముగా వెనుకనుండి, "హో, నీలా ఘోడేకా
అస్వార్ !" అని యెవ్వరో కేక వేసిరి. వెను దిరిగి చూడఁగా
ప్రతాపున కొకరౌతు మాత్రమే కానఁబడెను. అతఁడు తమ్ముఁ
డగు శకటుఁడు !

అప్పుడు మితి మీరిన రోషముతో ప్రతాపసింగు వానిం
జూచి "సంగ్రామసింహుని పౌత్రుఁడ వయ్యును మొగలుల
దాసుఁడ వైతివి. పోనీ, యిది విశేష పాపకార్యము కా దను
కొందము. ఇప్పుడు నీయన్ననే వధింప వచ్చినావా ? ఓరీ
కులకలంక ! ప్రతాపుఁ డిప్పుడు సంగ్రామసింహుని వంశమును
నిష్కళంకము చేయునురా !" అని యార్చి, ఖడ్గము దూసెను.

శకటుఁ డామాటలకు భీతిల్లక, కోపము నొందక, మెల్ల
మెల్లన సహోదరుని పాదములపై వ్రాలి "భాయీ, ఒకనాఁడు
నీ ప్రాణములను హరింపవలెననియే సంకల్పించితిని; కాని నేఁడా
యభిప్రాయము మాఱిపోయినది. నేటి నీ పరాక్రమము నవలో
కించి సమ్మోహితుఁడ నైతిని. వెనుకటి దోషమును క్షమించి
తమ్ముని ననుగ్రహింపుము !" అని దీనముగాఁ బలికెను.

ప్రతాపుఁడు వానివదనము వీక్షించెను; చూడగా శకటుని కన్నులవెంట బాష్పములు రాలుచుండెను. శత్రుభావము క్రమముగా దూర మయ్యెను. ఇర్వుర హృదయములందును భ్రాతృస్నేహము విజృంభించెను. నిశ్శబ్దముగా నుభయులు పరస్పరాలింగన సుఖము ననుభవించిరి.

తమ్ముఁడు దీనముగాఁ దన్ను వేడినపుడు విశాల హృద యుఁ డగు ప్రతాపుఁ డతనిని క్షమింప కుండునా? వెనుకటి యపకారములను విస్మరించి, ప్రతాపుఁడు సోదరునిఁ బరిష్వ జించెను.

ప్రతాపుని వెంబడించిన రౌతు లే మయిరి? శకటుఁడు తన యగ్రజుని యపాయస్థితి నాలోకించి, యా యాశ్వికుల నిర్వురను వెనుకనుండి బల్లెముతోఁ బొడిచినాఁడు.

కొంత తడవునకు ప్రతాపసింగు తన యనుజన్మునితో, "భాయీ, ఇది పరాజయదినము కాదు, విజయవాసరమే; పోయినతమ్ముఁడు తిరుగ లభించినాఁడు! వెనుకటి సంగతులను మఱచి, యికనుండి మనము దృఢస్నేహముతో నుండవలెను. మన మిర్వురము స్వదేశమును రక్షింతము. విదేశీయులను శిక్షింతము. అక్బర్ కాని మానసింగు కాని మన నేమియుఁ జేయఁజాలరు" అని వచించెను.

దుర్జయుని వీడుకొల్పిన తరువాత తేజసింగు తన గుహకుఁ జన లేదు; తారకల కాంతియందు పర్వతము లవెంటను నిశ్శబ్దాట వులగుండను నడువఁ జొచ్చెను.

అది చీకటిరాత్రి, వనమార్గము కనబడుటయే లేదు. కాని తేజసింగునకుఁ దెలియని నూతన మార్గములు ప్రదేశములును లేవు. ఎనిమిది సంవత్సరములనుండి భిల్లులతో సహవాసము చేయుచు విపినములు శైలములును గలయఁ దిరుగువానికిఁ గ్రొత్తతావు లేదన్న నాశ్చర్య ముండదు.

తేజసింగు పోవంబోవ మార్గము దుర్గమ మగుచుండెను. అయినను, వరాహములు కాని శార్దూలములు గాని యతని కంటె సులభముగాఁ బర్వతముల నధిరోహింపఁ జాలవు అతని కుడిచేతియందు పెద్ద బల్లె ముండెను. మహాబలశాలి యగు నాదీర్ఘ కాయునిఁ జూచి క్రూరమృగములు భీతిల్లి పాఱిపోవు చుండెను.

రమారమి జాముసేపు కొండత్రోవను నడచి, తుదకతఁడు సమప్రదేశమును జేరెను. అచ్చట కొంచెము తడవు నిలువఁబడి తేజసింగు తన ముఖముపై వాలియున్న కేశములను సవరించు కొని, యాకసమువంక దృష్టి నిలిపి, యెవ్వరినో యుద్దేశించి యల్లన చేతులు జోడించెను; పిమ్మట నిశ్శబ్దముగా కొండ నెక్కఁ దొడఁగెను.

గడియసేపటికి తేజసింగు శిఖరమును జేరెను. ఆశృంగమున కనతిదూరమున గుహ కలదు. అతఁ డా గుహాముఖమును ప్రాపించి, యించుక నిలచి, తారకలవంక దృష్టి సారించి, తమోమయం బగు భువనము దెసఁ జూడ్కులు నిలిపెను.

అనంతర మతఁడు లోనికిఁ బోఁబోవ గుహాద్వారము బద్ధమై యుండెను. తేజసింగు తన బలముకొలది కవాటమును గదలించెను. ఆతని యనన్యసామాన్యబలముచేఁ దలుపు ఝణఝణ ధ్వానము చేసెను. కాని లోపలినుండి ప్రత్యుత్తరము రాలేదు.

మరల నతఁడు తలుపు నెట్టెను. ప్రతిధ్వని యుద్భవిల్లెను. కాని, యభ్యంతరమునుండి బదులుమాట వచ్చినది కాదు. గహ్వరము నిశ్శబ్దముగా నుండెను.

ప్రశాంత మగు నాతమస్వినియందు, భయోత్పాదక మగు గుహదగ్గఱ నేకాకిగా నుండియు తేజసింగు నిర్భయముగా మూడవపర్యాయము కవాటమును ద్రోసెను. ఆఘాతముచే మహానినాద ముద్భవించెను.

“రాత్రివేళ వ్యాఘ్రపర్వతమునకు వచ్చినవా రెవరు?” అని గంభీరవాక్కు లోనుండి వినఁబడెను.

“తిలకసింగు పుత్రుఁడు తేజసింగు” అని యతఁడు ప్రత్యుత్తర మచ్చెను. తోడనే తలుపు తెఱచుకొనెను.

చీకటి గదిలోఁ బ్రవేశించి తేజసింగు కొంచెము తడవు నిశ్శబ్దముగా నిలువఁబడియుండెను. లోపల దీపము లేదు సరి గదా మనుష్యవాక్కు నయితము వినరాలేదు. పర్వతము నందలి సెలయేటి చప్పుడుమాత్రము చెవి సోకుచుండెను.

కొంతసేపటికి లోపల దీపము కాన్పించెను. క్రమముగా వెలుతురు సమీపమునకు వచ్చెను. ఉన్నతదేహాయు పలిత మస్తకయు నగు వృద్ధాంగన తేజసింగు సమీపమునకు వచ్చి వ్రేలితో నతనికి వ్యాఘ్రచర్మమును జూపెను. అతఁడు దాని పైఁ గూరుచుండి, యామెను సవిస్మయముగాఁ జూడఁ జొచ్చెను.

ఆమె చారణీదేవి. వయస్సెనుబది సంవత్సరములకుఁ బైగా నుండును. తల నరసినది. వదనమునఁ జింతా రేఖలు గాటముగా నున్నవి. దృష్టి మందగించినది. అప్పు డప్పు డామె నేత్రములు పయికిఁ ద్రిప్పును; ఆమెశరీరము చేష్టలు దక్కి యుండును. అప్పుడు చారణీదేవి యీలోకమున లేన ట్టులే యుండును. చారణీదేవి యిట్లు పలికెను.

"రాఠోడ్ వంశచూడామణి తిలకసింగు నామధేయమెఱుఁ గనివారు మేవాడ్ రాజ్యమున లేరు. అతనిపుత్రుఁ డేయభి లాషతో చారణిదగ్గరకు వచ్చినాఁడు ?"

"తిలకసింగువారి నామము సర్వదాస్మరణీయము. చితోడ్ గడ్ రక్షించుచు వారుదేహమును విసర్జించిరి. కాని, యిపుడు

వారి పేరుమాత్రము మిగిలి యున్నది. వారి సూర్యమహాల్ దుర్గమున చోండావద్వంశ్యుఁ డగు దుర్జయసింగు నివసించు చున్నాఁడు. భార్య నిహత యయ్యెను. పుత్రుఁడు భిల్లుల యందఁ జేరి గుహాలలోఁ గాలక్షేపము చేయుచున్నాఁడు" అని తేజసింగు పలికెను.

"చోండావతులకు రాఠోడులకుఁ గలవైరము నే నెఱుఁగక పోలేదు. సూర్యమహాల్ దుర్గము మొట్టమొదట వారిదే. అబ్బాయీ, నీపూర్వులు మార్వాడ్ భూమినుండి ఖడ్గహస్తులై వచ్చి, దుర్గమును జయించిరి. అప్పటినుండియు రెండు వంశములకు విరోధము కలిగినది. చోండావతులు దుర్బలులు కారు; ఊరక దుర్గమును విడిచి పోవరు" అని చారణీదేవి చెప్పెను.

"అమ్మా, రాఠోడులును దుర్బలులు కారు. ఆజ్ఞాపింతువేని చోండావత్ దుర్జయసింగుతో ద్వంద్వయుద్ధము చేసెద. అందుఁ బరాజయ మొందితినేని యిఁక సూర్యమహాల్ నా కక్కఱ లేదు. మార్వాడ్ రాజ్యమునకు మరలి పోవుదును. కాదా, ఆమరణము భిల్లులతో నివసించెదను" అని తేజసింగు వక్కాణించెను.

"మేవాడ్ భూమి సిసోదియావంశమునకుఁ బుట్టినిల్లు. చోండావతులు సిసోదియా వంశ శాఖయందుఁ బుట్టినవారు. కాబట్టి నాయనా, యేన్యాయప్రకారము నీవువారిని సంహ

రించి, వారి దుర్గమును హరింపఁ దలఁచుచున్నావు ?" అని చారణి యతని నడిగెను.

"ఏన్యాయము చొప్పున సిసోదీయులు భిల్లులను గొట్టి మేవాడ్ భూమి నాక్రమించిరో యా న్యాయప్రకారమే రాఠోడులు సూర్యమహాలును హరించిరి. మాపూర్వులు పరాక్రమముచేఁ దమ హక్కు స్థిరపఱచుకొనిరి. అటుతరువాత వారి సంతతివారు మేవాడ్ రాజ్యముకొఱకు యుద్ధములు చేసి, స్వత్వమును దృఢపఱచుకొనిరి. రాఠోడ్ జయమలు కంటెను మానాయనగారి కంటెను నెక్కువగా నెవ్వరు పరాక్రమముఁ జూపిరి ? వారిరక్తపాతముచేతనే మాహక్కు స్థిరపడినది. రాఠోడువంశమున కింతకంటె నెక్కువ న్యాయ మక్కఱ లేదు. రాజస్థానమునను వేఱొకధర్మము లేదు" అని తేజసింగు నుడివెను.

"అబ్బాయీ, భిల్లులసహవాసము చేయుచున్నను క్షాత్రధర్మము విసర్జించినావు కావు. నిశ్చయముగా వీరుల యుత్పత్తియు నదులయుత్పత్తియుఁ గనుగొనుట కష్టము. వీరులకుఁ బరాక్రమమే భూషణము. అదియే హక్కు. అట్టి యధికారముతో చోండావద్వంశాధిపతి సూర్యమహాలును మరల జయించియుండును. అందులకయి తిలకసింగు కుమారుఁడు కోపముతో నుండ నేల ?"

"దుర్జయసింగు దోర్బలముచేత సూర్యమహాలును స్వాధీనము చేసికొన్న పక్షమునఁ బరమశత్రు వయినను తేజసింగు వానిని మన్నించువాఁడే! కాని యా నరాధముఁడు క్షత్రియుఁడు కాఁడు. మానాయనగారు మృతి నొందినపిమ్మట నమ్మగారితో నయినను యుద్ధము చేయలేక, తస్కరునివలె ఈదుర్గములోఁ బ్రవేశించి, యామెను వధించినాఁడు. దేవీ! వానికిఁ దగిన శిక్ష యుద్ధము నేసి యాజ్ఞాపింపుము: తేజసింగు వాని శాస్తి విధించును!"

"తిలకసింగు కొడుకా, నీకోపమునకుఁ గారణము నే నెఱుఁగకుండ లేదు. నీ పౌరుషపరాక్రమము నే నెఱుఁగనిది కాదు. కాని చిన్నవాఁడ వగుటచేత నీశూరత్వమును బరీక్షించుచుంటిని. తిలకసింగు పుత్రుఁడు తండ్రివంటి వాఁడే యని నా కిప్పుడు తెలిసినది. నీజనకుని నేను బాగుగా నెఱుఁగుదును. ఇప్పుడు నీ వేమి కోరి వచ్చితివో తెలుపుము. తిలకసింగు తనూజునకు నేసేయరాని దేమియు లేదు."

"దేవీ, భూత భవిష్య ద్వర్తమానములు నీకుఁ గరతలామలకములు. ఒకనాఁడు సంగ్రామసింగు ఈ నాహోరామ్మగ్రోతు వచ్చి తన లలాట లిఖితపంక్తులను దెలిసికొనెను. ఇప్పుడు తిలకసింగు పుత్రుఁడు, దుర్గభ్రష్టుఁడు, భిల్లపాలితుఁడు నగు తేజసింగు తన లలాట రేఖలను దెలిసికొన వచ్చినాఁడు. మాతృవధకును, వంశావమానమునకును దగినప్రతీకార మింక

నెంతకాలమునకు సంభవించునో చెప్పి, యీనాసంతప్త హృద యమును శాంతి పఱచుము."

"నాయనా, భవిష్యద్యవనికను దొలఁగింపఁ గోరకుము. మానవజీవితము దుఃఖమిళితమై యుండును. ప్రియభాషిణి యగు నాశాదేవి తన యింద్రజాల ప్రభావముచే మనోహర పదార్థములను దృష్టిపథమున దొరలించును; హృదయమునకు శాంతి నొసఁగును. ముందు రాబోవు సంగతులను దెలిసి కొనుటవలన నేమి లాభము? కష్టములు కలుగు నని తెలిసి నచో నిక మనశ్శాంతి యెక్కడ? బాలకా, భవిష్యత్తుమాట దూరముగానుంచి, నీకు మ తేమేఁ గావలెనేమో చెప్పుము."

"అమ్మా, ఈ నాహోరా గ్రో యందలి చారణీదేవి సంగ్రామసింహునకు భవిష్యద్వృత్తాంతముఁ దెలిపెను. ఆ మహావీరుఁడు దేవ్యాదేశప్రకారము సింధునదము మొదలుకొని యమునానది వఱకును, శతద్రూనది మొదలు వింధ్యపర్వతము వఱకును రాజ్యము వృద్ధి చేసెను. దేవి యానతిచ్చిన యెడల నాప్రయత్నముమాత్రము సఫలము కాకుండునా?"

"రాజ్యాభివృద్ధి సంగ్రామసింహుని లలాట లిఖిత విష యమే, కాని చారణీదేవి యాజ్ఞాఫలము కాదు. దేనివలం సంగ్రామసింగు భవిష్యత్తు గ్రహించుటచేత సహోదరుఁ డతనిని వధింపఁ దలపెట్టెను. తుదకుఁ గష్టమునుండి దప్పించు కొని పాఱిపోయినను నతని నేత్ర మొకటి పోయినది. సంగ్రా

ముఁడు చాలకాలము గొల్లవాండ్రతోఁ గలిసి తిరుగ వలసెను. పడరానిపాట్లు పడెను. కాబట్టి నాయనా! సంగ్రామసింగు చేసినాఁ డని నీవును నతనివలె ముందుసంగతులను దెలిసికొన యత్నింపకుము. నీకు నే నిం కేమయినఁ జేయఁగలనా?"

"మోసమువలన నాతల్లి నిహత యయ్యెను. నాదుర్గము శత్రువుచేతులయం దున్నది నేను భిల్లులయండఁ జేరి పర్వతములయందు నరణ్యములందును నివసించుచున్నాను. ఇంత కంటె నా కెక్కువగా రాగల కష్టము లుండునా? ముందు సంగతులను దెలిసికొన్నను నాకు నష్టములేదు. కాబట్టి నన్ను ననుగ్రహించి నాయభిలాషఁ దీర్పుము. ఆజ్ఞ యయ్యెనేని నా పూర్వచరిత్రమును సమగ్రముగా వినిపించెదను."

"లోకమునుండి నేను దూరముగా నున్నాను. వెనుకటి చరిత్ర స్వప్నమువలె నుండును. అయినను, తిలకసింగు పుత్రుఁడు చెప్పుమాటలను వినుటకు నా కే యాతంకము లేదు."

తేజసింగు తన పూర్వచరితమును స్మరింపనారంభించెను. అతని హృదయము కలత నొందెను రోషవిషాదములచే నిట్టూర్పులు వెలువడఁ జొచ్చెను. కంఠము స్తంభించెను. ఎట్టకేల కతఁడు మనసు కుదుర్చుకొని, యీవిధమునఁ జెప్ప సాగెను.

"దేవీ, నేను మొదటినుండియు నీప్రకారముగా నుండ లేదు! రేయింబవళ్ళు పగవానిని సంహరించు నభిప్రాయము లేదు. కీర్తిమీఁద దృష్టి యుండెడిది. భిల్లుల దయవలన బ్రతుకు చుండ లేదు. రాజపుత్రులలో రాజపుత్రుఁడనై యుంటిని.

"రాఠోడ్ తిలకసింగునామధేయ మెఱుఁగనివా రెవరు? సూర్యమహాల్ కీర్తిని వినని వా రెవ్వరు? రాఠోడ్ కులాధిపతి యగు జయమల్లు మానాయనగారికిఁ దన కుడిప్రక్క పీఠ మిచ్చుచుండువాఁడు! సూర్యమహాల్ దుర్గమున కేతెంచి వారిని గౌరవించుచుండువాఁడు దేవీ, నే నప్పుడు దిక్కు లేని యాటవికుఁడనై యుండలేదు—యువరాజునై యుంటిని!

"చోండావత్ దుర్జయసింగుపూర్వపురుషులకును రాఠోడ్ వంశమువారికిని వైర ముండెను; ఆవైరము వంశానుక్రమ ముగా వచ్చుచుండెను, యుద్ధములు జరుగుచుండెను. సూర్య చంద్రు లున్నంతవఱకు నావిరోధాగ్ని చల్లాఱదు. ఈ దీనుని హృదయమున మండుచున్న రోషవహ్ని దుర్జయసింగు రుధిరముతోనే గాని శాంతము కానేరదు!

"రాఠోడుల నివాసస్థానము మార్వాడ్ రాజ్యము. అచ్చటి నుండి మాపూర్వులు మేవాడ్ రాజ్యములోనికి వచ్చి, చోండావతుల నోడించి, సూర్యమహాలును గెలుచుకొనిరి.

క్రమముగా వారినంతటి యాదుర్గమున నివసింపఁ జొచ్చెను. ఈసంగతు లన్నియు దేవికిఁ దెలిసినవే.

"నాయనగారికిని దుర్జయునకును జాలసారులు పోరుసంభవించెను. సింహముతో నక్క పోరాడఁ గల్గునా? వచ్చి నన్ని పర్యాయములు నాయనగారు వాని నోడించిరి.

"నేటి కెనిమిదిసంవత్సరముల క్రిందట చిత్తోడ్‌గడను రక్షించుటకయి నాయనగారు జయమల్లుతోఁ జనిరి. చిత్తోడ్ ధ్వంసము నొందెను. కాన దేవీ, జయమల్లు తిలకసింగుల పరాక్రమమును అక్బర్‌షాహ స్వయముగాఁ జూచియున్నాడు. సాలుంబ్రాధిపతి మృతి నొందిన తరువాత సూర్యద్వారము నెదుట నిల్చి, వా రిర్వురు మొగల్‌సేనతో యుద్ధము చేసి తుదకు మరణించిరి. చారణదేవు లిప్పటికిని వారి యశోగీతములను దేశదేశములందును బాడుచున్నారు. నాయనగారి మరణవార్త సూర్యమహాలునకుఁ బిడుగువలె వచ్చి పడెను. అప్పుడు నాజనని యుల్లాసముతో "హృదయేశ్వరుఁడు సశరీరముగా వీరస్వర్గమున కరిగెను. నేను నయితము త్వరగాఁ జనవలెను. పరిచారికలారా, చితిపేర్పవలెను. ఇప్పటికే జాగయ్యెను అన్నది."

తేజసింగు వాక్కు స్తంభించెను, కంటినుండి బాష్పకణమాతని విశాలవక్షముపైఁ బడెను. గొంతు సవరించుకొని, మరల నతఁ డిట్లు చెప్పఁ దొడఁగెను :

"అమ్మా, క్షమింపుము, తేజసింగు రోదనమును బహు కాలము క్రిందటనే మఱచెను. కాని తల్లిమాట జ్ఞప్తికివచ్చుట దుఃఖ మాగినది కాదు. ఆమె చితి నారోహింప నున్నప్పుడు దుర్గములోని వారందఱు వలదు వల దనిరి. అమ్మ వారిమాట లెక్క సేయ లేదు. చితి నెక్కఁబోవుచుండెను.

"అంతట నే నామె సన్నిధికరిగి అమ్మా, నేను చిన్న వాఁడను. నీవు పోయినయెడల సూర్యమహాలును రక్షించు వా రెవరు ? దుర్జయసింగుతో యుద్ధము చేయువా రెవరు ? అంటిని. అప్పు డామె తన పూనిక విడిచి, పరిచారికలారా, నేను చితి నెక్కుట కింకను గొంతకాలము పట్టును. చితోడ్ దుర్గమును రక్షించుటకు పత్తుమాతయు భార్యయు యుద్ధము చేసి రని వింటిని. మఱియొక రాజపుత్రరమణి శత్రువులతో బోరును, సూర్యమహాలును రక్షించును అని వచించెను.

"పిదప నాజనని నాయనగారి శస్త్రాగారమున కరిగి, దానిని బరీక్షించెను తండ్రిగారి బాకు నొకదానిని గ్రహించి, మాయమ్మ సర్వదా తన నడుమున ధరింపఁ జొచ్చెను.

" అమ్మగారి ప్రతిజ్ఞ దుర్జయసింగు వినెను. స్త్రీ రక్షించు చున్నను దుర్జయుఁడు మాదుర్గము నాక్రమింప భీతిల్లెను. కాని ద్రవ్యబలముచే దుర్గద్వారము తెఱవు వడగా నొక రేయి తస్కరునివలె దుర్జయసింగు మాదుర్గములోఁ బ్రవేశించెను.

"అయినను, జీకటిలోనే యుద్ధములో జరిగెను. రెండు పక్షములలో ననేకులు మృతి నొందిరి. నాయకుఁడు లేకపోవుటచేఁ దుదకు రాథోడులు పరాజితు లయిరి.

"ప్రాసాదమునకు మీఁదుగా నున్న గవాక్షముకడ నాతల్లి నిలిచి యుండెను. ఆమె యెడమచేతిలో నేను — కుడిచేతిలో బాకు!

"క్రమముగా మాపక్షమువా రందఱు మరణించిరి. కడకు మే మున్నగది తలుపు బ్రద్ద లయ్యెను. కోలాహలముతో చోండావతులు గదిలోఁ బ్రవేశించిరి. మొనగాఁ డయి దుర్జయసింగు చనుదెంచెను.

"నెత్తుటితోఁ దడిసియున్న యతనిని జూచి మాయమ్మ సంచలింప లేదు; మానాయనగారి నామము నుచ్చరించి బాకు పై కెత్తి దుర్జయునిమీఁదికి దుమికెను! అదొంగ ప్రాన్పడియెను. ఆక్షణమున రాజపుత్రాధముఁ డీలోకమును బాసి యుండును. కాని సైనికుఁ డొకఁ డడ్డుపడి తనప్రాణములను విడిచి, యేలికను బ్రతికించెను! మాయమ్మ బాకు పాపమా దీనుని రక్తముఁ ద్రావెను. తోడనే పదుగురు సైనికులు దుమికి, యామెను వధించిరి."

తేజసింగు నిముసమునేపు మిన్నకుండెను. అతని నేత్రములు నిప్పులు గురియుచుండెను. క్రమ్మఱ నతఁ డిట్లు చెప్పఁజొచ్చెను.

"అయినను, చీకటిలోనే యుద్ధములో జరిగెను. రెండు పక్షములలో ననేకులు మృతి నొందిరి నాయకుఁడు లేకపోవు టచేఁ దుదకు రాథోడులు పరాజితు లయిరి.

"ప్రాదమునకు మీఁదుగా నున్న గవాక్షముకడ నాతల్లి నిలిచి యుండెను. ఆమె యెడమచేతిలో నేను — కుడిచేతిలో బాకు!

"క్రమముగా మాపక్షమువా రందఱు మరణించిరి. కడకు మే మున్నగది తలుపు బ్రద్ద లయ్యెను. కోలాహలముతో చోండావతులు గదిలోఁ బ్రవేశించిరి. మొనగాఁ డయి దుర్జయ సింగు చనుదెంచెను.

"నెత్తుటితోఁ దడిసియున్న యతనిని జూచి మాయమ్మ సంచలింప లేదు; మానాయనగారి నామము నుచ్చరించి బాకు పై కెత్తి దుర్జయునిమీఁదికి దుమికెను! ఆదొంగ ప్రాన్పడి యెను. ఆక్షణమున రాజపుత్రాధముఁ డీలోకమును బాసి యుండును. కాని సైనికు డొకఁ డడ్డుపడి తనప్రాణములను విడిచి, యేలికను బ్రతికించెను! మాయమ్మ బాకు పాపమా దీనుని రక్తముఁ ద్రావెను. తోడనే పదుగురు సైనికులు దుమికి, యామెను వధించిరి."

తేజసింగు నిముసమునేపు మిన్నకుండెను. అతని నేత్రములు నిప్పులు గురియుచుండెను. క్రమ్మఱ నతఁ డిట్లు చెప్పఁజొచ్చెను.

"విదేశీయులతో యుద్ధము ప్రవర్తించుచుండగా దుర్జయ సింగు దొంగవలె మా దుర్గమునఁ బ్రవేశింప లేదా?"

"అక్బరు షాహా చిత్తోడ్‌గడ్ ధ్వంసము చేసినతరువాత, ఉదయసింగు మహారాణా ఉదేపూరు రాజధానిగా రాజ్యము చేయఁ జొచ్చెను. అప్పుడు చక్రవర్తికిని రాణాకును యుద్ధము ముగిసెను. ఆసమయమున దుర్జయసింగు సూర్యమహాల్ దుర్గమును స్వాధీనము చేసికొనెను."

"ఇది మాత్రము యుద్ధసమయమా? మానసింగు రోషావేశముతో డిల్లీకిఁ బోయినను, మహారాణావారు యుద్ధసన్నాహము చేయుచున్నను నింకను శత్రువు లెక్కడ?"

"నాయనా, వర్షరుతు ప్రారంభమున పిల్లవాండ్రు 'మేఘము లెక్కడ?' అందురు. నీవును జన్నవాఁడవే. వానకారున మబ్బులకంటెను శత్రుసైన్యములు విరివిగా రానున్నవి. దుర్జయసింగును ఖండింపఁ దలఁచుచున్న ఖడ్గములతో హాల్దీఘాట్ దగ్గఱ నుందుము. అచిరకాలములోనే యచ్చట ననేక కరవాలములకుఁ బ్రసక్తి కలుగును. దుర్జయసింగు, తేజసింగు ఇంకను సింగు లనేకులు కావలసి వత్తురు."

"అమ్మా, స్వదేశమును రక్షించుటకు రాజోదులు వెను దీయరు. కాని, యీ లోగా క్షత్రియకుల కలంకుఁ డగు దుర్జయసింగు ప్రాణములతో నుండవలసినదేనా?"

“ నాయనా, అంతఃకలహము నిషిద్ధము. మనవారిలో నైకమత్యము లేకపోవుటచేతనే పరులు మనలను శాసించు చున్నారు. ఇక నైన జాగరూకతతో నుండుట మేలు.”

“ దేవీ, ఈనాడు నేనాకుటిలుని చేతులారా రక్షించితిని. వరాహము వానిపైఁ బడనుండెను. నే నా వరాహమును బల్లెముతోఁ బొడిచి వానిని రక్షించితిని. పిమ్మట దుర్జయుని నా నివాసమునకుఁ గొనిపోయి తిరుగ యథాస్థానమున విడిచి పెట్టితిని.”

“చేఁ జిక్కినపుడు వాని నేల వధింప లేదు?”

“పరిశ్రాంతునితోఁ బోరుట క్షత్రధర్మము కాదు.”

“పరమశత్రు వయినను మృత్యుముఖమునఁ బడుచుండగా జూచి దుర్జయుని రక్షించి మానవధర్మము నెఱపితివి. పరిశ్రాంతునితోఁ బెనఁగక క్షత్రియధర్మము ననుసరించితివి. తేజసింగ్, పొమ్ము. విదేశీయులు దండెత్తి రానున్నపు డంతఃకలహము కేవలము నిషిద్ధము. మహావీరుఁ డగు నీ జనకునకుఁ దగిన పుత్రుఁడవు జనించితివి. క్షత్రియధర్మము ననుష్ఠింపుము. కొంతకాలమునకు రాఠోడ్‌సూర్యుఁడు మరల సూర్యమహాలుపైఁ బ్రకాశించునులే !”

ఆకస్మికముగా దీప మాఱిపోయెను. చీకటి గదిలో చారణీ దేవి కడపటిమాటలు ప్రతిధ్వని చేసెను.

తేజసిం గంధకార గహ్వరము నుండి వెడలి పోయెను. మఱునాడు మహారాణా ప్రతాపసింగు సైన్యములలోఁ గలిసెను. హాల్దీఘాట్ యుద్ధమున రాథోడ్ ఖడ్గము మిన్నకుండ లేదు.

౧౧

హాల్దీఘాట్ యుద్ధానంతర మొకనాడు సాయంకాలమున నొంటిగా తేజసింగు భిల్లప్రదేశముగుండ నడచి పోవుచుండెను.

మార్గమున కిరుప్రక్కల వేలకొలంది యడుగుల యెత్తు గల రాతిగోడలవలె నాకసమును భేదించి మహోన్నత పర్వతములు పథికుని రక్షించుచున్నట్లు తోచుచుండెను శైలశృంగముల మీదను పార్శ్వములందును ననేక వనవృక్షములు పువ్వులతలును వాయు పక్షేపమున నంచలించుచుండెను. సూర్యకాంతి నేలవఱకును ప్రసరించుట లేదు. తేజసింగు నడచుచున్న మార్గము పగటివేళనే యంధకారప్రాయమై యుండెను. అచ్చటచ్చట నుత్తుంగకూటముల మీదినుండి సూర్యప్రభ క్రిందికి వ్యాపించి బాటపై బడుచుండెను. అనరణికిఁ బ్రక్కగా కొండవాగు శిలాఖండముల మీదుగాఁ బ్రవహించుచుండెను. అచ్చటచ్చట సెలయేటినీ రెండలో మిలమిల లాడుచుండెను. పెక్కుచోట్ల నా ప్రవాహపుగతి కేవలధ్వనిచే నూహింపఁదగియుండెను. అచలమునుండి వాగులు క్రిందికిఁ బ్రవహించి,

క్రింద నున్న సెలయేటిలోఁ గలిసిపోవుచుండెను భిల్లప్రదేశము వంటి రమణీయ ప్రదేశము మఱియొక దేశమునఁ గానఁబడదు. యూరపులోని సమస్త మనోహర స్థలములకంటెను రాజస్థాన మందలి భిల్లప్రదేశము లెక్కువ చక్కనివియు విస్మయకరము లనియు ఫ్రెంచి యాత్రికు డొకఁడు నొక్కి వక్కాణించి యున్నాడు.

ఇట్టి ప్రదేశమునందలి యొకానొక నిర్జనమార్గమువెంట తేజసింగు చనుచుండెను. శిఖరములయం దెడనెడ భిల్లుల 'పాల్' అనగా నివాసస్థానములు కన్పట్టుచుండెను. భూతలమునుండి చూచుచో నవి మానవనివాసస్థానములవలెఁ గాన్పించవు. గరుడ పక్షులు తమశాబకములను సాకుటకై నిర్మించిన కులాయముల వడువునఁ దోచును. ప్రతి 'పాలు' నకు చుట్టు ప్రక్కలనో యెదుటనో దున్నిన భూమి కొంత యుండును. ఆభూమియే భిల్లులకు జీవనాధారము. అదియే గాక వంశానుగత మగు దొంగతనము వారికి బ్రదుకుఁ దెరువు.

కొండకొమ్ములందు రాతిబొమ్మలవలెఁ గృష్ణవర్ణులు, శౌలీనధారులు, ధనుర్ధరులు నగు భిల్లు లచ్చటచ్చట నిలిచి యుండిరి. వారలే భిల్లప్రదేశ రక్షకులు. తేజసింగును వారు వేర్వేరుగా నెఱుగకున్న పక్షమున ప్రతిధనస్సునందును బాణము సంయోజితమై యుండును.

తేజసింగు కొంతదూరము పోవంబోవ హ్రదము కానంబడెను. వెనుకటి కొండవాగు విశాల మగు నీసరోవరమునం గలిసి యుండెను. సరస్సునకుం గనుచూపు మేరలోం బర్వతములపైం బర్వతములు వృక్షసంఛాదితములై, గగనమండలమునం జిత్రించిన విచిత్రాకారములో యనునట్లు చూపఱకాశ్చర్యము కలిగించుచుండెను. సరసీతటమున కరిగి, తేజసింగు కన్నెత్తి ప్రకృతి నవలోకించెను. తత్సందర్శనముచే నాతని చింత తొలంగిపోయెను.

సాయంసమయ లోహితద్యుతి హ్రదజలముపైం బడి మిక్కిలి మనోహరముగా నుండెను. పర్వతములు సలిలగర్భమునం బ్రతిఫలించుచుండెను. అచ్చట నవ్వడి లేదు, మనుజుల రాకపోకలు లేవు, జీవజంతువుల నివాసచిహ్నములు లేవు. తేజసింగు సరసీతోయమున కాలుసేతులు గడిగికొని, శిలాఖండముపై నాసీనుం డయ్యెను.

రాజపుత్రులు సామ్రాజ్యములను స్థాపించుటకుం బూర్వమచ్చోట భిల్లులు నివసించుచుండిరి. రాజపుత్రులు వారిని జయించి దేశము నాక్రమింపగా స్వాతంత్ర్య ప్రియు లగు భిల్లులు వింధ్యాచలమునకును, ఆరావళీ పర్వతమునకును జని యాప్రదేశములందు వాసము చేయ సాగిరి. ఇ దంతయు క్రీస్తు పుట్టిన కొద్ది సంవత్సరముల తరువాత సంభవించెను.

అది మొదలుగా రాజపుత్రులకును భిల్లులకు వింతచెల్మి కుదిరెను. భిల్లులు పేరునకు రాజపుత్రుల యాధిపత్యము నంగీకరించిరే కాని నిజముగాఁ దమ పర్వతములందు నివసించుచు, సంపూర్ణ స్వాతంత్ర్యము ననుభవించు చుండిరి. కాలక్రమమున వారు రాజపుత్రులను, ముసల్మానులను, ఎవ్వరినైనను సరే, దోచుకొని, యుదరపోషణ చేసికొను చుండిరి. రాణా సింహాసనము నధిరోహించు నపుడు భిల్ల సర్దా రొకఁడు కాను కలు గొని పోయి, యతనికి సమర్పించు చుండును. యుద్ధ సమయములందు భిల్ల యోధులు రాజపుత్రులకు సాయము చేయుచుందురు.

హిందూ దేశమందలి యసభ్యజాతులవా రెల్లరు హిందూ దేవతలను గొందఱను సేవించుచుందురు. భిల్లులు తమయుత్పత్తి క్రమము నివ్విధముగాఁ జెప్పుదురు: "మేము మహాదేవుని తస్కరులము. ఆయన యాదరనులము. మహాదేవుఁ డొక యరణ్యమునఁ బరిభ్రమించుచు, నాటవికాంగన నొకతెను గాంచి తత్సౌందర్యముచే మోహితుఁడై, యామెను బెండ్లి యాడెను. ఆమె కడుపునఁ బుట్టిన నల్లవాఁ డొకఁడు మహాదేవుని వృషభము నొకనాఁడు సంహరించుటచే శప్తుఁడై యడవులఁ బడి తిరిగెను. మే మాతని సంతతివారము."

కొండలమీఁద భిల్లుల పక్కణ ముండును. ఆ గూడెములోఁ బ్రతిభిల్లునియిల్లు దుర్గమువలె నుండును. గృహమునకు నల్వం

కల వృక్షములు, కంచెకోటయు నుండును. ఇట్టి నిలయముల నుండి భిల్లులు ఘాతుకమృగములవలె నాగరకులపైఁ బడి, ధనధాన్యాదికమును హరించుచు జీవించుచుందురు. శత్రువులు 'పాల్' ముట్టడించినపుడు భిల్లాంగనలు శిశువులను బశువులను వెంటఁ బెట్టుకొని సాంద్రారణ్యములందును, బర్వత దుర్గములందును దాగి యుందురు. పురుషులు పగవారిపై బాణములు విడిచియు, రాలు రువ్వియు స్వస్థానమును రక్షించుకొందురు.

భిల్లులలో ననేకదళములు కలవు; ప్రతిదళమునకును సర్దారుండును. ఈ సంఘములకు సర్వదా వివాద ముండును. కాని క్రొత్తశత్రువు వచ్చినపు డందఱు నేక మగుదురు. నక్కకూతలను, బెద్దపులి గ్రాండ్రింపు ననుకరించి, సంకేతము నేర్పఱుచుకొందురు అత్యల్పకాలములో వందలకొలది యోధులు గుమిగూడి, శత్రువులను మార్కొన యత్నింతురు. రాజస్థానమునం దిప్పటికిని రమారమి యిరువదిలక్షల భిల్లులు నివసించుచున్నారు.

భిల్లులకు జాతిభేదము లేదు. వారు హిందూదేవతలను గొందఱను, నానావిధ వ్యాధులను భక్తితోఁ బూజింతురు. 'మహువా' వృక్షమును గారవింతురు; ఈచెట్టునుండి కల్లుదీసి సేవింతురు. పురుషులు నల్లగానుందురు; మిక్కిలి పొడవుగా నుండక, పొట్టిగా నుండక మధ్య మోన్నతులుగా నుందురు.

వీరుబలవంతులు, కార్యధూర్వహులు. స్త్రీలు కొంచెము గౌరవర్ణము కలిగి, చూడ నొప్పియుందురు. వీరు వక్షముపయి చిన్నవస్త్రము ధరింతురు; కాలుసేతులందు లక్కకడియము లను దాల్తురు.

వివాహవిధానము మిగుల సాధారణ మయినది నిర్దిష్టదివ సమున కన్నియలు, తరుణులు నొకచోట సమావేశ మగు దురు. పిదప నొక్కొక్కఁడు తన కిచ్చవచ్చిన యొక్కొక యువతిని దీసికొని యడవిలోనికిఁ జని, కొన్నిరోజు లచ్చటఁ గాలక్షేపము చేయును. పిమ్మట స్త్రీపురుషులు 'పాల్' నకు మఱలి వత్తురు.

భిల్లులయం దసామాన్యగుణములు రెండు కలవు: వారు చేసిన మేలు మఱవరు, ఆడినమాట తప్పరు.

౧౨

ఏ పర్వతము క్రింద ప్రొద తటమున తేజసింగు కూరుచుండి యుండెనో యా పర్వతశృంగమున భీమ చాంద్ అనుభిల్ల నాయకుని పక్కణ ముండెను. దానిదగ్గఱ గుహ కలదు.

సరస్తీరమున తేజసింగు కూరుచుండి యుండగా నొక భిల్లబాలిక చప్పటలు చఱచుచు, నవ్వుచు నచ్చోటికి వచ్చి, బాల్యచాపల్యమున సరసీజలమును దోయిట బట్టి తేజసింగుపైఁ

జల్లెను. అతఁ డాబాలిక చేయి పట్టుకొని, దగ్గఱఁ గూరుచుండఁ బెట్టుకొని, కేశములతో, క్రీడించుచు, నన్యమనస్కుఁడై యుండెను.

ఆ బాలిక నల్లనిది, కన్నులు కాంతిమంతములు, ముఖము సుందరము, కేశములు మిక్కిలి నీలములు. అడవిపిల్లికంటె నా చిన్నది పర్వతముల నెగఁ బ్రాకుటలో నెక్కుడు నేర్పు గలది. తక్కిన భిల్లస్త్రీలవలెనే జాగరూకత నాజన్మావధిగా నేర్చియుండెను. ఒక చప్పుడయినను, ఒకనీడ కనఁబడినను, ఒక క్రొత్తవస్తువులు కన్పట్టినను కారణ మరయక విడుచునది కాదు. ఆకన్నియ నేత్రములు సర్వదా చలించుచుండును ఆమె నిరంతర క్రీడాశీల. ఒకప్పు డా కుమారి పాషాణముల తోను, మఱియొకప్పుడు జలముతోను నాటలాడుచుండును. ఇంకొకప్పుడు పరులపై నీరు చల్లి, కిలకిల నవ్వుచుండును. ఇట్లయ్యును, కొన్నిసమయములం దాకన్య గంభీరభావముతో నుండును. ఆమె గాంభీర్యమును, చంచలస్వభావమును, నన్యమనస్కతను గాంచి, లోకులు మిగుల నచ్చెరు వొందుచుందురు. "చూపుల కీమె బాలిక; కాని హృదయము మాత్రము బాలిక హృదయము కాదు." అని వారు పలుకుచుందురు.

తేజసిం గేమి చింతించుచుండెను ? వానకారుచే శత్రువులు మేవాడ్ భూమిని వదలిపోయిరి. కావున నతఁడు యుద్ధ

విషయక విచారమున లేఁడు. చారణీదేవి యానతి చొప్పున సూర్యమహాల్ దుర్గమునుగూర్చి యోజించుట లేదు. ఇక మఱి దేనినిగూర్చి తలపోయుచుండెను?

భిల్లబాలిక చాలసేపు మిన్నకుండెను; తుదకు ప్రాదోదక మునఁ జేతులు తడుపుకొనుచు, తేజసింగు తొడలపైఁ దల నిడికొని, యతని మొగమువంకఁ దేఱిచూచి, మృదుస్వరమున గీతము పాడెను:

"బాల్యకాలపుఁదలపు లప్పుడప్పుడు జ్ఞప్తికి వచ్చు చుండును. చిన్ననాఁడు చూచిన మొగము నెడపదడప నయనపథమునం దావిర్భవించుచుండును. పిన్ననాటి ప్రేమ యప్పు డప్పుడు నిప్పువలె ప్రజ్వరిల్లును" అను భావములు గల గీతము నామె పాడునప్పటికి తేజసింగులికిపడెను. అతఁడు పిన్ననాఁటి విషయమును గూర్చి చింతించుచుండెను. భిల్లబాలిక యతని మనోగతము నెఱింగెనా యేమి? తేజసింగు బాలికను బేరు పెట్టి పిలిచెను.

బాలిక సలిలతాడనము మాని, తేజసింగు మోము విలో కించెను. ఆకన్నియ వదనమున సమాలోచనాలక్షణ మొంత మాత్రము లేకుండెను. తేజసింగు తనలో "బాలిక నామనస్సులో మాట తెలిసికొనెనా? సరిగా నట్టి గీతమునే పాడినదే!" అను కొనెను.

కిశోరి వికావిక నవ్వెను. తేజసింగు సందిగ్ధమానసుఁడై, "మంచిది! నేను చిన్ననాటి సంగతులను స్మరించుచున్నా నని నీతో నెవరు చెప్పిరి?" అని చిన్నదాని నడిగెను.

"నీవే చెప్పితివే! కాకపోయిన, నీమనసులో సంగతులు నా కేలాగున తెలియును? ఏ మాసంగతులు? పుష్పసంబంధములా?" అని చిఱునగవుతో భిల్లబాలిక వచించెను.

అతనివదనము గాంభీర్య ముద్ర వహించెను, కనుబొమలు ముడి వడెను. అంత నతఁడు గంభీరస్వరములో "ఆసంగతులు పుష్పసంబంధము లని నీ కెవరు చెప్పినారు?" అని యామెను ప్రశ్నించెను.

బాల్యోచిత మగు బెదరుతో భిల్లకుమారి తేజసింగును జూచి "నా కేలాగునఁ దెలియును? అయినను, జిన్నతనమున లోకులు ఫలపుష్ప వృత్తాంతములను గాక మఱి వేనిని గుఱించి చింతింతురు?" అని పలికెను.

ఆమె ముఖమును వీక్షించి తేజసింగు తనలో "నేను నిష్కారణముగా భ్రమపడితిని" అని తలఁచి ప్రకాశముగా, "నిజమే! నేను చిన్ననాటి పుష్పవృత్తాంతములనే చింతించుచున్నాను నీయూహ యుక్త మయినదే!" అని వచించెను.

"భిల్లు లనేక విషయములను జూతురు. అనేకవార్తల నాకర్ణింతురు. నీవు భిల్లుడ వయిన యెడల!—"

భిల్లుఁడ నయిన యెడల?"

తేజసింగు హస్తము బాలిక చేతియం దుండెను; ఆమె నిశ్శబ్దముగా దాని నాతనికిఁ జూపెను.

"భిల్లుఁడ నయిన యెడల, నప్పు డే మగును?" అని మరల నతఁడా కన్నియ నడిగెను. బాలిక నగుచు, "నీవు గుడ్డి వాఁడవా? భేదము కనుపెట్టలేవా? అప్పుడు నీచేయి యెందు లకు తెల్లగా నుండును? నాచేతివలె నల్లగా నుండదా?" అనియెను.

"అమ్మాయీ, వేగిర మింటికి పో, వర్షము వచ్చు చున్నది."

"నేను పోను"

"ఎందుచేత?"

"మబ్బు చూచుట నాకు మిక్కిలి యిష్టము."

"అదేమి?"

"తెల్లని మెఱుపుదీగె నల్లనిమబ్బు—ఈ రెండు నొకచోట నున్నప్పు డెంత బాగుండును!"

తేజసింగు కన్నియమోము వీక్షించెను; ఆమె యాకసము వంకఁ జూచుచుండెను!

"నీవు బాలికవా? ప్రౌఢవా? నిన్ను సరిగా గ్రహింప లేకున్నాను!" అని తేజసిం గర్ధస్ఫుటస్వరమునఁ బలికెను.

పరనిమేషమున భిల్లబాలిక యచ్చోట లేదు ! సంజచీకటిలో నామె యంతర్హిత యయ్యెను. దూరమునుండి పెద్దపెట్టున నగవు వినఁబడెను. ఆ భిల్లకుమారి నిజముగా బాలికయే !

## ౧౩

అంతట తేజసింగు జలాశయమును విడిచి, పర్వతము నారోహించి యాబాలిక జనకుని కుటీరమునకుఁ జనెను. భిల్లనాయకుఁడగు భీమచాంద్ పదవసంవత్సరమునుండి తేజసింగును కొండగుహాలో నుసిచి పోషించుచుండెను. ఆభిల్లుని దయచేతను, ప్రభుభక్తిచేతను తేజసింగిప్పుడు పదునెన్మిది వత్సరముల ప్రాయము గలవాఁడయినాఁడు.

ఆ గూడెములోని ప్రతికుటీరము నందును భిల్లాంగనలు గృహకృత్యములను నిర్వర్తించుచుండిరి. ఆస్త్రీలెల్లరు బలము కలవారు. వారల యూర్ధ్వకాయ మనాచ్ఛాదితమో, యర్ధాచ్ఛాదితమో కొందఱు మగువలు పశువులకుఁ బచ్చిక వేయుచుండిరి; కొందఱు పిల్లలకుఁ బాలిచ్చుచుండిరి; మఱికొందఱు వంటలు చేయుచుండిరి; యుద్ధసమయ మగుటచే వేఱొక కొందఱు పక్కణమునకు నల్వంకల ముండ్లకంప నాటుచుండిరి. పిల్లలు నిప్పుచుట్టు గాని, యావరణములో గాని యాట లాడుచుండిరి. భీమచాంద్ కుటీరమున గూడెములోని యోధు

లెల్లరు సమావేశమై యుండిరి. వారల వికృతాంగములు నిప్పు వెలుతురులో మఱింత వికృతముగా నుండెను.

భీమచాంద్ బలిష్ఠుఁడు. అతని బాహువులు పాదములును బొడవుగా నుండెను. కన్నులు చింతనిప్పులు. అతఁడు కౌపీనము దాల్చి, బుజములపై చిన్నగుడ్డ ధరించి యుండెను. మొత్తముమీఁద నతనియాకారము చూపఱకు వెఱపు గొలుపుచుండును. బాల్యావధిగా నృశంసకార్యములు చేయుచుండుటచే వానిమనస్సున మార్దవ మనుమాటయే లేదు. పర్వతము కంటెను వాని మానసము మిక్కిలి కఠినము. అయినను, వాని యందు రెండుగుణములు స్ఫుటముగాఁ గానఁబడుచుండెను. పుత్రికయెడ వాని కత్యంతానురాగము స్వామిభక్తి మిక్కుటము. భీమచాంద్ ఎంతటి ధైర్యవంతుఁడో యంతటి యుపాయశాలి. వాని తీక్ష్ణనయనములు దూరమునుండియే విపత్తును గ్రహింపఁగలవు. అతఁడు మిత్రులయెడ ఋజుమార్గమున బ్రవర్తించును. శత్రువు లన్న నతనికి మహాద్వేషము.

భీమచాంద్ చుట్టును మూఁగియున్న భిల్లులు కౌపీనములు ధరించి యుండిరి.

నేఁడు భీమచాంద్ కుటీరమునకు నిర్వురు నూతన పురుషులు వచ్చియున్నారు. పాహాడ్‌జీ భూమిజా యొకఁడు, చంద్రపురపు సర్దారు గోకులదాసు రెండవవాఁడు. వా రిర్వురు భీమచాందును తేజసింగును సంరక్షింప నేతెంచినారు.

పాహాడ్‌జీ భూమిజా జాతివాఁడు. నేల దున్నుటయే యాతని యుద్యోగము. అతని నేత్రములయందును వదనమందును వీరోచిత మగు దర్ప మున్నదనుటకు వీలు లేదు. కాని యతనిశరీరము పరిశ్రమచే గట్టిపడినది. భూమిజాలు సమ్ముఖ యుద్ధము నెఱుఁగకున్నను దమ దుర్గములను భూములను రక్షించుకొందురు; దేశములో శత్రువులు ప్రవేశింపకుండ మార్గము నరికట్టుదురు.

గోకులదాసు వశీ వంశ్యుఁడు. ముసలితనముచేతను మనోవ్యథలచేతను నతనిశరీరము సడలియుండె; కాని నేత్రములనుండి తేజస్సు, హృదయమునుండి యుత్సాహము పట్టుదలయును వెడలి పోలేదు. పుత్రహంతను సంహారింపవలె నన్న ప్రతిజ్ఞచేతనే యావృద్ధుఁడు ప్రాణములను భరించుచుండెను.

అగ్ని చుట్టును వా రెల్లరుఁ గూరుచుండి యుండ, తేజసింగు కుటీరమునఁ బ్రవేశించెను. అందఱు నతనిని స్వాగత మడిగిరి.

ఇష్టాలాపములు నడచెను. మహారాణా ప్రతాపసింగును గూర్చియు, హల్దీఘాట్ యుద్ధమును గుఱించియు, దుర్జయసిఁగును సూర్యమహాలును గూర్చియు వారు సంభాషించిరి. అటుతరువాత తేజసింగు సూర్యమహాలుపై నెప్పుడు దాడి వెడలునో యని ప్రశ్నించిరి. పాహాడ్‌జీ తన భూమిజా సైన్య

ముతోను, గోకులదాసు తన వంశీసేనతోను, భీమచాంద్ తన భిల్ల బలముతోను తేజసింగునకు సాయముచేసి, యతనిని తండ్రి పీఠముపై నిలుపునట్లు ప్రతిజ్ఞ చేసిరి.

అందఱను బ్రశంసించి, భీమచాందును విశేషించి, ప్రశంసించువాఁడై, తేజసిం గిట్లు పలికెను.

"పదవసంవత్సరమున దుర్గమును గోల్పోయి నేను పరత్వాములయందు నివసించు చున్నాను. సర్దార్ భీమచాంద్ అనుగ్రహముచేతనే దుర్జయసింగు క్రోధమునుండి రక్ష నొంది యీ యెనిమిది సంవత్సరముల కాలము సురక్షితముగా నున్నాను భీమచాంద్ తండ్రి మన మహారాణావారి జనకుఁడగు మహారాణా ఉదేసింగును గష్టకాలమందు రక్షించిన విషయము మీ కెల్లరకును విదితమే. ఇప్పుడు భీమచాంద్ మాపై నట్టి యనుగ్రహమును జూపుచున్నాఁడు. ఇక్కట్టులలో ననేక పర్యాయములు భిల్లులు రాజపుత్రులకు సాయము చేసినారు."

అంతట భీమచాంద్ ఈలాగున విన్నవించెను.

"నేను రాఠోడ్ తిలకసింగును బాగుగా నెఱుఁగుదును. అట్టి రాజపుత్రు నిక చూడఁబోను తిలకసింగు పుత్రునికొఱకు నాచేత నయినపని చేయుదును భిల్లసైన్యముతో సూర్యమహాలును ముట్టడి వేయుదును. రాజపుత్రులు భిల్లులకుఁ బ్రభువులు.

రాజపుత్రులకుఁ దోడ్పడుట మా ధర్మము. ఇంటికి వచ్చినవారి కాశ్రయము మిచ్చుట మా ప్రధాన ధర్మము.”

“నేనుగూడ తిలకసింగును బాగుగా నెఱుఁగుదును” అని పాహాడ్‌జీ వచించెను.

పిమ్మట వృద్ధగోకులదాసీప్రకారముగా చెప్పెను.

“దుర్జయసింగు చంద్రపురవాస్తవ్యులను బీడింపని మానము లేదు. పౌరులు వెనుకటి ప్రభు వగు తిలకసింగును సర్వదా స్మరించుచుందురు; తిలకసింగుగారి పుత్రుఁడు జీవించియుండెనో లేదో యని వీరిని వారిని నడుగుచుందురు. కొన్ని మాసముల క్రిందటివఱకును దమరు జీవించియున్నట్లు వారికి స్పష్టముగాఁ దెలియదు. కాని, ఆ హేరియానాడు తమరు దుర్జయసింగునకుఁ గానబడినట్లు వినికిడి గలదు. ఇకఁ దమరు నాయనగారి సింహాసనముపై నెప్పుడు కూరుచుందురా యని ప్రజ లుత్సుకులై యున్నారు. అజ్ఞానింతురేని, చంద్రపురాది గ్రామములవారు దుర్జయసింగునకు విరుద్ధముగాఁ గత్తి కట్టుదురు. ఈ వృద్ధుఁ డింతకంటె నేమి చెప్పును? నాకు జరిగిన యన్యాయమును భగవంతుఁడే విచారించును. చంద్రపురాది గ్రామములవారికి సంభవించు కష్టములను నివారింపుఁడు ఇదియే నావిన్నపము.”

వృద్ధునిపుత్రుఁడు దూరి తీయఁబడిన సంగతి యందఱకును దెల్లమే. గోకులదాసుని వాక్యముల నాకర్ణించి యందఱు జాలి నొందిరి. తేజసింగు గోకులునితో ని ట్లనెను:

"అయ్యా, మీదుఃఖమును భగవంతుఁడే యుపశమింపఁ జేయఁగలవాఁడు. నాయనగారి యనుచరు లగు మీరు నన్ను సూర్యమహల్ పీఠమునఁ గూరుచుండఁ బెట్టవలెను. నేను చంద్రపురము మొద లగు గ్రామములను సంతోష పెట్టెద నని శపథము చేయుచున్నాను!"

కొంతసేపటికిఁ గ్రమ్మఱ తేజసింగు వారలతో "ఇం కొక మాట. ఆ హేరియా దినమున నేను 'నాహారా మగ్రోకు' చని యుంటిని" అని పలికెను.

భయంకర మగు నాప్రదేశము పేరు విని వారందఱు నిర్వాక్కు లయి, యచ్చటి విశేషములను దెలిసికొనఁ గుతూహాలు లయిరి.

"విదేశీయు లగు శత్రువులు దండెత్తి రానుండగా గృహకలహము యుక్తము కాదు, రాజనీతిని పాటింపవలెను. అని చారణీదేవి యానతి యొసఁగెను" దని తేజసింగు పలికెను.

"పగ తీర్చుకోవలె నని యీవృద్ధునియెడ లెంత మందు కొని పోవుచున్నదో దేవునికే యెఱుక! పుత్రశోకము దుస్సహమయినది. అయినను, చారణీమాత యానతి శిరసా వహించవలెను. మహారాణావారు తురకవానితో యుద్ధము చేయుచుండునంతకాల మంతఃకలహము నిషిద్ధమే" అని గోకులదాసు నుడివెను.

ప్రొద్దు వోయినపిమ్మట తేజసింగు భిల్లకుటీరమును విడిచి రాథోడ్ దేవీసింహుని భీమగడ్ దుర్గమునకుఁ జనఁ జొచ్చెను.

తిలకసింగు ననుచరులలో దేవీసింగుకంటె నెక్కుడు విశ్వాస యోగ్యుఁడు వీరుఁడు నగువాఁడు లేఁడు. ప్రప్రథమమున రాథోడ్ వంశస్థులు సూర్యమహాలును జయించు నప్పుడు దేవీసింగు పూర్వపురుషుఁ డొకఁ డాయనకు కుడిభుజమువలె నిలిచి, సమస్తకార్యములను నిర్వహించెను. రాథోడ్ ప్రభువు సంతుష్టుఁడై, సూర్యమహాలుకు సమీప పర్వతమున భీమగడ్ దుర్గమును నిర్మించి, యనుచరున కొసంగెను. అప్పటినుండియు భీమగడ్ దుర్గాధిపులు వంశానుక్రమముగా సూర్యమహాల్ దుర్గాధినాథులకు విధేయులై యనేక యుద్ధములందుఁ దమ రక్తమును ధారవోసి, స్వామి భక్తిఁ లోకమునకు వెల్లడిఁ జేసిరి.

దుర్జయసింగు సూర్యమహాలు నాక్రమించిననాటి రాత్రి యుద్ధములో తిలకసింగు సైనికులనేకులు మృతినొందిరి; మిగిలిన వారు దుర్గమును విడిచి చాలదినములు కాననములలోను, బర్వతములమీఁదను నివసించి, తుదకు భీమగడ్ దుర్గేశుని కొలువులోఁ జేరిరి. అరేయి తేజసింగు నీటిలో నీదుచుండుట కొందరకంటఁ బడెను; కాబట్టి బాలుఁడు జీవించి యుండునని వారు భావించిరి. బహుకాలము తేజసింగు కొఱకు వారు

దేశము కలయ వెదకరి తుద కొకపురాతన సేవకుఁడు భిల్లవేషము దాల్చియున్న తేజసింగు నానవాలు పట్టి, సానంద ముగా నతని కభివాదము చేసెను.

క్రమముగా హతశేషు లగు సైనికులు తేజసింగు చుట్టును జేర సాగిరి, బాలుఁడు జనకునిభంగి దీర్ఘకాయుఁడు, విక్రమ శాలియు నగుటఁ గాంచి వారు మిగుల నానందము నొందిరి. క్రమక్రమముగా నీవృత్తాంతము తిలకసింగు ననుచరుల కెల్లర కును దెలిసెను. వా రందఱు చిన్నయేలికను సమీపించి, యేకగ్రీవముగా ని ట్లనిరి : “ మేము తిలకసింగుగారి యుప్పు తిన్నవారము. మాఖడ్గములు, మాప్రాణములు తిలకసింగుగారి కుమారునివే ! ఆజ్ఞాపింతురేని, సూర్యమహాలు నాక్రమించి, దేవరవారిని నాయనగారి సింహాసనముపై నిలుపుదుము ! ”

దుర్గాధిపుఁ డగు దేవీసింగును గవుగలించుకొని, భీమగడ్ దుర్గమునకు వచ్చి నివసింపవలె నని యతనికి నొక్కి చెప్పెను. కాని తేజసింగు “ దుర్దినములలో భిల్లులు నా కాశ్రయ మిచ్చి నారు. నేను సూర్యమహాలును జయింప నంతవఱకును భిల్లుల యందనే యుండెద ” నని పలికెను

ప్రొద్దు వోయినపిమ్మట తేజసింగు భిల్లకుటీరమునుండి బయలుదేఱి, భీమగడ్ దుర్గమును జేరెను. రాతోదులు దుర్గమునం దొకచోట నుపవేసించియుండిరి. సమీపమున వృత్త మనుమాట లేకుండెను. ఆకసము వితానమువలెనుండెను.

నిర్మలనభోమండలమునఁ దారకలు మినుకుమినుకు మను చుండెను. దుర్గమునందు వెలుఁగుచున్న యగ్నికి నల్దిక్కులఁ గూరుచుండి రాఠోడులు చలి కాచుకొనుచుండిరి. వీరభటుల యన్యోన్యాలాపములు నుల్లాసధ్వనులును మిన్నుముట్టు చుండెను. కొందఱు చారణుని దమకడఁ గూరుచుండఁ బెట్టు కొని రాఠోడ్ యశోగీతముల నాకర్ణించుచుండిరి. అట్టియెడ తేజసింగు వారికిఁ గానఁబడెను. అతని నాకస్మికముగా నుపలక్షించి రొక్కుమ్మడి నయిదువందల రాఠోడులు మహోల్లాసమున లేచి సింహనాదము చేసిరి. తేజసింగు సంతుష్టుఁ డయ్యెను.

అగ్నిద్యుతి సుభటుల వదనమండలములపైఁ బ్రసరించు చుండెను. బాల్యమునుండి యుద్ధమే జీవనముగా నుండుటచేత వారల శరీరములు గట్టిపడి యుండెను. కొందఱి ముఖముల మీఁదను, కొందఱి బాహువులమీఁదను, మఱికొందఱి వక్షముల మీఁదను కత్తిదెబ్బలు తగిలియుండెను. వారి కేశములు నరసినవి. కాని యందఱినేత్రములును జాజ్వల్యమానములు. రాఠోడులు తిలకసింగు నధీనమున ననేక యుద్ధములు చేసి యుండిరి; చితోడ్‌గడ్ ధ్వంసనసమయమున మహాపరాక్రమము చూపియుండిరి; ఇప్పుడు తేజసింగును సేనాధిపతిం జేసికొని మొదట సూర్యమహాలును, దరువాత చితోడ్‌గడును జయింప నున్నవారు. తేజసింగు తన జనకుని ప్రాతబంట్లను

దనుచుట్టును గాంచి, వారి యానందమును వీక్షించి, వారల ప్రభుభక్తికి మిగుల సంతసించెను.

అంతట తేజసింగు వారలతో నిట్లనెను :

"వీరులారా, మీ ప్రభుభక్తికి మిక్కిలి సంతసించినాను. మీవలన రాథోడ్ శాఖకు గీర్తి వచ్చినది. తిలకసింహుని పుత్రుఁడు మిమ్ము నెన్నటికిని విస్మరింపఁడు."

"కీర్తిశేషు లయిన తిలకసింగుగారి నమ్మినబంట్లము. మా ఖడ్గములు ప్రాణములును తేజసింగుగారివే!" అని యా సైనికులు బదులు పలికిరి.

పలితకేశములు మోముపై వాలియున్న దేవీసింగు ప్రభువును జూచి "ఈదాసుఁడు నాయనగారి పట్టాభిషేకమును జూచినాఁడు. తమ పట్టాభిషేకమునుగూడఁ జూడఁ దలఁచు చున్నాఁడు. మిమ్ము సూర్యమహాల్ గదీ (పీఠము) మీఁదఁ గూరుచుండఁ బెట్టవలె నని నా యభిలాష. ఇంతకంటె వేఱొక వాంఛ లేదు" అని పలికెను.

"దేవీసింగ్, నాయనగారి సేవకులలో మీయంత వృద్ధులు లేరు. హల్దీఘాట్ యుద్ధమున మీకంటె హెచ్చుగా యుద్ధము చేసిన వడుచువాఁడు లేఁడు. మీ మనోరథము నెఱవేఱుట కింకను జాలకాలము పట్టును."

"దేవరవారి యానతి శిరోధార్యము. ప్రభువుగారు విజయమును గూర్చి యేల సంకోచించుచున్నారు? చందావత్

దుర్జయ సింగునకుఁ బదివందల బల మున్నదని విన్నాను. అయిదువందల రాఠోడులు వేయిమంది చందావతులతో యుద్ధము చేయలేరా?"

"అందుకు సందేహము లేదు. మాతండ్రిగారి మిత్రులు కొందఱు నాకుఁ దోడ్పడుటకు సమ్మతించినారు. షాహోడ్‌జీకి వేయిమంది భటు లున్నారు; భీమచాందుకు రెండువందల భిల్లులు; గోకులదాసున కిన్నూఱు 'వశీ' ప్రజలున్నారు. వీ రందఱు తిలకసింగుగారి పుత్రునికొఱకు ప్రాణములనైన విడుచుటకు సిద్ధముగా నున్నారు."

"ఇఁక యుద్ధ మేల చేయరాదు?"

"సూర్యమహలును మనము స్వాధీనము చేసికొనఁగలము, సందేహము లేదు. కాని విశ్వాసపాత్రు లగు వీరు లనేకులు మృతి నొందుదు రన్న విచారము బాధించుచున్నది."

"ప్రభుకార్యమునఁ బ్రాణములు విడుచుటకంటె మించిన గౌరవము రాఠోడులకు మఱే మున్నది? రాఠోడులు మరణ మున్న భయపడరు."

"సత్యము! మాతండ్రిగారు చితోడ్‌గడ్ రక్షణసమయమునఁ బ్రాణములు విడిచినారు; వారు మార్గప్రదర్శకులు! సూర్యమహాల్ దగ్గఱ మీరు మృతి నొందినయెడల తిరుగ హాల్దిఘాట్ రణక్షేత్రమున నిలిచి పోరాడువా రెవరు? మాతృవధను వంశావమానమును తేజసింగు విస్మరింప లేడు; నాదుల

యందు రక్తము ప్రవహించుచున్నంతవఱకు విసర్జింపఁడు. అయినను, విదేశీయశత్రువులలో యుద్ధము నడచుచున్నంతకాల మంతఃకలహము నిషిద్ధము. ఇది చారణీదేవి యాజ్ఞ. కాబట్టి మనము రాజనీతి ననుష్ఠింతము.”

రాఠోడు లెల్లరు నతశిరస్కు లయిరి. దేవీసింగు గంభీర వాక్కులతో నిట్లనెను: “తమ రాజ్ఞాపించిన ప్రకారమే నడచు కొందుము. తురుష్కుఁడు మనపై దండెత్తి వచ్చుచుండ రాఠోడులు చందావతులు తమలోఁ దాము పోరాడుట యుక్తము కాదు. ఈ వృద్ధుడు యుద్ధాంతమువఱకు జీవించి యుండునేని—దుర్జయసింగ్ చందావత్ ! జాగ్రత !”

“దుర్జయసింగ్ చందావత్, జాగ్రత !” అని యచ్చటి వా రెల్లరు నేకగ్రీవముగా కేకవేసిరి. ఈయుత్సాహ వాక్యము నల్దిక్కుల వ్యాపించెను.

ఇంతలో దేవీసింగు పుత్రుఁడు పదునాలుగేండ్ల బాలుఁడు చందనసింగనుఁ వాడు తేజసింగు సమ్ముఖమున కరుదెంచెను. బాలుని సుందరవదనబింబముపై గుత్తులు గుత్తులుగాఁ గృష్ణ కేశములు తాండవ మాడుచుండెను. నల్లనికన్నులు బాల చాపలమును బ్రకటించుచుండెను. ఆ కుమారుని యాననము కోమలము, ఓష్ఠము లరుణములు; కాని శరీరము బలిష్ఠము నున్నతము చందనసింగు ప్రభువున కభివందనము చేసెను.

బాలుని జూచినతోడనే తేజసింగునకు వెనుకటి వృత్తాంతములు జ్ఞప్తికి వచ్చి, నేత్రమున బాష్పకణము నిలిచెను; దానిని దుడుచుకొని, యతఁ డిట్లు పలికెను: "చందన్, చిన్నతనమున మన మిర్జాపురము సూర్యమహాల్ దుర్గమున జోడుగా నాడు చుండెడివార మనుమాట జ్ఞప్తియం దున్నదా? నేను నేర్పుచుండ నీ వాఱవసంవత్సరముననే బాణము విడుచుటయందు, బల్లెముతోఁ బొడుచుటయందుఁ గొంత కౌశలమును గణించిన సంగతి మనస్సునకుఁ దట్టినదా? మానాయనగారు రొకనాఁడు నీముఖము వీక్షించి 'చందనసింగు దేవీసింగువంటి వీరుడు కాఁగలఁడు' అని పలికిన వాక్యము స్మరణమునకు వచ్చుచున్నదా?"

కృతజ్ఞతను సూచించు స్వరముతో చందనసింగు "దేవరవారే నా చిన్ననాటి గురువులు, అగ్రజులు. ఆగాధలు మఱవఁగలనా? ప్రభువుగారే నాకు రణశిక్ష నొసఁగితిరి. ఇప్పుడు తురుష్కులతో యుద్ధము చేయ నాజ్ఞ దయచేయుదు రేని కృతార్థుఁడ నయ్యెదను" అని పలికెను.

"చందన్, నీవు చిన్నవాడవు. ఇప్పుడు నీవు దుర్గమున రణశిక్ష నొందుచుండుము; యథాకాలమున తండ్రిగారు నిన్ను యుద్ధరంగమునకుఁ దీసికొని పోవుదురు" అని తేజసింగనెను.

"పదునాలుగేండ్ల రాజోద్యు తుర్కీవారితో యుద్ధము చేయఁజాలఁడా?" అని చందనసింగు వచించెను.

తేజసింగు మందహాసముతో "సింగము కడుపున సింగమే పుట్టును. దేవిసింగు కుమారుఁడు సంగరము కొఱకుఁ దొందర పడ నేల? చందన్‌సింగ్, త్వరలోనే భయంకరమైన యుద్ధము సంభవింప నున్నది; మన మందఱము కలిసి పోరవలసి వచ్చును. మీతండ్రిగారు సర్వదా మహారాణావారి సన్నిధి యం దుందురు కదా, నీ విచ్చట నుండనియెడల భీమగడ్ దుర్గమును రక్షించువా రెవరు? చందన్, నీవు చిన్నవాఁడవే, కాని వీరుఁడవు. కాబట్టి, నీవు భీమగడ్ దుర్గమును రక్షించు చుండుము. రాఠోడ్ ఖడ్గము నీచేతియందుఁ బ్రకాశించును గాక!" అని యాశీర్వదించెను.

చందన సిం గొఱలోనుండి కత్తి దూసి, దానిని స్పృశించుచు, నాకసముదిక్కు మొగమై "నేటినుండి నేను ప్రభువు వారి యాజ్ఞాను సారముగా దుర్గమును రక్షించువాఁడను. భగవంతుఁడు సాహాయ్య మగుఁ గాక! చందనసింగు ప్రాణముల తో నున్నంతవఱకు నొక్క రాఠోఁ డయినను జీవించియున్నంత కాల మీదుర్గములో తుర్కీవాఁ డడుగు పెట్టనేరఁడు!" అని పలికెను.

బాలుని ప్రతిజ్ఞావాక్యముల నాలించి రాఠోడులు సింహనాదము చేసిరి. దేవీసింగు నయనములనుండి యానందాశ్రువులు రాలెను. కాని, యెట్టిరక్తప్రవాహముననుం, నెట్టి యగ్ని మధ్యముననను బాలుని ప్రతిజ్ఞ నిర్వహింపఁ బడునో దేవీసింగు కాని రాఠోడ్ సైనికులు గాని యోజింప లేదు.

హాల్దీఘాట్ యుద్ధానంతరము దుర్జయసింగు సూర్యమహాల్ దుర్గమునకుఁ దిరిగి వచ్చెను. ప్రాతఃకాలమున సూర్యమహాల్ పర్వతశిఖరము మీఁద చందావత్పతాక గాలితాకున సంచలించు చుండెను. పౌరులు హాల్దీఘాట్ యుద్ధమును గూర్చియు తుర్కీ వాండ్రను గుఱించియు మాటలాడుకొనఁ జొచ్చిరి. స్త్రీలు కీర్తనలు పాడఁ దొడఁగిరి.

సాయంసమయమున దుర్జయసింగు సభాభవనమునఁ గూరు చుండెను. యోధులు కొంద ఱతని కిరుప్రక్కల నాసీనులై యుండిరి. కొన్ని నెలల క్రిందట నీభవనములోఁ గూరుచుండి యున్న వీరులలో నిప్పు డెందఱో భూలోకమున లేరు! యుద్ధమున మరణించినవారిని లోకులు ప్రశంసించిరి. ఇప్పుడు సదస్సులో నున్నవారిలో ననేకుల శరీరములపై యుద్ధచిహ్నములు స్పష్టముగా నున్నవి.

సభలో నొకమూల గోలాలు నిలిచియుండిరి. వారు యుద్ధములోఁ దమ ప్రభువు నెన్నడును విడిచి యుండరు. హాల్దీఘాట్ యుద్ధమునకు దుర్జయసింగు వెంటఁ జనిన నూర్గురు గోలాలలో నేబదిమంది యయినను దిరిగి రాలేదు. గోలాలు దాసులు, వారికి స్వాతంత్ర్యము లేదు. వారికిదాస్యమే జీవనము. వారిప్రాణములు ప్రభువు చేతిలో నుండును. వారికిఁ బ్రభుభక్తికంటె వేఱొకధర్మము లేదు. వారి సంతానము

గూడ దాస్యమునకు లోఁబడియుండును. గోలా గోలీని తప్ప మఱేస్త్రీని వివాహ మాడుటకు వీలు లేదు రమారమి యేబదిమంది పరిచారకు లొకమూల వినయము తోఁప నిలిచి యుండిరి. వారల కుడికాళ్లకు వెండికడియము లుండెను.

"వర్షాకాలము గడచిన తరువాత యువరాజు సలీమ్ తుర్క సేనతోఁ గ్రమ్మఱ మేవాడ్ దేశము నాక్రమించునా? రాజా మానసింగు స్వజాతీయుల రక్త ప్రవాహముతో నింకను దృప్తిఁ జెంద లేదా? కాకపోయిన పక్షమున శిశోదీయు లింకను రక్తపాతమునకు సమ్మతింతురు; తురకవాండ్రను రణరంగమున మార్కొందురు. ఎంతవఱకు సిసోదియా వంశజుఁడు జీవించి యుండునో, యెంతదాక చందావతులనాడు లందు రక్తము ప్రవహించునో యంతవఱకును మేవాడ్ రాజ్యలక్ష్మి పరాధీనతా కళంకరేఖను లలాటమున ధరింపదు!" అని దుర్జయ సింగు పలుకుచుండగా చారణుఁ డచ్చటి కేతెంచి దుర్జయు ననుమతి వడిసి, హాల్దీఘాట్ సంగ్రామగీతము పాడెను. వృద్ధ చారణుఁడు హాల్దీఘాట్ యుద్ధరంగమునకుఁ జనిఁ ప్రతాపుని యతిమానుష వీరవిహారము నవలోకించి తాఁ జూచిన చర్య లనే వర్ణించెను. శబ్దోదధిని మథించి, ప్రౌఢవాక్కున, గంభీర స్వరమున గీతము పాడెను. తుద కతఁడు చందావద్వంశమును వర్ణించి, కుంతధారి రక్తసిక్తాంగుఁడు, భయంకర మూర్తియు నగు దుర్జయసింహుని సాహసము నుగ్గడించి, గీతమును సమాప్తి చేసినప్పుడు సభాభవనము యోధుల యుల్లాస రవముతో నిండిపోయెను.

వృద్ధునివెన్వెంట వయస్థచారణుఁ డొకఁడు సభలోనికిఁ జనియుండెను. అత డొకానొకగీతమును బాడ ననుజ్ఞ వేఁడు వాఁడై దుర్జయసింగుతో ని ట్లనెను. "చందావత్రభూ ఆస్థానకవి పాడిన గీతము వంటి గీతము రచించుట దుస్సాధ్యము అయినను, సభాసదుల యనుమతి యయ్యేనేని నే నొక గీతము పాడెదను. మేఘము సాలతమాలాశ్వత్థప్రభృతి మహాతరువు లపై వర్షించినప్పుడు దూర్వాంకురముపై నేల వర్షింపకుండును? ఆనతి యయ్యేనేని యీ కవియు నేదో కొంచెము కవనము చెప్పును"

దుర్జయసింగు ప్రసన్నదృష్టితో నతనిం జూచి, "చారణ దేవా, నీవినయమునకు మిక్కిలి సంతసించితిని. నీవు మాకప రిచితుఁడవు; కాని వీరుల, కవుల గుణములే పరిచయము కలిగించును. గీతము నారంభింపుము" అనెను. కవి గీతము నారంభించెను.

౧

"ఆ యున్నతదుర్గ మెవ్వారిది ?"

ఎవరు వంశానుక్రమముగా దానిని రక్షించుచున్నారో వారిదా ?

అథవా యెవరు తస్కరులవలె నపహరించిరో వారిదా ?

తస్కరుని కవమానము సంభవించును! తస్కరుని రుధి రముతో రాజపుత్ర ఖడ్గములు ప్రకాశించును!

౨

"ఆ యున్నతదుర్గ మెవ్వారిది ?"

తద్రక్షణార్థ మేరమణి యుద్ధము చేసెనో యామెదా ?

అథవా యెవఁడు స్త్రీవధ చేసి * దుర్గము నేలుచున్నాఁడో వానిదా ?

స్త్రీ హంత యవమాన మొందును ! నారీహంతకుని హృదయ శోణితముతో రాజపుత్రఖడ్గములు ప్రకాశించును !

౩

"ఆ యున్నత దుర్గ మెవ్వారిది ?"

ఎవఁడు బాలుని సంపద హరించెనో వానిదా ?

అథవా—యేబాలవీరుఁడు ♦ పర్వతము లందు నివసించుచున్నాఁడో యాతనిదా ?

* చిత్తోడ్ దుర్గధ్వంస సమయమున పత్తు భార్యయు తల్లియు మొగలులతో యుద్ధము చేసి మృతి నొందిరి.

♦ తండ్రి జీవించి యుండుటచే ప్రతాపసింగు యువరాజుగా నుండెను. హల్దీఘాట్ యుద్ధకాలమున నతఁడు సపరివారముగాఁ బర్వతము లందు నివసించు చుండెను.

బాలుఁడు ఖడ్గము ధరించినాఁడు, హల్దీఘాట్ యుద్ధమున బరాక్రమము చూపినాఁడు ! తస్కరుని రుధిరముతో వాని ఖడ్గము ప్రకాశించును !

"ఆ యున్నత దుర్గ మెవ్వరిది ?"

దుర్గ రక్షణమునం దేవీరులు నిహతులయిరో, హతశేషు లయి యెవ్వరు పర్వతములందు నివసించుచున్నారో వార లదా ?

క్రమ్మఱ రాజపుత్రులు దుర్గము నాక్రమింతురు; శాత్ర వర క్తముతో ఖడ్గములు రంజిల్లుచుండ చితోడ్ దుర్గములోఁ బ్రవేశింతురు !"

గీతము సమాప్తి నొందెను. జాజ్వల్యమానము లగు తరుణుని నేత్రముల నవలోకించి సభాసదు లుచ్చైస్స్వరమున "తుర్కీవాంద్ర ర క్తముతో ఖడ్గములు రంజిల్లుచుండ రాజ పుత్రులు చితోడ్ దుర్గమునఁ బ్రవేశింతురు !" అని యుద్ఘో షించిరి.

దుర్జయసిం గుత్సాహవాక్యము నుచ్చరింప లేదు, చార ణునిఁ బ్రశంసింప లేదు. భ్రుకుటీభంగముతో నేలవంకఁ జూచుచుండెను. ఇంచుక సేపటికి కన్నెత్తి చారణునివంకఁ జూచెను. చారణుఁడు సభలోఁ గానఁబడ లేదు !

౧౬

దుర్జయసింగు మేడపై శయనించి యుండెను. ఆతనితల పరి చారిక తొడపై నుండెను. మఱియొకతె యాతనిపాద సంవా

పానము చేయుచుండెను. ఆస్త్రీ లిర్వురును రూపయావన సంపన్నలు. వారల సపర్య దుర్జయుని విచారమును దొలఁగింప లేకుండెను.

కొంత తడవు చింతాకులుఁడై యుండి తుదకు దుర్జయ సింగు మంత్రిని బిలువ నంపి మేడపై నిటు నటు నడువఁ జొచ్చెను. పరిచారికలు గృహాభ్యంతరమున కరిగిరి.

ఇంతలో మంత్రి వచ్చెను. తోడనే దుర్జయుఁ డతనిని జూచి "యుద్ధయాత్రా సమయమునాటి నాయానతి యే మయ్యెను ? అని ప్రశ్నించెను.

"చారులను నానాదిశలకుఁ బంపితిని. మరలి వచ్చినవారిని తిరుగఁ బంపితిని. కాని యింతవఱకును వానిజాడఁ గనిపెట్టి నవాఁ డొకఁడును లేఁడు" అని మంత్రి బదులు పలికెను.

"అడవులలోను, కొండలలోను, భిల్లులనడుమను జాగరూకతతో వాని కొఱకు వెదకించితిరా ?"

"అన్నియెడలను జాగరూకతతో చారులు సంచరించు చున్నారు"

దుర్జయసింగు మొగము వాంచి చింతామగ్నుఁ డయ్యెను.

"దేవా, యీలాగున జింతింప వలదు. ఇప్పటికిని జీవించి యున్నను వాఁడు దేవరవారి నేమి చేయఁగలఁడు ?"

"జీవించి యున్ననా ? తేజసింగు జీవముతో నుండుటను గూర్చి సందేహించు చున్నారా ?"

"చీకటిరాత్రి వాని నొకసారి చూచితి మంటిరే, యది భ్రమ కాకూడదా? వాఁడు బ్రదికియే యున్నయెడల మన గూఢచారుల కేల కనఁబడఁడు? ఇంతకాలము నిశ్శబ్దుఁడై యుండుటకుఁ గారణ మేమి? దేవా, నిష్కారణముగా విచారము వలదు. ప్రమాదమున దుమికి తేజసింగు మృతిఁ గాంచి చాలకాల మయినది."

"అమాత్యా, వాని నొకనాటిరాత్రి చూచినా నన్నచోఁ బొరపాటు కావచ్చును. కాని, వానిని రెండుమూడుపర్యాయములు చూచినాను."

"ఎప్పు డెప్పుడు?

"భిల్లులు కాని, భూమిజాలుకాని బల్లెముపట్టుట నెఱుఁగుదురా? కాని, హాల్దీఘాట్ యుద్ధమున రెండు దళముల భిల్లులు భూమిజాలును బల్లెములను గత్తులను జేపట్టి, రాజా మానసింగు సేనపైఁ బడిరి."

"ఇది నిజముగా విస్మయకర వృత్తాంతమే!"

"ఏంతమాత్రము విస్మయకరము కాదు. వారు భిల్లులు కారు. ఒక రాఠోడ్ యోధ భిల్లవేషముతో నుండెను. నేను వాని నానవాలు పట్టితిని. అతఁ డానాటి బాలుఁడే! చితోడ్ ధ్వంసనమయమున జయమల్లుని పార్శ్వమున యుద్ధము చేయు

చుండ తిలకసింగును జూచితిని. అతని పుత్రుఁడు యుద్ధములోఁ దండ్రికంటెఁ దక్కువవాఁడు కాఁడు."

అమాత్యుని వదనము గాంభీర్యముద్ర వహించెను. దుర్జయసింగు మఱల నిట్లు చెప్ప సాగెను.

"ఆ హాల్దీఘాట్ యుద్ధములో వానిని జూచినగానే నాబల్లెము చలింపఁ జొచ్చెను. దుర్జయసింగు బల్లెము వ్యర్థము కానేరదు. ఒక్కపోటుతో శత్రువు నీలోకమునుండి వెడలఁగొట్టవలె నన్న యభిలాష కలిగెను. కాని మృగయాదివసపు గాథ జ్ఞప్తికి వచ్చుటచేఁ జేతిలోని యీటె చేతిలోనే యుండెను."

"వేటలో దేవరవారి ప్రాణములను రక్షించినంత మాత్రాన వాఁ డవధ్యుఁ డగునా ?"

"మన దేశమును జయించుటకుఁ దురుష్కులు నిరంతర ప్రయత్నములు చేయుచున్నారు. విజాతీయులతో యుద్ధము సంభవించి యుండగా స్వజాతీయుని వధించుట రాజనీతి కాదు."

"అలాగైనచో నన్వేషణ మెందులకు ?"

"ఏనాఁడు ఢిల్లీతో యుద్ధము ముగియునో యానాఁడే దుర్జయసింగు తన హృత్కంటకమును బెఱికివేయును. అందుల కయి ముందుగానే వాని నివాసస్థానము నెఱిఁగియుండుట మంచిది."

"వెదకించుటలో నాలోపము లేదు. ఇంతవఱకును దేవర వారి యుద్దేశము స్పష్టముగా బోధపడినది కాదు. ప్రభువు వారు వానిని మూడవ పర్యాయ మెక్కడఁ జూచినారు ?"

దుర్జయసింగు కొంతసేపటివఱకును మాటలాడ లేదు. అతనిముఖము క్రమక్రమముగా భంగపాటు నొందఁ జొచ్చెను. తుద కతఁడు మంత్రిని జూచి "ఈనాఁ డాపిన్నచారణుని గీతమును విన్నారు కదా ? దాని యర్థమేమి ?" అని ప్రశ్న చేసెను.

"చిత్తోడ్ పునరుద్ధరణమును గూర్చి చారణదేవుఁడు పాడినాఁడు."

"వృథామంత్రిత్వము ! హుమ్ ! అది మొదలుగా నామనస్సు సందేహాస్పద మయినది. కాని యిక సంశయముతోఁ బని లేదు. అమాత్యా, ఆగీతము చిత్తోడ్ ధ్వంస విషయకము గాదు. సూర్యమహాల్ దుర్గవిజయ సంబంధ మయినది. జటాభారము కలవాఁడు, వెలుఁగుచున్న కన్నులవాఁడు, చారణుఁడు కాఁడు, తిలకసింగు పుత్రుఁడు తేజసింగు !" అని దుర్జయుఁడు పలికెను.

౧౭

అర్ధరాత్ర మయ్యెను. అయినను రాజపుత్ర బాల యొకతె యొంటిగా సూర్యమహాల్ పర్వతము మీఁది యుద్యానములో విహరించుచుండెను. ఆరామము ప్రశాంతము. ఒక సారి యామె

నల్లని కన్నులను నీలాకాశము వంకఁ ద్రిప్పుచు, వేఱొకమాఱు మంచులోఁ గొంచెముగాఁ దడిసియున్న పుష్పములం గోయుచు, మృదుస్వరమున గీతికాఖండము పాడుచుండెను.

ఆవెన్నెలలో నాతన్వంగిని జూచుచో నామె మానుషి యని తోఁడదు; ఒకానొక యచ్చర పూఁదోటలోని కవతరించిన దని భ్రాంతి కలుగును. రాజపుత్రబాలకుఁ బదునాల్గు సంవత్స రము లుండును. ఆమెవదనము మిక్కిలి రమ్యము, నేత్రములు తేజోవంతములు శరీరము లావణ్యమయము కుసుమకోమలము. వయస్సు తక్కువగా నున్నను నామె ముఖమున నేదో విచా రము పాదుకొని యున్నట్లు బోధపడును నేత్రములను బరికించి చూచినచో ననిర్వచనీయ మగు దుఃఖము నయనములపై పీఠము వేసికొని యున్నట్లు తెలియగలదు.

వెన్నెల రజతాసారమువలెఁ బర్ణాంతరములనుండి కురియు చుండెను. పుష్పములు తమవత్రావరణములను విడిచిపెట్టి శీతల వాతమున నేదదేరుచున్నవో యనునట్టు లుండెను. హిమమునఁ దడిసిన పూవులను గోయుట యన్న పుష్పకుమారికి చాల సంతసము. కావున సాంద్రచంద్రికోజ్జ్వలమగు నుద్యానమునకు రాత్రివేళ నామె వచ్చియుండెను.

చంద్రకిరణము లామె లలితబాహువుల మీఁదను, వక్షము మీఁదను ముఖముమీఁదను వాలుచుండెను. చల్లని కిరణములు గుత్తులు గుత్తులుగా నున్న కేశములలో నిశ్శబ్దముగాఁ బ్రవే శించుచున్నట్లు, కందోయిని చుంబించుచున్నట్లు నుండెను.

ఆప్రశాంత విభావరిలో దూరమునుండి యాకస్మికముగా వీణాధ్వని వినఁబడెను. ఆలలితస్వరము నిమేషకాలము లోక మును మోహింపఁ జేసి, మెల్లన సాగిపోయెను. తోడనే 'పుష్పా!' అను నామము విననయ్యెను

ఈమధురవాక్కు కర్ణగోచర మగుటయు, పుష్పకుమారి యులికిపడి వెనుదిరిగి చూచెను. మరల గానపురస్సరముగా పుష్పా అని వినఁబడెను.

ఏదిక్కునుండి సంగీతము వినఁబడెనో యాదిక్కు నామె చూచెను. చూడఁగా, చెట్టుక్రింద చారణుఁ డొకఁడు వీణెను సవరించుచు గీతము నుపక్రమింప నుండెను. పుష్పకుమారికి చారణుల గీతము లన్న మిగుల సభిలాష. కాబట్టి యామె వీ లగు నంత సమీపమునకుఁ జని, చెట్టుమాటున నుండి గీతము నాలకింపఁ జొచ్చెను.

రాజపుత్రాంగనలారా, సత్యపరిపాలనమును గూర్చిన కీర్తన నాకర్ణింపుఁడు. వెనుక నొకపర్యాయ మొకరాథోడ్ బాలుఁడు బాలికయును గలిసికొనిరి. చిన్నవానికిఁ బది సంవత్సర ములు, కుమారికే డేండ్లు. ఆ సమావేశమున వారికిఁ బరస్ప రానురాగము జన్మించెను. ఒకరి నొకరు పెండ్లియాడ నెంచిరి.

"పిమ్మట ననేకకష్టములు దాపరించెను. ఆబాలుని తండ్రి యుద్ధమున మరణించెను. అతని దుర్గమును శత్రువు హరించెను. బాలుఁ డేమయ్యెనో యెవ్వరికి దెలియదు. అతఁడు మృతి

నొందెనో ప్రాణములతో నున్నాఁడో యెవ్వరు నెఱుఁగరు. క్రమముగా లోక మతని విస్మరించెను. కాని, యా బాలిక యతనిని మఱచునా? మఱవదు!

చోండావద్వంశ్యుఁ డొకఁ డాబాలికను బెండ్లియాడఁ దలఁచెను. అతఁడు విక్రమశాలి, యశోవంతుఁడు, విపులైశ్వర్య వంతుఁడు. ఆవీరుఁడు బాలికను వివాహమాడ నిశ్చయించు కొనెను. కాని, యతని శౌర్యమును ధనమును గాంచి కన్నియ వెనుకటివరుని విస్మరించునా? అలాగున జరుగదు! రాజపుత్ర స్త్రీ సత్యము నతిక్రమింపదు.

చోండావత్ప్రభువు కుమారిని లోభపెట్టెను కాని యామె "నేను రాథోడునకు వాగ్దానము చేసితిని" అని పలికెను. అతఁ డామెను భయపెట్టెను. ఆమె 'రాథోడునకు వాగ్దానము చేసితిని'' అనెను. అతఁ డామెను బలవంతముగా బెండ్లియాడ నిశ్చయించెను. "చోండావద్వీరునికంటె మరణమే మేలు!" అని యామె నుడివెను. రాజపుత్రకుమారి యాడినమాట తప్ప లేదు—వెనుకటి వరుని మఱవ లేదు

ఆ రాథో డెచ్చట నున్నాఁడు? పర్వతములందు నివసించు చున్నాఁడు, భిక్షావృత్తిచే జీవించుచున్నాఁడు మహారాణా వారి యుద్ధములలోఁ దిరుగుచున్నాఁడు, రాజపుత్రయువతి సత్యమును పరిపాలించునేని యతఁడు తప్పక విజయము గాంచును; రాజపుత్రయువతి యాడినమాట తప్పకుండునేని

రాథోడ్‌వీరుఁడును దన ప్రతిజ్ఞను విడువఁడు. రాజపుత్రాంగన యెన్నటికిని సత్యము తప్పదు!

పుష్పకుమారి యాగీతము నాకర్ణించి భ్రాన్తపడియెను. సంగీతధ్వని వాయుప్రపంచమున లీన మగు నంతవఱకు నామె నిశ్శబ్దయై యుండెను. ఆగీత మామె హృదయ తంతువులను మ్రోయించెను, వృత్తుల నుద్రేకింపఁ జేసెను. అంతట పుష్పకుమారీదేవి చెట్టుమఱుగునుండి యీవలకు వచ్చెను.

చారణుఁ డాలావణ్య మూర్తివంక చూడ్కులు పఱపి, తిరుగ నేలమీఁదకి మరల్చి యిట్లనెను: ఈ రాత్రివేళ నా పలుకులవలన దేవికి విసువు కలిగెనా? అడవులలోఁ దిరుగు చారణునకు శ్రోతలు దొరకరు. దేవికి విసువుగా నున్న పక్షమున చారణుఁడు వనములోనికి మరలిపోయి, నిర్జనప్రదేశమునఁ గూరుచుండి కూనిరాగము లు తీయును."

ఆహా! సంగీతముకంటెను చారణుని నమ్రవాక్యములు హృదయంగమము లయ్యెను. వెన్నెలలో నతని యవయవములం గాంచి పుష్పకుమారి విస్మిత యయ్యెను. అతని యున్నత దేహము జవ్వనపు లావణ్యముచే మిసమిస లాడుచుండెను. దీర్ఘబాహువులయందు హీరాల యుండెను. ఉన్నతవదనముమీఁదఁ జంద్రకిరణములు వాలుచుండెను. చారణుని ముఖము పరిశ్రాంతిచేతనో విషాదముచేతనో కొంచెము వాడియుండెను. అతఁడు క్రిందిచూడ్కులలో నిట్లనెను: "ఆజ్ఞ యయినచో

నడవిలోనికిఁ బోయెదను. దేవి యవధరింపఁ దగిన గీతము చారణుని కెక్కడనుండి వచ్చును ?"

పుష్పకుమారి మౌనము విడిచి, మేలిముసుగు తొలఁగింప కుండనే యస్ఫుటస్వరముతో, "చారణదేవుఁ డీగీతము నెక్కడ నేర్చుకొనెను ?" అని యడిగెను.

"గుహాలయందు, నడవులయందు నివసించువానికడ నేర్చితిని" అని యతఁడు మెల్లగా వచించెను.

"ఆ నివసించువా రెవరు ?"

"పిత్ర్య మయిన దుర్గమును గోల్పోయినవాఁడు, చిన్నతన మునుండియు దిక్కు లేక తిరుగుచున్నాఁడు."

పుష్పకుమారి యుద్వేగము నణచుకొన లేక "చారణదేవా క్షమించవలెను. ఒకసంగతి యడిగెదను. ఆరాథోడ్ వీరుఁడు కుశలమా ?" అని యతనిని బ్రశ్నించెను.

"హల్దిఘాట్ యుద్ధమున రథోడ్ వీరుని ఖడ్గము ప్రకాశించెను మ్లేచ్ఛులు వచ్చినపక్షమున క్రమ్మఱ గనఁబడును" అని చారణుఁడు బదులు పలికెను.

"భగవంతుఁ డాయనకు సుఖము నిచ్చును గాక !" అని పుష్పకుమారి సాశ్రునయనయై వచించెను.

"దేవీ, దిట్టతనమును క్షమింతురేని మ మ్మొకసంగతి యడిగెదను. ఆరాథోడును మీ రెన్నఁడయినఁ జూచియున్నారా? లోక మెవనిని మఱచెనో, యెవఁ డడవులలోఁ బడి తిరుగుచుండునో యట్టివానిని మీ రెప్పు డయిన దలంతురా?"

చారణుని స్వరము చలించెను, కంఠము రుద్ధమై పోయెను. అతికష్టమున నతఁడు క్రమ్మఱ ని ట్లనెను. "నేనుగూడ నడవులలో సంచరించువాఁడను. ఆరాఠోడు నాకు కనఁబడవచ్చును. అందుచేత మిమ్ము నడుగుచున్నాను. ఆయనతో నేమైన చెప్పనది యున్నదా?"

"ఇది మాత్రము చెప్పవలసి యున్నది. రాజపుత్రస్త్రీ యాడినమాట తప్పదు, సత్యము పాలించును."

"అలా గయినచో, రాఠోడ్ దేవిగారికిఁ బరిచితుఁడా?"

"ఆవీరుఁ డీయభాగ్యురాలికి క్రొత్తవాఁడు కాఁడు" అని పుష్పకుమారి కొంచెము లజ్జతో ననెను.

ఉభయులు నిశ్శబ్దముగా నుండిరి. కొంతసేపటికి చారణుఁడు పుష్పకుమారిని జూచి, "దేవీ, నా కీగీతము నేర్పినవాఁడు తేజసింగు గీతములో జెప్పిన వీరాంగన కనబడిన పక్షమున దననువర్ణాంగుళీయము నామె కీయవలె నని యాయన నా కానతి యొసఁగినాఁడు. నేఁడు దేవిగారిని దర్శింపఁ గల్గితిని. చారణుని చొరవను క్షమించి, యాజ్ఞాపించెద రేని యుంగరము ను వ్రేలియందుంచెదను" అని నుడివెను.

పుష్పకుమారి సిగ్గుతో నాతరుణుని విలోకించి వణకుచున్న హస్తము చాపెను. ఆమె తనూలత సయితము వడకుచుండెను.

చారణుఁడు నెమ్మదిగా నాయుంగరము నామె వ్రేలియందుంచి, పూవులను హసించు కోమలత్వము గల యామెకరము

ను దనచేతియందుంచుకొనెను. పుష్పకుమారి కన్నులు మూసి కొనెను. చారణునియూపిరి తనకరమునకుఁ దాకినట్లును, పెద వులు వ్రేళులను స్పృశించినట్లును నామెకుఁ దోఁచెను.

నిజముగా చారణుఁ డిట్టిపని చేసెనా? కాక యామెకల్పన మాత్రమేనా? ఆమె యతనిని మఱల వీక్షించెను. ఆ ముఖము ఆనేత్రములును గనఁబడెను. ఈమత్ర్పయత్నక పూర్వముగా నామె తనచేయి లాగుకొనెను. క్షణకాల మామెవదనము రక్తిమా రంజిత మయ్యెను.

హృదయమును శాంతపఱచుకొని పుష్పకుమారి యిట్లనెను "చారణదేవా, ఆవీరపురుషునకుఁ బ్రతిదానము చేయుద మన్న నాయొద్ద నెట్టియలంకారము లేదు. కాని, యాయనగారు మీకుఁ గనఁబడినయెడల ఈపుష్పము వారి కీయవలెను."

౧౮

యామిని గతప్రాయ మయ్యెను. అట్టియెడ తేజసింగు సూర్య మహాల్ పర్వతమునుండి దిగి, చారణవేషమును విసర్జించి, భీమచాంద్ నివాస సమీపమునందలి జలాశయమునఁ బ్రాత స్స్నానము చేయఁ జనుచుండెను. హ్రదతటము కడ కేగునప్ప టికి భిల్లభామలో గీత మాతనికి వినఁబడెను. ఇట్టివేళ నిట్టిప్రదేశ మున సంగీతము పాడువా రెవ్వరు? ఉత్సుకుఁడై తేజసింగు

సమీపమున నున్న చెట్లగుంపులోనికి బోయి చూడగా నె త్తయిన రాలగుట్టమీద నిలిచి యుండి, పూవులు గోయుచు గానము చేయుచున్న బాలిక యతని కగపడెను. ఆమె భీమ చాంద్ పుత్రిక.

తేజసిం గొక్కింతుక నిలువబడి "అమ్మాయీ" అని కేక వైచెను.

బాలిక యతనివంకఁ జూచి, "నీ కోసమ డవి పూవులు కోయుచున్నాను" అని పలికి నవ్వెను.

"ఇ దేమి పిల్లా! రాత్రి ఒంటరిగా ఇచ్చట పూవు లేల కోయుచున్నావు? ఇంటికిఁ బొమ్ము."

"నీకు పువ్వు మన్న ప్రేమ కదా! కాబట్టి, నీకొఱకు పువ్వ ములు కోయుచున్నాను" అని వచించి బాలిక కిలకిలనవ్వెను.

తేజసింగు బొమలు ముడివడెను; అతని కేమియుఁ దెలిసినది కాదు.

"ఈ దండ తీసికొనవా?" అని నగుచు భిల్లకుమారి పలికెను.

"తీసికొన కేమి? ఇమ్ము."

"నేనే మెడలో వైచెదను."

"కానిమ్ము!"

"అ దేమి నీ వక్షమున?"

"పుస్సము."

"తీసి పాఱవేయుము!"

"ఎందు చేత ?"

"అది యుద్యాన కుసుమము."

"అయిన నేమి? నేను పాఱవేయను."

"అలాగైన, ఈదండ నీమెడలో వేయను."

"కారణము?"

"దండికు పుష్పమునకు సఖ్యము లేదు.

తేజసింగు వింతగొంతుతో "ఏ మది ?" అనెను.

"ఉద్యానపుష్పములు గొప్పవి, వనకుసుమములు చిన్నవి. అడవిపూదండ మెడలోఁ గనఁబడినయెడల నుద్యాన పుష్పము నకుఁ గోపము వచ్చును."

భిల్లబాలిక యభిప్రాయ మతనికిఁ దెలియ లేదు. అంత నతఁడు "పుష్పమునకు—కోపము—వచ్చునా!" యనెను.

"రాదా ? రానియెడల నాపుష్పమును విడుచుటకు భయ పడుచున్నా వేమి ?

తేజసింగు మాట లాడ లేదు.

"రాత్రివేళ నెక్కడకుఁ బోవుచున్నావు?" అని బాలిక యతనిని బ్రశ్నించెను.

"నీ కెందుకు ?"

"త్రోవలో దొంగభయ మున్నది."

"నా కేమి భయము!"

"నీ దేమియును బోలేదా ?"

"లేదు."

బాలిక తేజసింగు నాపాదమస్తకము పరీక్షించి "నీ వ్రేలి యుంగర మే మయినది ? అని యడిగెను.

ఈపర్యాయము తేజసింగు విస్మితుఁడై తనలో "ఈ భిల్ల బాలిక సమస్తము నెఱుఁగునా ? నావెంట రహస్యముగా వచ్చి, యుంగరము నామె కిచ్చుట చూచెనా ? అది యసంభావ్యము!" అని తలఁచెను.

తేజసింగు చింతామగ్నుఁడై యుండుట విలోకించి, భిల్ల బాలిక వికావిక నగుచు "ఒకవస్తువు పోలేదా ?" అని యడిగెను.

"లేదు, దాని నెక్కడనో పెట్టియుందును."

"నేను వెదకి చూతునా?"

"వెదకవచ్చును.

"దొరకినయెడల నది నాదేనా ?"

"ఊ !"

బాలిక కరతాళము వేయుచు, "ఈ దండ తీసికొనివా ? అని తేజసింగును బ్రశ్నించెను.

"తీసికొనను. నీ వింటికి పోరాదా ?"

"నేను పోను."

"ఎందుచేత ?"

ఈచంద్రునిఁ జూడ సంగీతము పాడ మనసు పుట్టుచున్నది.

తేజసింగు స్నానముచేసి వెడలిపోయెను. పోవుచుండగా నతనికి వెనుకనుండి యీబాలిక సంగీతము వినఁబడెను.

కనులకు విం దొనర్చుచు సుగంధము లీనెడి తోటపూలపై
మనసును నిల్పఁగాని యణుమాత్రము వన్నెము లొ సుమంబులం
గనుఁగొనఁ బోదు బంభరము; గంధవిహీనము లౌటచేతఁ గా
ననమున వాడిపోయి యవి నాశము నొందుఁ గ్రమక్రమంబుగన్!

౧౯

శ్రావణమాస ప్రారంభమున హాల్దీఘాట్ యుద్ధము నందు స్వదేశసంరక్షణార్థము పదునాల్గువేల రాజపుత్రులు ప్రాణములను విడిచి ఆసంవత్సరము వర్షములు కురియుటచేత మొగలు లేమియుఁ జేయఁ జాలక, విధి లేక మేవాడ్ దేశమును విడిచి పోయిరి. ప్రతాపసింగు కొన్ని మాసములు విశ్రాంతి ననుభవించెను.

మాఘమాసమున గొప్ప శత్రుసైన్యము క్రమ్మఱ నేతెంచెను. వీరశ్రేష్ఠుఁడు ప్రతాపుఁడు రిపుబలములతోఁ బెనఁగెను. కాని యపార మగు మొగల్ వాహినితో యుద్ధము చేసి గెలు పొందు టెట్లు? ప్రతాపుఁడు పరాజితుఁడై యుద్ధక్షేత్రము విడిచిపోయెను.

మొగల్ సేనాని యగు షాహబాజ్ ఖాన్ కుమల్మేర్ దుర్గమును బరివేష్టించెను. మేవాడ్ నుండి వాయవ్యదిక్కుగా మార్వాడ్ దేశమునకుఁ బోవుత్రోవల కడ్డముగా నుండు పర్వతముపై నీదుర్గము నిర్మింపఁబడినది. ఎత్తైన కొండల మీఁదుగా వంకరటింకర మార్గము కలదు. ప్రస్తుతము మార్వాడు శత్రుహ స్తములం దుండుటచేతను, వా రాదిక్కునుండియే మేవాడ్ రాజ్యము నాక్రమింప వనసియుండుట చేతను వారి మార్గమును నిరోధించుటకై ప్రతాపసింగు దుర్గమును రాజధానిగా నుంచుకొనెను. సాధ్య మగునంత వఱకు నీ దుర్గమును రక్షించి, తుదకు పానీయము దుర్లభ మగుటంబట్టియు, సైనికులు రోగపీడితు లగుటం జేసియు, విధి లేక కుమల్మీరును మేనమామ కప్పగించి, ప్రతాపుఁడు వేఱొక దుర్గమునకుఁ జనెను. అతని మాతులుఁడు బిజలీ ప్రమర కువాధిపతి యుద్ధ ప్రారంభమున మహారాణాయెదుటఁ జేసిన ప్రతిజ్ఞను నెఱవేర్చెను. భ్రమరవంశము సానందముగాఁ బ్రాణములు విడిచెరు: కుమల్మీర్ శత్రువుల చేఁ జిక్కెను.

ప్రతాపుఁడు మేవాడ్ దేశపు టాగ్నేయదిశను చావండ్ ప్రదేశమునఁ బ్రవేశించెను. ఆప్రదేశము దుర్గమము, దుర్భేద్యము నయినది. కేవల మాటవికు లగు భిల్లు లందు నివసింతురు. ఈ విపత్సమయమున భిల్లులు రాజపుత్రులకు మిత్రులైరి. ప్రతాపుఁడు చావండ్ దుర్గమున భిల్ల రాజపుత్ర సైన్యములతో నిలిచియుండెను.

ఈవంక శత్రువు లూరకుండ లేదు. మానసింగు ధర్మేతీ, గోగొండదుర్గములను బరివేష్టించెను. మహబత్ ఖాన్ ఉదే పూరును స్వాధీన పఱచుకొనెను. ఫరీద్ ఖాన్ చావంద్ దుర్గ మునకు పయనము చేయసాగెను. ఇవ్విధమున నపారవాహి నులు నల్వంకలం దన్ను ముట్టడించుచున్నను ప్రతాపసింగు ధైర్యమును, పూనికను విడువ లేదు. ఎన్నిదినములవఱకు మేవాడ్ దేశమునం దొకదుర్గ మైనను దన స్వాధీనమునం దుండునో యన్నిదినముల వఱకు నామహాయోధ భిల్లులతో నివసించుచు, సిసోదీయనామమును నిలుపుకొన నిశ్చయిం చెను. కొండలయందు రాజపుత్రసైన్యము దాగి యుండును. నిశీధమందు పర్వతశిఖరమున దీపకాంతి కాన్పించినచో ప్రతా పుని సైనికులు దానియర్థ మెఱుఁగుదురు. ఇవ్విధమున సిద సైనికులను జేరఁదీయుచు నాకస్మికముగాఁ నతఁడు శత్రువు లపైఁ బడుచుండును. అతఁడు దూరముగాఁ బాఱిపోయె నని కాని, యెచ్చటనో దాగి యుండె నని కాని తలంచి, శత్రువులు నిశ్చింతులై యున్నప్పుడు ప్రతాపుఁడు భటుల నాకస్మికముగాఁ గొడ్కొని వచ్చి వైరులను బరిమార్చుచుండును. చితోడ్ గడ్ పోయినది, అదేపూర్ పోయినది. కుమల్మీర్ పోయినది. పర్వతదుర్గము లెల్ల నొక్కటొక్కటిగా శత్రు స్వాధీన మగు చుండెను ఆమహావీరుఁ డెంతమాత్రము భయపడక స్వదేశ స్వాతంత్ర్యసంరక్షణ తత్పరుఁడై యుండెను.

చావండ్ దుర్గమును జయించ ఫరీద్ ఖాన్ గొప్పబలముతోఁ జనుచుండెను. పర్వతప్రదేశమును జయించి ముసల్మాన్ మహోల్లాసముతో ప్రతాపునిఁ జెఱఁబెట్టఁ దలచెను. ఆకస్మికముగా ప్రతాపుని యానతి రహస్యముగా నల్దిక్కుల వ్యాపించిన తోడనే ఫరీద్ ఖానుకు రాజపుత్రబలము నల్గడల దృగ్గోచరమయ్యెను. పాపము! ఆగభీర పర్వత గుహాలనుండి ఖాను గాని వానిభటులలో నొక్కఁడైనఁ గాని స్వదేశమునకు మరలిపో లేదు!

కాదంబినివోలె సన్నివైపుల విపత్సముదయము రాశీభూతమయినకొలంది భవిష్యదాకాశము తిమిరాచ్ఛాదిత మయిన కొలంది, అర్థసైన్యదుర్గములు తగ్గఁ జొచ్చినకొలంది ప్రతాపుని సాహసము దైనందినాభివృద్ధి నొందఁ సాగెను. సమగ్రభువనంబునకు విరుద్ధముగా నిలిచి, ఖడ్గహస్తుఁడై ప్రతాపసింహుఁడొక్కఁడే యాపర్వతభూమిని రక్షించును, ప్రతిశిలాఖండము మీఁద నాత్మీయ పరాక్రమ వృత్తాంతమును లిఖించును!

భవిష్యద్గగన మింకను మేఘచ్ఛన్నము నంధకార బంధురముకా సాగెను. ఆ తిమిరమధ్యమున ప్రతాపుని మహాసాహసము విద్యుల్లతాద్యుతివోలెఁ బ్రకాశింపఁ జొచ్చెను, ఆగ్రాద్వార పర్యంత మాతటిత్ప్రభ నేత్రగోచరం బయ్యెను. లోకాలోకము దనుక నాదీప్తి మెఱయుచుండెను.

క్రమ్మఱఁ బ్రావృట్కాల మేతెంచెను. రాజా మానసింగును మొగలులును విఫలమనోరథులై యాసంవత్సరము గూడ మేవాడ్ రాష్ట్రమును విడిచి పోయిరి.

౨౦

తిరుగ వసంతసమయ మేతెంచెను. వసంతకాలముతోనే వఱద వోలె రిపుబలము లేగుదెంచెను. కాని, ప్రతాపసింగు శిశోదీయ గౌరవమును నిలుపు కొనును, స్వదేశమును రక్షించును.

క్రమ్మఱ పగతురు కొండలు నిండి, యొక్కటొక్కటిగా దుర్గములను జయించుచు, నల్పసంఖ్య గలిగియు నిర్భీకు లగు రాజపుత్రులను గుహాలనుండి వెడలఁగొట్ట సాగిరి. ఆవిధముముగా నావత్సరము గడచెను. క్రొత్తసంవత్సరము వచ్చెను. ఆనూత్న హాయనము కూడ నతీత మయ్యెను. మరల నొక యుద్ధ మరుదెంచెను. యుద్ధముల కంతము లేకుండెను. మేవాడ్ రాజ్యమునకు విజయము కలుగ లేదు.

డిల్లీనుండి నూతనసైన్యము వచ్చెను. ప్రతిసంవత్సరము గొప్పగొప్పబలములు మేవాడును ముట్టడించు చుండెను. చక్రవర్తియానతిచొప్పున ప్రసిద్ధసేనానులు సుశిక్షిత సైన్యతరంగములతో మేవాడ్ దేశమును ముంచి వేయు చుండిరి. మహావీరుఁడు ప్రతాపసింగధైర్య పడ లేదు, మేవాడ్ లక్ష్మికి విజయము కలుగ లేదు.

ప్రతాపుఁడు, మహారాజ్ఞయు, రాజకుమారులును గొండ గుహాలలో నివసించు చుండిరి. శత్రువుల యాగమనవార్త చెవి సోకినంతనే వారు భోజనము విడిచి పాఱిపోవుచుండిరి. కొన్ని సమయములందు భిల్లులచే రక్షింపఁబడుచు, మఱికొన్ని

వేళల వన్యమృగముల యావాసములందుఁ దల దాచుకొనుచు, రాజకుటుంబము చెప్ప రానికష్టముల నొందుచుండెను. షడృతు వులును వారలకు సమానముగా నుండెను.

ఎన్నికష్టములు దాపరించినను మనస్థైర్యము వీడక శత్రువు లకు లోఁబడక, కాలక్షేపము చేయుచున్న మహారాణాను హిందువులు ముసల్మానులు ప్రశంసింపఁ జొచ్చిరి. వైరులే యతనిని బొగడిరి. అక్బరు షాహ ప్రతాపుని విక్రమము నాకర్ణించి విస్మితుఁ డయ్యెను. అతని సభ్యు లెల్లరు నచ్చెరు వొందిరి. మణి మాణిక్యవిభూషితోన్నత సింహాసనమునుండి గర్వాంధ నివాసియు, దరిద్రుఁడు నగు రాణాను గూర్చి ప్రశంసా వాక్యములు వెలువడఁ జొచ్చెను. సమగ్ర హిందూదేశము జయజయ ధ్వనులు కావించెను.

ప్రతాపసింహుని పేరు విన్నచోఁ బ్రాచీన భారతవీరులు జ్ఞప్తికి వత్తురు. ప్రతాపుఁడు సప్తరథులతో యుద్ధము చేయ లేదు; కాని సప్తకోటి జనాధీశ్వరుం డగు బాదుషాహాతో యుద్ధము చేసెను. అతఁ డొకనాఁటి యుద్ధము చేయ లేదు, ఇరువదియైదు సంవత్సరములకాలము యుద్ధము చేసెను. తరువాత ప్రాణములు విడిచెను. గాని స్వాతంత్ర్యమును విడువ లేదు!

ప్రతాపుని శత్రు వగు చక్రవర్తి ప్రధానసభ్యులలో నొకఁడు ఖాన్ ఖానన్ మహాకవి మహారాణా పరాక్రమమునకు విస్మయ

మొంది, ఫారసీభాషలో నీ పద్యములు రచించి, యతనికిఁ బంపెను.

జగతి వస్తువు లెల్ల నశాశ్వతములు:
భూములును సంపదలు మాసిపోవు చుండు,
మాయు నెన్నటికిని మహామహుల కీర్తి !
వైభవంబును రాజ్యము న్వదలెఁ గాని
తలను వాంచగ లేదు ప్రతాప సింగు !
భరతఖండము నందలి ప్రభువులందు
పత్తొకండె స్వధర్మంబుఁ బట్టు విడక
నెఱపినట్టి మహాత్ముఁడు నిశ్చయముగ !

౨౧

ఒకనాటిరాత్రి రెండుజాములవేళ వనముగుండ గొండఱు భిల్లులు మిగుల జాగరూకతతో నవారి మోసికొని పోవుచుండిరి. అది చీకటిరాత్రి. ఆకసమున నక్షత్రములు కనఁబడుట లేదు. ఒకరి కొకరు కనఁబడుట లేదు. విపినాచ్ఛాదిత మగు పర్వత మార్గమున నట్టివేళ భిల్లులు తప్ప మఱెవ్వరును బయనము చేయలేరు. కాళ్ళచప్పుడు కాకుండ మిగుల నిశ్శబ్దముగా వారలు శిబికను భీమచాంద్ పక్కణములో చేర్చి భిల్లు లెచ్చటికో వెడలిపోయిరి.

ఆమేనా విడిచిన ప్రదేశము గుహ. ఆపల్యంకికయందు పుష్పకుమారి యుండెను. యుద్ధములకు విరామము లేకుండుటచే సూర్యమహల్ రాణివాసమునకుఁ గూడ నిలువ నీడ లేకుండెను. కావున దుర్జయసింగు పరివారము వేఱొకదుర్గమున నివసించుచుండెను. ఒకయోధుని యాజ్ఞానుసారముగా నిప్పుడు పుష్పకుమారీదేవి నీగుహకుఁ దీసికొని వచ్చిరి.

గుహలో దీపము వెలుఁగుచుండెను. ఆదివ్యవెలుతురులో పుష్పకుమారికి వింత దోచునట్లు తత్ప్రదేశమున రాజపుత్రాంగన యాసీన యయి యుండెను. ఆరమణి దీర్ఘశరీర. ఆమె ముఖము మీఁదుగా వజ్రఖండము ప్రకాశించుచుండెను. కంఠమున ముక్తాహారము వ్రేలాడుచుండెను. ఆమె నేత్రములనుండి నిర్మల తేజఃపుంజము వెడలుచుండెను. చూచినతోడనే యామె మహావంశ సంభూత యని తోఁచక మానదు. మనఃక్లేశముల చేతనో మఱెందుచేతనో యామె సుందరవదన మండలము కొంచెము వాడియుండెను. ఆరమణికి నలువది యేండ్లుండును.

సూర్యమహల్ దుర్గమును విడిచిన దాదిగా పుష్పకుమారి స్త్రీముఖమును జూచి కాని, స్త్రీలతో మాటలాడిగాని యెఱుఁగదు. భిల్లులగుహలోఁ బ్రవేశించి యామె భీతయయ్యెను. దీపికాకాంతియందు రమణి కనబడినతోడనే పుష్పకుమారికి ధైర్యము కలిగెను. పుష్పకుమారి నూతన స్త్రీ చెంత కరిగి "అమ్మా, నే నెక్కడకు వచ్చితినో తెలియకున్నది! ఎదుట

నున్న వా రెవరో యెఱుఁగను తమరు గొప్పవంశమున జన్మిం చినా రనియు, నీయుద్ధకాలమున విపత్తులోఁ జిక్కి యీగుహ నాశ్రయించిన వా రనియు, నాయెడ దయఁ దలచి నన్నీసురక్షిత ప్రదేశమునకుఁ దెప్పించితిరనియుఁ దోఁచుచున్నది. తా మెవరయి నను నేను మిమ్ము శరణుజొచ్చితిని. పుష్పకుమారికి దిక్కు లేదు” అని పలికెను.

పుష్పకుమారి దీనస్వరమును విని, సజలనేత్రములను జూచి, యా నూతనస్త్రీ వాత్సల్యముతో నామెచేయి పట్టుకొని, బహువిధముల నూరడించి యిట్లనెను:

“అమ్మా, పుష్పా, ఇప్పుడు నీ వేయవస్థలో నున్నావో నేను నయిత మట్టి యవస్థలో నున్నాను. ఇది భిల్లులగుహ! విపత్కాలమున వీరలు మన కాశ్రయ మొసఁగినారు. ఒక రాజపుత్రయోధ యిచ్చట నివసించు చున్నాఁడు. అతఁడు గూడ మనలను సంరక్షించును. శత్రువులచేతులలోఁ బడకుండ కొన్ని దినములక్రిందట నీప్రదేశమునకు నన్నుఁ గొనివచ్చినవాఁ డతఁడే. నిన్ను నతడే యిచ్చటికిఁ దెప్పించినాఁడు. నీ కిష్ట మయినయెడల మాదగ్గఱ నుండుము. నాకొడుకులు కొమార్తె లును క్షేమముగా నుందురేని నీకును క్షేమమే. ఇంతకంటె నెక్కువగా నిన్నూఱడింపలేను.”

ఇట్టి దయారసపరిపూర్ణవాక్యములను పుష్పకుమారి చాల రోజులనుండి విన లేదు. బహుదినముల తరువాత నీలాటి

పలుకుల నాలకించుటచే నామె హృదయ ముప్పొంగెను. సంతోషవశమున నామె కనులనుండి బాష్పములు రాలెను.

ఆక్రొత్తకాంత దయావ్యంజక స్వరముతో "అమ్మా, పుష్పా, శాంతి నొందుము. మావారు మేవాడ్ దేశమునకుఁ గ్రొత్తవారు కారు. యుద్ధములు ముగిసినవెనుక వారు నీకు మేలు చేయఁగలరు" అని వచించెను.

౨౨

ఇయ్యవసరమున 'నాహారామగ్రో' యందలి చారణీదేవి యా గుహలోఁ బ్రవేశించెను.

చారణీదేవి నిసర్గగంభీర స్వరముతో నూతనరమణిం గూర్చి "దేవీ, అంధకారమయ మగు భీమచాంద్ గుహ పవిత్రము తేజోవంతము నయ్యె నని తెలిసికొని, యా తేజస్సును సందర్శింప వచ్చితిని. మేలిముసుఁగు దొలగింపుము. దేవీ, చారణి యెదుట నవకుంఠనముతోఁ బనిలేదు" అని నుడివెను. అప్పుడు మహారాజ్ఞి మేలిముసుఁగు తొలగించెను. తోడనే చీకటిగుహ యామె వజ్రకాంతులచే దేదీప్యమాన మయ్యెను. అంతట నామె చారణితో సంభాషింప దొరకొనెను

"చారణీమాతా, మిమ్ముఁ జూచుటచే స్వస్థచిత్త నైతిని. విపత్కాలమున మీరే మాకు చుక్కానివంటివారు. ఆపదలు

మహారాణావారికిఁ గ్రొత్తలు కావు. అయినను, నిప్పటి కష్టములవంటి కష్టము లిదివఱ కెన్నఁడును మేవాడ్ దేశమునకు దాపరించ లేదు. బహుదినముల నుండియు మహారాణా వారికంటఁ బడు భాగ్యము కలుగుట లేదు! నిరంతర యుద్ధమగ్నులై యుండుటచేత వారికి భార్యాపుత్రులను జూచుటకయిన నవకాశము దొరకుట లేదు. ఇక్కడనుండి యక్కడకును, అక్కడనుండి యిక్కడకును దిరిగి తిరిగి, తుదకీ గుహలోఁ బ్రవేశించి నాము. ఇప్పటికిని మాకష్టములు గొట్టిక్క లేదు. తుర్కీవాండ్రు మాసంగతి సందర్భములను విచారించి, యీవంకకే వచ్చుచున్నట్లు తెలియుచున్నది. నేఁడు మహారాణావారికి తుర్కీవాంగ్రకును జరుగుచున్న యుద్ధమింకను ముగియ లేదు. తురుష్కుల సింహానాదములు వినవచ్చుచున్నవి. నాహృదయము చింతాకుల మయినది. చారణీ మాతా! మహారాణావారి కుశలవార్త నా కెఱిగించి విచారము తొలఁగింప వలెను.”

“మహారాజ్ఞీ, స్వస్థచిత్త వగుము ఏకలింగజీ స్వాయముగా మహారాణావారిని రక్షించును వారికిఁ గుశలమే!”

“మాతా, మీమాటలచే నూరటఁ జెందితిని. మీనోట పుష్పచందనములు పడును గాక! మేవాడ్ మహారాజ్ఞి తన కాపద యన్నను భీతి జెందదు. శత్రువులను నరకు గానక, శిశోదీయధర్మాను సారముగా బ్రాణములు విసర్జించి, గౌర

వము రక్షించుకొనఁ జాలును. కాని, రాణావారిని గూర్చియు రాజకుటుంబమును గుఱించియును నాచింత. రాజసంతానము నిరాపదముగాఁ దల దాచుకొనుట మేవాడ్ భూమియందు తావు లేదు. రాజశిశువులు తుర్కవాండ్ర చేతులలోఁ బడుదురా ? మేవాడ్ చరిత్ర నేటితోనే తుదముట్టునా ?”

శిశువుల కాపద కలుగు నేమో యని మహారాజ్ఞి వీరహృదయము నయితము కరిగి పోయెను. ఉజ్జ్వలనయన ద్వయము బాష్పపూర్ణ మయ్యెను. వృద్ధకుమారి తన దుఃఖమును మఱచి రాణి కష్టములకు తానుగూడ జాలి నొంది కన్నీరు విడిచెను.

చారణీదేవి యిట్లనెను: “సిసోదియావంశ మున్నన్నినాళ్ళును మేవాడ్ చరిత్రకు లోపము లేదు. మహారాజ్ఞీ, శాంతింపుము. రాజకుటుంబము నిరాపదముగా నుండుట కిప్పటికిని తావు కలదు. భిల్లులు రాజపుత్రులయెడ విశ్వాసము కలవారు మహారాణా ఉదేసింగునకు భీమచాఁద్ తండ్రి యీగుహాలోఁ జోటిచ్చినాఁడు: ప్రతాపసింగు మహారాణావారి కుటుంబమునకు భీమచాంద్ ఆశ్రయ మొసఁగును. దేవీ, చింత నొంద వలదు. ఇచ్చటి కనతిదూరమున జావరా గనులు గలవు. అచ్చట సూర్యరశ్మి యనుమాటయే లేదు. మీ రచ్చోటఁ గుశలముగా నుండవచ్చును. నేటి యుద్ధమిక ముగియును.”

"అమ్మా, మీవాక్యములచే నావిచారము దూర మగు చున్నది. ఎట్టికష్టములు కలిగినను రాజపుత్ర హృదయములు సంచలింపవు. కాని, యనేక సంవత్సరముల వృత్తాంతములు జ్ఞప్తికి వచ్చుటచేత స్త్రీహృదయ మొకసారి కలతనొందినది. సంతానము కుశలముగా నుండుపక్షమున యుద్ధము యుగముల కొలంది జరుగుచున్నను మాకు భయము లేదు. గుహాలే మాకు ప్రాసాదతుల్యములు!" అని మహారాజ్ఞి పలికెను.

"ఇచ్చట రాజకుటుంబమున కపాయము కలుగదు; ఇక్కడ నివసించు రాజపుత్రయోధ మహారాణావారి కార్యమున శరీరము నయినను విడుచువాఁడు"

"ఆరాఠోడ్ వీరుఁడే మమ్ము భీమగడ్ దుర్గమున రక్షించి, యిచ్చటికిఁ దీసికొని వచ్చినాఁడు. ఈతని చరిత్ర తెలిసికొన వలసియున్నది. ఎందు కీతరుణుఁడు భిల్లులతో నీప్రదేశమున నివసించుచున్నాఁడో, యేవ్రతము పూని సాధింపనున్నాఁడో తెలిసికొన మనసు వేడము చున్నది. ఈమానసంకటావస్థలో నితనింగూర్చి ప్రశ్నించుట కే వీలు చిక్క కున్నది. ఇతఁడును తనచరిత్రను మాకెఱిఁగింపఁ గోరిక లేనట్లు కనఁబడుచున్నాఁడు. మాకష్టములు గట్టెక్కిన పక్షమున మావిపద్బాంధవుని మఱచి పోము; మహారాణావారు సయితము విస్మృతి నొందరు."

మహారాజ్ఞి యీ రాఠోడ్ వీరునివిషయమే చెప్పుచుండెనా? ఆయోధ దుర్గము కోల్పోయిన దాదిగా నీభయంకర గుహ యందు భిల్లులతో నివసించుచుండెనా?

"మహారాజ్ఞీ, ఆవీరుని వృత్తాంతము మిక్కిలి పెద్దది; మీ కాచరిత్ర యొకనాడు చెప్పెదను. భిల్లుల రక్షణలో నున్న తేజసింగుకంటె విక్రమశాలిగాని విశ్వాస పాత్రుడు కాని మహారాణావారి యనుచరులలోఁ గానఁబడఁడు. తేజసింహుని నాడులయందు రక్తము ప్రవహించుచున్నంతకాలము మీపై నీగ వాలదు" అని చారణి పలికెను.

పుష్పకుమారి శరీరము కంటకిత మయ్యెను, హృదయ మానందముచే తాండవ మాడెను.

"ఆకసమందలి దేవతలు తేజసింగును రక్షింతురు గాక! చారణీమాతా, అతనిస్వామిభక్తికిఁ దగినబహుమానము నీయఁ గల్గుదునా?" అని రాణి నుడివెను.

పుష్పకుమారి మానసము క్రమ్మఱ సోద్వేగ మాయెను. ఊపిరి విడువకుండ నామె చారణీదేవి వాక్కులకొఱకు వేచి యుండెను.

"దేవీ, తేజసింహునకు వాగ్దానముఁ జేసిననిశ్చయముమీచరణ సన్నిధియం దున్నది పుష్పకుమారిని సంరక్షింపుఁడు, ఈమె విశ్వాస సౌభాగ్యరాలు, పుష్పా, మేలిముసుఁగు తీయుము. చారణిదగ్గఱ మోము దాచుట యనావశ్యము. ఏయమ్మ సిసోదియ కులైకపూజ్య, యేయమ మేవాడ్ దేశమునకు శరణ్య, యట్టి యీ మహారాజ్ఞిని శరణు వేడుము అని చారణి విజ్ఞాపించెను.

ఆశ్చర్య లజ్జా ప్రమోద విహ్వలయయి, కన్నులవెంట బాష్పములు రాలుచుండ పుష్పకుమారి మహారాజ్ఞి పాదములపై వ్రాలెను ఆమెకు వాక్యస్ఫూర్తి లేకపోయెను. అంతట రాణి పుష్పను లేవనెత్తి, "అమ్మా, యిదివఱకే వాగ్దానము చేసియుంటిని గాదా, 'నీవు నాపుత్రికవు. నేను నీతల్లిని' అని మిగిలిన నానంతానము సురక్షితముగా నుండువక్షమున నీవుగూడఁ గుశలముగా నుందువు. మేవాడ్ రాణి ప్రస్తుతమింతకంటె నెక్కువగా నేమియుఁ జెప్పఁ జాలదు" అనెను.

అటుపిమ్మట మహారాజ్ఞి చారణీదేవిని యుద్ధమునుగురించి ప్రశ్నించెను. చారణి యిట్లనెను.

"మహారాజ్ఞీ, చింతింప వలదు. మేవాడ్ దేశాకాశము నిర్మేఘ మగుచున్నది. పరాక్రమముచేతను బట్టుదలచేతను విజయము తప్పక సిద్ధించును."

"ఏవిధముగా జయము కలుగునో గ్రహించితివా?"

"రాణావారిబలము శస్త్రమునందు మంత్రము నందును గలదు. శస్త్రసాధ్య మగు వ్యాపారమును మహారాణావారు చేయుచున్నారు. ఇఁక మంత్రిభామా షాహి పని చేయవలసి యున్నారు. మంత్రిగారి స్వామిభక్తిచే మేవాడ్ దేశమునకు విజయము కలుగును."

"అమ్మా, నీవాక్యములచే నాహృదయము శాంతి నొందినది. మఱియొక మాట—"

"మహారాజ్ఞి గారి యానతి శిరోధార్యము. ఆజ్ఞాపింపుఁడు"

"రాజపుత్రులు పూర్వ మార్యావర్తమునంతను శాసించిరని మీ ముఖతః వినియున్నాను. చవ్హాణ్ పృథివి రాజు సార్వభౌముఁడై యుండెను. రాణా సంగ్రామసిం గేకచ్ఛత్రాధిపత్యము కొఱకు మహాప్రయత్నములు చేసి యేఁబది సంవత్సరములు దాటినవి. ఇఁక మే మెన్నటికయిన హిందూదేశమును శాసింపఁగలమా? హిందూస్థాన భవిష్యద్దశ యెట్లున్నది? విజయము తుర్కీవాండ్రకా? శిశోదీయులకా?"

చారణీదేవి చాలసేపు యోజించెను. ఆమె ముఖము ఛాయాక్రాంత మయ్యెను, బొమలు ముడివడెను. తుదకామె మీఁది చూపులతోను, నిసర్గగంభీర స్వరముతోను నీలాగు "మహారాజ్ఞీ, నేను పెద్దదానను. దృష్టి మందగించినది, భవిష్యదాకాశమున దూరముగాఁ జూపు ప్రసరించుట లేదు. దేవీ, చీకటి! కటికి చీకటి!" అని చెప్పెను.

## ౨౩

మహారాణా ప్రతాపసింగు పడరాని యిడుములఁ బడుచుఁ బ్రతి సంవత్సరము యుద్ధములు చేయుచుండ దుర్గములు క్రమక్రమముగా స్వాధీనము తప్పిపోవఁ జొచ్చెను. తుదఁ గతఁడు తన కుటుంబమును సూర్యమహాల్ దుర్గమునకుఁ బంపెను.

ఏలాగుననో యీవృత్తాంతము గ్రహించి శత్రువులు సూర్య్య మహాల్పయి వచ్చి పడిరి. దేశమందలి ప్రముఖు లగుయోధులు మహారాణా వెంట నుండిరి. ఎవరో కొందఱు మాత్రము దుర్గమును రక్షింప సమకట్టిరి.

తేజసింగు సూర్య్యమహాలునందే యుండెను. విపత్సమయ ములందు రాజపుత్రులు మైత్రితో వర్తింతురు కావున దుర్జయ సింగు తేజసింగును నతని సైనికులను దనదుర్గములోఁ బ్రవే శింపనిచ్చెను. తేజసింగు విశ్వాసఘాతుకుఁడు కానేరఁ డని దుర్జయసింగు నమ్మకము. తేజసింగు శత్రుమధ్యమున నిస్సం దేహముగా నివసింపఁ జొచ్చెను. దుర్జయసింగు వీలు చిక్కి నని తన్ను వధింపఁ డనియు, దాను వచ్చినపని దేశము కొఱ కగుటచే మోసము జరుగదనియు నతఁడు భావించెను.

తేజసింగు దుర్జయసింగును సమాన పౌరుషశాలురు. ఉభ యులు నొకే ప్రదేశమునం దుండుటచే వా రొకరి నొకరు మించయత్నించుచుండిరి ఎచ్చట నపాయము కలుగవచ్చునో, శత్రువుల సంఖ్య యెక్కడ మిక్కుటముగా నుండునో యక్క డకుఁ బోయి చేరవలె నని వారు ప్రయత్నించుచుందురు. చోఁడావతు తక్కువవాఁడు కాఁడు, రాథోడ్ వానికిఁ దీసి పోవఁడు. కాబట్టి యొకరికంటె నొకరు ముందడుగు వేయ శ్రమ పడుచుందురు. ఒకరాత్రి శత్రువులు దుర్గద్వారము నొక దానిని విడనెట్టి, యామార్గమున కోటలోఁ బ్రవేశింప నుపక్ర

కించిరి. దుర్గము సందలివారలీ యాపదను గాంచి భ్రాన్పడి యుండగా తేజసింగు సింహనాదము చేసి, కొద్దిసేనతో వైరుల నడ్డగించెను. పిదప రిపుబలమును జెందఱ వందఱ చేసి, కోట వెలుపలికి వెడలఁ గొట్టి, ద్వారము మూసినతరువాత ససైన్య ముగా గోడ దుమికి దుర్గములోఁ బ్రవేశించెను. ఈయసా మాన్య సాహసమునకు దుర్గవాసులు జయధ్వనులు చేసిరి. దుర్జయసింగు ప్రభాతమున దుర్గద్వారము తెఱవ నాజ్ఞాపించి, రెండువందల చోండావత్సేనతో నయిదువందల మొగల్ బలముపైఁ బడి, దానిని గొండక్రిందకిఁ బాఱఁ ద్రోలెను. అతఁడు తిరుగ దుర్గములోఁ జేరగా చోండావతు లెల్లరు సింహ నాదములు చేసిరి.

ఇవ్విధమున కొన్ని మాసములు చనుటయు, దుర్గమునందు భోజ్య పానీయములు తగ్గిపోవఁ జొచ్చెను. అంతట రాజకు టుంబమును నూర్యమహాలులో నుండుట మంచిది కాదని యెంచి దుర్జయసింగు మఱియొక చోటికిఁ బంపెను. తక్కిన యోధులు నయితము తమతమ కుటుంబములను వేర్వేఱు చోట్ల కనిపిరి. పిదప నర్ధాన్నములతో నావీరులు దుర్గమును రక్షించుచుండిరి.

రాజపుత్రులు మఱియొక మాసము దనుక దుర్గమును గాపాడిరి. కాని, భోజనము సరిగా లేకుండ జీవించుట కష్టము గదా. తుద కొకనాఁడు దుర్గద్వారము భగ్న మయ్యెను.

మొగలులు కోటలోఁ జొరఁబడిరి. రాజపుత్రులకును మొగలు లకును గయ్యము ప్రారంభ మయ్యెను.

యుద్ధము దారుణముగ నుండెను. రాజపుత్రులు మరణము నిశ్చయ మని తలంచి భయంకరముగా వైరులతోఁ బెనఁగ సాగిరి. కాని, యపార మగు మొగల్ వాహినితోఁ బోరియు కొద్దిమంది రాజపుత్రు లేమి చేయఁగలరు ? క్రమక్రమముగా మొగలులు ముందునకుఁ జనుచుండిరి.

సంగర తరంగము లావరణమునుండి లోపలికిఁ బ్రవహింపఁ సాగెను. బందూకుల ధ్వనులతోను, ఖడ్గములఝణ ఝణ నినాదములతోను, సైనికుల కోలాహలముతో డను, నార్తుల యార్తరవము తోడను సూర్యమహల్ మార్గము నిండిపోయెను. శేషించి యున్న రాజపుత్రులు పట్టు విడువక పగతుఱ నెదిరించుచుండిరి.

ప్రాసాదమున వెనుకటి భాగమునం దొకగదిలో నాకస్మిక ముగా తేజసింహ దుర్జయసింహులు కలిసికొనిరి ఇరువురు రక్తసిక్తాంగులై యుండిరి. తేజసింగు కొంచె మాలోచించి, దుర్జయునితో "చోండావతు రాతోడు పరాక్రమమును జూచి నాఁడు, రాతోడు చోండావతు ప్రతాపమును జూచినాఁడు. ఇక యుద్ధము నిష్ప్రయోజనము. ఈ కయ్యములో మృతి నొందినను లాభ మేమి ? నేడు మనము ప్రాణములతో బయటఁ బడితిమేని మహారాణావారికి మఱియొకసారి యుపకరింతుము" అని పలికెను.

"మహారాణావారి కార్యము నెఱవేర్చుట రాజపుత్రుల ప్రథమధర్మము. అయితే ప్రాణములు దక్కించుకొనుటకు మార్గమున్నదా ?"

గవాక్షమును జూపి, తేజసింగు "ఈ కిటికీగుండ రాథోడ్ బాలుఁడు క్రింది మడుగులో దుమికి, యీదుచుఁ బోయి, ప్రాణములు దక్కించుకొనె నట! చోండావద్వీరుఁడు రాథోడ్ బాలుఁడు చేసిన ప్రకారము చేయవచ్చును!" అనెను.

పూర్వవృత్తాంతము జ్ఞప్తికి వచ్చుటచేత లజ్జాక్రోధములు చెలరేగ, ఖడ్గము చలింప, దుర్జయసింగు నేల దన్ని, వాతాయన మార్గమున హ్రదములో దుమికెను.

తేజసింగు నయిత మాజాలమార్గమున సరస్సులోఁ బడెను. ఇర్వురు నీదుచు నావలి యొడ్డు చేరిరి.

సూర్యమహల్ దుర్గము మొగలుల స్వాధీన మాయెను.

## ౨౮

రాజ కుటుంబము సూర్యమహాలునుండి భీమగడ్ దుర్గమునకుఁ జనెను. మొగలు లావృత్తాంతము నెలాగుననో గ్రహించి, యాకస్మికముగా నొకరాత్రి యాదుర్గముపైఁ బడిరి. రాజ కుటుంబమును బట్టుకొని, ఢిల్లీకిఁ బంపిన పక్షమున ప్రతాప సింహుఁడు లొంగక మానఁడని తుర్కీవాండ్రు భావించిరి.

రాజపుత్రులు యుద్ధసన్నద్ధులై యుండ లేదు. దుర్గములో దేవీసింగు లేఁడు; అతఁడు మహారాణాతో నెచ్చటకో జని యుండెను. అయిదువందల రాథోడులతో చందనసింగు కోటలో నుండెను. తేజసింగు సయిత మచ్చటనే యుండెను. రాజ కుటుంబ సంరక్షణభారము వహించుటచే నతఁడు దుర్గమును వదలుటయే లేదు.

ముసల్మాను లాకస్మికముగా దుర్గమును ముట్టడి వేయుటచే తేజసింగు మొగము వాడిపోయెను. మొగలులు చీమలబారు వలె నల్వంకలఁ గానఁబడిరి. తేజసింగు చందనసింగునుజూచి "చందనసింగ్, నేఁడు మనము దుర్గమును నిలుపుకొనుట సంశయము. రాజకుటుంబము నిచ్చట నుంచుట క్షేమముగాదు. ఇక్కడనుండి వెడలిపోవుటకు రహస్యమార్గ మరణ్యము గుండ నొకటి కలదు. అయ్యది నాకును, నాభిల్లులకును మాత్రము తెలియును. సురక్షిత ప్రదేశముఁ జేరునప్పటికి సూర్యోదయ మగును. అప్పటివఱకును దుర్గము ను రక్షించు భారము నీమీఁద నుంచినాను." అని యాజ్ఞాపించెను.

"దుర్గమును రక్షించు భారము పూర్వమే దేవరవారు నాపైఁ బెట్టినారు దేవరవా రాజ్ఞాపించిన రీతిగా సూర్యోదయము వఱకును దుర్గమును గాపాడెదను. ప్రభువుగారు నిశ్చింతులయి, రాజకుటుంబమును దఱలింపుఁడు. మన ధన ప్రాణములు మహారాణా వారివే !"

బాలుని వాక్యముల నాకర్ణించి తేజసింగు ప్రమోదము నొందె. చందన్, నీమాటలు వినుటచే నాచింత తొలఁగి పోయినది!" నిట్టూర్పు విడిచి యస్ఫుట స్వరముతో "సరే! కాని, దేవీసింగు పుత్రునిగూర్చి ప్రశ్నించినప్పుడు నే నేమందును!" అనెను.

తేజసింగు భిల్లవేషము దాల్చి, రాజకుటుంబము ను నిరపాయ ప్రదేశమునకుఁ గొనిపోయెను.

కొంతసేపటికి దుర్గప్రాకారముపైఁ గరదీపికలు కానఁబడెను. మూడువందల సైన్యము దుర్గము వెలుపలి కరిగెను; మిగిలిన రెండువందలసేన దుర్గములో సిద్ధముగా నుండెను.

ఇంతలో మసల్మానులు వచ్చిపడిరి. మహారాణాను సకుటుంబముగాఁ బట్టుకొనవచ్చునన్న యుత్సాహముచే వారు భయంకరముగా యుద్ధము చేయసాగిరి. తమగౌరవము పోవరా దని రాజపుత్రులు పట్టుదలతో శత్రులను దాకుచుండిరి. యుద్ధము దారుణముగ నుండెను.

రాత్రి యంతయు పోరు జరుగుచుండెను. తూర్పుదిక్కున రాగరేఖలు కానఁబడునప్పటికి రాజపుత్రు లనేకులు మృతి నొందిరి. అంతట చందనసింగు దుర్గములోఁ బ్రవేశించెను. ఆతనివెంట రమారమి యేబదుగురు భటు లుండిరి. వారల యారక్తనేత్రములను, రక్తసిక్త పరిచ్ఛదములను దీర్ఘశరీరములను, భీషణ ముఖమండలములను జూచినయెడల బ్రహ్మాపర

ముచే బలిసిన రాక్షసులతో యుద్ధము చేసి పరాజితు లయి నిజాలయమునఁ జొచ్చుచున్న దేవత లనుటకు సంశయ ముం డదు. సంరంభముతో ముసల్మానులు తోసికొని వచ్చిరి. కాని ఝుణఝుణ ధ్వానముతో దుర్గకవాటము మూయఁ బడుటచే వా రాగ వలసివచ్చెను.

అప్పుడు మొగలులు హతాశ్వాసు లయిరి. రాత్రియంతయు యుద్ధము చేయుచుండుటచే వారు బడలిక నొందిరి. ద్వారము బద్ధమై యున్నది. దిన మంతయు యుద్ధము చేసిననే గాని దుర్గము స్వాధీన మగునట్లు తోచుట లేదు. బడలిక జెంది క్షీణబలు లయియున్న మొగలుల నుద్దేశించి సేనాపతి యిట్లు లాజ్ఞాపించెను.

"సైనికులారా, నేడే భీమగడ్ దుర్గమును స్వాధీనము చేసి కొందును, నేడే ప్రతాపునికుటుంబమును చెఱఁ బెట్టెదను. కాబట్టి వీరులారా, ప్రస్తుతము విశ్రమింపుఁడు!"

ముసల్మానులు భగ్నోద్యము లగుట గాంచి చందన సింగు కోటగోడపై కెక్కెను. చూడగా రమారమి వేయి మంది తురుష్కులు గోడవెలుపల విశ్రమించు చుండిరి. యుద్ధము ముగియ లే దనియు, మఱల మొగలులు కోటను ముట్టడింపక పోవ రనియు చందనసింగు గ్రహించెను. బాలుని బొమలు ముడివడెను, ముఖమండలము చింతాచ్ఛన్నమాయెను ఇంచుక యోజించి, దరహాసముతో నతఁడు క్రిందకి దిగెను.

చందనసింగు తనవారిం బిలిచి “ యోధులారా, సాధ్య మగు నంతవఱకు మనము ప్రయత్నము చేసినాము. నాప్రతిజ్ఞను నిర్వహించితిని. అల్లదె సూర్యభగవానుఁ డుదయించు చున్నాఁడు. ఇప్పటికిని దుర్గము వెలుపల రమారమి పదివందలమంది మొగలు లున్నారు. లోపల మనము రెండువందలకు మించము. ఇక నేమి చేయవలెను? మీయాలోచన యేమి?” అని యడిగెను.

బహిరంగయుద్ధమునఁ బ్రాణములను విసర్జించుటకంటె రాఁదోడు లేమి యాలోచింతురు?” అని యొక వీరుఁ డనెను.

“అటుతరువాత మన తల్లులు, తోడబుట్టువులు, తక్కిన స్త్రీ బంధువులును మొగలుల బానిస లగుదురు. రాజపుత్ర రమణులు ఢిల్లీయందు విలాస ద్రవ్యము లగుదురు!” అని చందనసింగు విషాదముతోఁ బలికెను.

ఈవాక్యములు చెవిఁబడు నప్పటికి రోషముచే నెల్లర వదనములు జేవురించెను. ఒఱలలోనుండి ఖడ్గములు సగము పయికి వెడలెను. కాని రాజపుత్రమండలి నిశ్శబ్దముగా నుండెను. అర్ధస్ఫుటస్వరముతోఁ గొందరు, జోహార్! అని యుచ్చరింపగా నందఱును దాని నందుకొని “పురుషులకు వీరశయనము! స్త్రీలకు జోహార్!” అని యఱచిరి.

పిమ్మట చందనసింగు శుద్ధాంతమున కరిగెను. అచ్చట నాతనితల్లి కొందఱు స్త్రీలతో ముచ్చటించుచుండెను. పుత్రుడు

తల్లిచరణములకు నమస్కరింపగా నామె "యుద్ధవార్త లేమి?" అని కుమారు నడిగెను.

"సువార్తలే! రాజపుత్రుఁ డెవ్వఁడును వెనుదీయ లేదు. దుర్గ మింకను మనస్వాధీనమునందే యున్నది. సూర్యభగవానుఁ డుదయించినాఁడు!"

మాత సంతుష్టయై తనూజు నాశీర్వదించెను.

"అమ్మా, ఆజ్ఞ యొసఁగుదువేని యింకొకసంగతి విన్నవించెదను. రాత్రియుద్ధమున దాదాపుగా మూఁడు వందల రాథోడులు మృతి నొందిరి. ఇప్పుడు దుర్గములో రెండువందల సైన్యముకంటె హెచ్చుగా నుండదు. శత్రువులు వేయిమంది కలరు కొంచెము సేపటిలో యుద్ధమున కుపక్రమింతురు" అని పలికి, చందనసింగు మిగిలినమాట లుచ్చరింప లేకపోయెను. బాలుని కంటినుండి బాష్పకణ మనుపలక్షితముగా నేలపై రాలెను

"రెండు వందల మంది రాథోడులు వేయిమంది తురుష్క వాండ్రతో యుద్ధముచేయ జంకుచున్నారా?" అని యావీర మాత తీవ్రస్వరముతోఁ బలికెను.

"రాజపుత్రులు యుద్ధ మన్న వెఱవరు. కాని, రాజపుత్రాంగనల గౌరవము ముందుగా రక్షింపఁదగినది!" అని చందనసింగు నిశ్చలముగా నుడివెను.

వత్సా, యీమాట చెప్పుటకు వెనుదీయుచున్నావా!

రాజపుత్రవీరులు మృతి నొందుట నెఱింగినప్పుడు రాజపుత్ర స్త్రీలు మృతి నొందు టెఱుఁగరా? నాయనా, పొమ్ము. యుద్ధమునకు సంసిద్ధుఁడ వగుము. మాపని మేము చూచు కొందుము!" అని నవ్వుచు చందనుని మాత పలికెను.

పిమ్మట నామె స్త్రీల నందఱను బిలిపించి, మందహాస ముతో ని ట్లనెను. "రమణులారా, మన మీనాడు సతుల మగుదుము. ఇంతకంటె రాజపుత్రస్త్రీల కదృష్టము కలదా? రాజపుత్రులు వీరు లనియు, స్త్రీలు సతు లనియు తుర్క-వాండ్రు తెలిసికొందురు గాక!"

నవోదిత బాలాతపమున స్త్రీలు స్నానాదికములు కావించి పట్టు వస్త్రములు ధరించి, రాజద్వారమున గుమిగూడిరి. బాలికలు, యువతులు, ప్రౌఢలు, వృద్ధాంగనలును సానంద ముగా భగవన్నామము నుచ్చరింపఁ జొచ్చిరి. అనంతరము? అనంతరము రాజపుత్ర ధర్మానుసారముగా భూషణములు దాల్చి, స్త్రీ లందఱు నుల్లాసముతో చితి నధిరోహించిరి.

అగ్నిజ్వాలలచుట్టును రాథోడ్ వీరులు నిలిచియుండి, పెను మంటలలోఁ దమవా రందఱు నీ రగుట విలోకించిరి. ఇక వారలకుఁ బ్రపంచములో నే మున్నది? అనురాగమునకు నాశకు నాధారము నశించినది. అంత నా వీరులు స్నానములు చేసి, దేవతారాధనము కావించిరి. నిశ్శబ్దముగాఁ గవచములు ధరించి, రక్తవస్త్రములు దాల్చి, శిరస్త్రాణముల పైఁ దులసీ

దళముల నుంచుకొని, కడసారి పరస్పర మాలింగనములు చేసి
కొనిరి. ప్రాణములు విడుచుటకుఁ బూర్వము తండ్రి కొడుకులు,
నన్నదమ్ములు, బంధువులు నన్యోన్య పరిష్వంగసుఖము ననుభ
వించిరి.

జాము ప్రొద్దెక్కు నప్పటికి ఝుణ ఝుణ ధ్వానముతో
దుర్గకవాటము తెఱువఁబడెను. ముసల్మానులు విస్మితులైరి.
సముద్రతరంగముల చాడ్పున రాజపుత్రవీరులు సరభసముగా
శత్రువులపైఁ బడిరి.

ఆయోధులు నిహతులైరి. దుర్గము తురకవాండ్ర స్వాధీన
మయ్యెను. కాని హతశేషులగు ముసల్మానులు రెండువందల
రాజపుత్రుల యాక్రమణమును మఱవ లేదు.

ఏఁబది సంవత్సరముల తరువాతఁ గూడ వృద్ధులగు మొ
గల్ సైనికులు తమపుత్రులకుఁ గాని పౌత్రులకుఁ గాని భీమగడ్
దుర్గవిజయమును, నా రెండువందల రాజపుత్రుల వీరవిహార
మును కథారూపమునఁ జెప్పుచుండువారు!

౨౫

భిల్లగహ్వరమున మహారాజ్ఞిని పుష్పకుమారి సందర్శించిన
నాఁడు ప్రతాపసింగు మొగల్ సైన్యము నాకస్మికముగా నంత
మొందింప యత్నించెను, గాని శత్రువులు లెక్కకు మిక్కి

లిగా నుండుటచే నుదయము మొదలుకొని యర్ధరాత్రము వఱకును యుద్ధము చేసి విఫలమనోరథుడై చావండ్ దుర్గమునc జొచ్చెను. మొగల్ బలములు క్రమముగా భీమచాంద్ నివాసమునకుc జనc జొచ్చుటయు, మహారాజ్ఞి యచ్చట నుండుట క్షేమముగా దని తలcచి సంతానముతోcగూడ పుష్ప కుమారిని వెంటcబెట్టుకొని 'జావరా' గనుల లోనికిc బోయెను. భీమచాంద్ నివాసమున రాజకుటుంబము కాన్పింపమిచే మొగలులు వెడలిపోగా మహారాజ్ఞి భూగర్భము నుండి వెలుపలికి వచ్చి చావండ్ దుర్గమున భర్తను జేరెను.

చావండ్ దుర్గమును రక్షించుటగూడ నసాధ్య మయ్యెను. భోజనసామగ్రి తగ్గిపోవుచుండెను, యోధులు క్షీణబలులగుచుండిరి, నల్వంకల మేఘరాశివలె శత్రుశిబిరములు కాన్పించుచుండెను. స్థితిగతుల నాలోచించుటకై ప్రతాపసింగొకనాడు సభ చేసెను.

మహారాణా కిరుప్రక్కలc గులాధిపతులు కూర్చుండియుండిరి. అక్కటా! కుమల్మేర్ దుర్గమున నాడు కూడిన యోధులలో నిప్పు డెందఱు కనcబడు చున్నారు? దైలవారాధిపతి యగు ఝూలా కులేశ్వరుcడు నిహతుc డయ్యెను. బిజలీ ప్రభు వగు ప్రమరు కులాధినాథుcడు మృతి నొందెను. ఇతర వృద్ధవీరులు మరణించిరి. ఇప్పుడు మహారాణాచుట్టు నున్నవారు చిన్నవారలు, తంత్రులు కాలధర్మము నొందుట

చేతఁ గులాధిపతు లయి మహారాణాకోసము తమ ప్రాణము లను విడుచుటకు సంసిద్ధు లయి యుండిరి. అమరసింగు మహారాణావారి పెద్దకొడుకు. ఇతఁడు చిన్నతనమునుండియు పర్వతములపై నివసించుచు జనకుని కష్టములను బంచుకొనుచు యుద్ధమే జీవనముగాఁ గాలక్షేపము చేయుచున్నాఁడు. అమరసింగు తండ్రి దగ్గఱగాఁ గూర్చుండియుండెను.

కొంతతడవు సమాలోచనము జరిగెను. పిమ్మట సేవకులు ఖాద్యములను గొని వచ్చి యాకులలో వడ్డించిరి. ఉన్నత దశలో నున్నప్పుడు రాజమందిరమున జరుగునాచారము లిట్టి స్థితియందు నెంతమాత్రము లోపము లేకుండ జరిగినవి.

వీరులు పూజ్యులు నగు యోధులకు మహారాణావారి పాత్రి నుండి ఫలములు గౌరవసూచకముగా నొసఁగు నాచారము కలదు. దీనిని దోనా యందురు. నేఁడు దోనా యెవ్వరి కీవల యునో నిశ్చయించుటకై ప్రతాపసింగు నల్దిక్కులు వీక్షించెను.

అమరసింగతనిదగ్గఱఁ గూరుచుండి యుండెను. చిన్నవాడైనను అమరసింగనేక యుద్ధములందు ధైర్యము చూపిన వాఁడు. ప్రతాపసింగు తనూజు నుద్దేశించి "అమరా, నీవు పరాక్రమశాలివే. కాని 'దోనా' గ్రహింపఁ దగిన వీరుఁ డొకఁ డున్నాఁడు" అని పలికెను.

కొంచెము దూరములో దుర్జయ తేజసింగులు కూర్చుండి యుండిరి. వారిని జూచి ప్రతాపుఁ డిట్లనెను: "చోండావత్

రాఠోడ్ వీరులారా, మీస్వామిభక్తి ప్రశంసనీయము. మీ పరాక్రమ మత్యద్భుతము. మీ రుభయులును నాకొఱకు ప్రాణములను గూడ లెక్కచేసినవారు కారు. బహుకష్టముల కోర్చి రాజకుటుంబము ననేకపర్యాయములు రక్షించినారు. అయినను నేడు దోనా గ్రహింపఁ దగిన వీరుఁడు మఱియొకఁ డున్నాఁడు."

కన్నెదుట నుపవేశించియున్న దేవీసింగును జూచి ప్రతాపుఁ డిట్లు పలికెను; "దేవీసింగ్, ఈపాడు యుద్ధములలో నాకొఱకు మీరు సర్వస్వమును గోల్పోతిరి. మీ పరాక్రమమునకును స్వామిభక్తికిని దగిన బహుమాన మే మీయఁగలను ? మీ దుర్గము పోయినది. వీరుఁ డగు కుమారుఁడు మృతి నొందినాఁడు. కుటుంబము నశించినది, పరిజనులు మరణించిరి. అట్లయ్యును ఖడ్గము దాల్చి మీరు నా వెంటఁ దిరుగుచున్నారు. ప్రతాపసింగనేక కష్టములను సహింప నేర్చినాఁడు. కాని మీవంటి స్వామిభక్తిపరాయణు నిట్టి యవస్థలోఁ జూడ ప్రతాపుని పాషాణహృదయముకూడ బ్రద్దలగుచున్నది. వీర చూడామణీ, మీవీరత్వమునకుఁ దగిన బహుమాన మొసఁగుట మానవసాధ్యము కాదు. నేఁడు నా యాహారమును బరిగ్రహించి నన్ను ధన్యునిఁ జేయుదురు గాక !"

మహారాణా వచించిన యీ వాక్యము లాలించి వృద్ధయోధ వెంటనే ప్రత్యుత్తర మీయ లేదు. అతనికంటినుండి యశ్రు

బిందువు జాఱెను. అంతట దేవీసింగు కన్నీటిని తుడుచుకొని, కొంచెము గద్గదస్వరముతో నిట్లనెను :

“దేవా, క్షమింపుఁడు, స్త్రీజనోచిత మగు దుఃఖ చిహ్నమును మన్నింపుఁడు ! నావార్ధకమున చందనునకు దుర్గము నప్పగించి, శాంతముగాఁ గాలక్షేపము చేయనెంచితిని. కాని యక్రమము జరిగినది. అయినను, పుత్రుఁడు నిష్కళంకముగా మృతినొందినాఁడు. మహారాణావారి కార్యమున వీరమరణము నొందినాఁడు ! అదియే నాకుఁ దృప్తి !”

ఇక సంభాషణ మేమియు జరుగ లేదు. యోధులనేత్రముల నీరు గ్రమ్మెను. వారికి వాక్యస్ఫూర్తి లేకపోయెను. భోజనము నిశ్శబ్దముగా ముగిసెను. మహారాణా పట్టపుదేవి సన్నిధికిఁ జనెను.

రాజశిశువులు కొందఱు ప్రజ్వరిల్లుచున్న యగ్నిచుట్టును కూరుచుండి యుండిరి; కొందఱు రాతిబండలపై నిద్రించుచుండిరి. రాణియు పుష్పకుమారియు రొట్టెలు చేయుచుండిరి. పిల్లలు నిద్ర లేచిన పిమ్మట వానిని భుజింతురు. ప్రతాపసింగు దూరముగా నిలిచి, యాదృశ్యము నవలోకింపఁ జొచ్చెను; అతఁడు చింతాకులుఁడై యుండెను.

ఒక్కటొక్కటిగా దుర్గము లన్నియు శత్రువుల చేతులలోఁ బడుచుండెను. అహరహము సైనికులు తగ్గిపోవుచుండిరి. ప్రతాపునిచేతిలో ద్రవ్యము లేదు, రాజధాని లేదు, రాజ్యమే

లేదు. కొండతప్ప తల దాచుకొనుటకుఁ దావు లేదు. రాజ కుటుంబము నిలుచుటకు నీడ లేదు. అయినను ప్రతాపసిం గీ కష్టములఁ నన్నిటిని సహించుచుండెను.

మహారాజ్ఞి స్వహస్తములతో వంట చేయుచున్నపుడు శత్రువులు వచ్చుచున్నా రన్న వార్త చెవిఁ జేరగనే యచ్చటి నుండి వేఱొక ప్రదేశమునకు బలాయనము చేసి, మరల పాకము చేయ నారంభింప, గ్రమ్మఱ మొగలుల యాగమన వార్త నాకర్ణించి, యాయన్నము నక్కడనే వదలి, యేడ్చు చున్న పిల్లలను వెంటఁ బెట్టుకొని, మఱియొక తావునకుఁ జనుచుండును. కొన్ని దినములు భిల్లులదయచే పాలేశ్వరీదేవి జావరాగనులలో దాగియుండెను. ఇట్టికష్టములను ప్రతాపుఁడు సహించు చుండెను. వీనివలన నాతని వీరహృదయము చలింప లేదు.

అప్పుడప్పుడు మహారాజ్ఞి రాత్రులందు భర్త సమీపమున శయనించి యుండ, జప్పున వర్షము కురిసి, జలప్రళయ మగును. ప్రభాతము వఱకును పాలేశ్వరీ దేవి తడిబట్టలతో పిల్లల నెత్తుకొనియుండును. ఇట్టి మనఃక్లేశములను ప్రతాపుఁడు తృణీక రించుచుండెను. వీనివలన నాతని వీరహృదయము సంచలింప లేదు.

రాజకుటుంబ మప్పు డప్పుడు నిరాహారముగా నొకయడ వినుండి మఱియొక యడవికిఁ బోవుచు, బగలంతయు గడపి

రాత్రివేళ గుహాలోఁ బ్రవేశించును. వంట చేసికొనుటకుఁ బదార్థములు చప్పున దొరకునని కావు బీళ్ళలోని 'మల్' గడ్డితో రొట్టెలు చేసి, పాటేశ్వరీదేవి సంతానమునకుఁ బెట్టుచుండెను. ఒకరోజు యడవిపిల్లి వచ్చి, చప్పుడు కాకుండ పిల్లచేతిలోని రొట్టె నెత్తుకొని పోయెను. ఆబాలిక తిండిలేక యేడ్చి యేడ్చి తల్లిరొమ్ముపై నిద్రించెను. ప్రతాపుఁ డట్టి వ్యధలను దృణీకరించు చుండెను. వీనివలన నాతని వీరహృదయము సంచలింప లేదు.

కాని, నేడా మహావీరుని హృదయము సంచలించినది. ప్రశస్తమగు లలాటము చింతాకులమై యున్నది!

పట్టపుదేవి మహారాణాను విలోకించి, చేతిలో రొట్టెలను పుష్పకుమారి కిచ్చి, భర్తతో సంభాషింప నేతెంచెను. చూడఁగా నాతని నేత్రములు బాష్పపూరితములై యుండెను. అంత నామె యచ్చెరు వొంది, "ఇదేమి? మహారాణావారు నేడు విచారగ్రస్తులై యున్నారు! ఇప్పటికి రాణావారు యుద్ధములచే బడలి, నడలి భీతి నొందినట్టు లున్నారు అని తుర్కీవాండ్రు నిందమోపుదురు" అని పలికెను.

"దేవీ, భగవంతుఁ డెఱుఁగును! ప్రతాపుఁడు యుద్ధములచే నడలిపో లేదు, విత్తులచే భీతి నొంద లేదు" అని మహారాణా వచించెను.

"ఆలాగైనచో, సంతానము పడుచున్న పాట్లను జూచి వ్యథ నొందితిరా ? మీరు కష్ట పడుచున్నప్పుడు మేము మాత్రము కష్టములను సహింప లేమా ?"

"దేవి, ఈపాడు యుద్ధములలో ననేక యోధులు మన యమరసింగు వంటిపుత్రులను, బుత్రికలను, భార్యలను, బంధువులను, బరిజనమును, ఇంత యేల సమస్తమును గోల్పోయిరి"

"ఏకలింగజీ వారికి శాంతి నొసంగుఁ గాక ! ఇట్టి శోకము సహించుట కష్టము."

"దేవి, దేవీసింగు అను రాథోడ్ వీరుఁడు మనకు కుడి చేయివంటివాఁడు. పాపము ! ఆయన దుర్గమును తురుష్కులు లాగివేసినారు. ఆయన కుమారుఁడు మృతి నొందినాఁడు, స్త్రీలు చితి నెక్కినారు. ఇప్పు డావృద్ధుఁడు స్వామికార్యమున నెప్పుడు ప్రాణములు విడుతునో, అని కనిపెట్టుకొని యున్నాఁడు."

పాటేశ్వరీదేవి కన్నులవెంట నీరు గార్చుచు, నిట్లనెను :

"ఏ మంటిరి ? దేవీసింగు కుటుంబ మంతయు నశించె ననియా ఒక కొడు కుండగా నతఁడు మృతి నొందెనా ? అయ్యో ! విధాతా, పుత్రశోకముకంటె గఠినతర మగు పిడుగును సృజింప లేకున్నావే !"

"వీరుఁ డగు పుత్రుఁడు మరణించెను, పరివారము పోయెను, దుర్గము పోయెను, వంశ మంతరించెను. దేవీసింగు

స్వామిభక్తి కిదియా ఫలము ! ఇట్టి యనుచరులను బోఁగొట్టు కొని, మేవాడ్ దేశముకొఱకు పెనగు లాడిన నేమి లాభము? ” అని ప్రతాపసింగు పలికెను.

అశ్రుపూర్ణలోచనయై పాటేశ్వరీదేవి తనసంతానమున కాహారము నిడఁ గూరుచుండెను ప్రతాపుని హృదయము శాంతి నొందలేదు. కొంతసేపటి కతడు “ రాజ్యాధికారము వలన నిట్టి దున్సహాఫలితము కలుగుచుండునేని నాకు రాజ్య మక్కఱలేదు. రాజనామమునకు జలాంజలి యొసఁగెదను ! ” అనెను.

మఱునాడు మహారాణా పత్రికాముఖమున అక్బర్‌షాహాను సంధి వేడెను

౨౬

సంధి వేడిన తరువాతఁ గొన్నిదినములు చనెను ఒకనాటి సాయంకాలమున ప్రతాపసింగు సభ చేసెను. కులాధిపతులు కూడియుండిరి.

అక్బరషాహాను తాను పత్రికాముఖమున సంధి వేడిన వార్త ప్రతాపసింగు వారికిఁ దెలిపి “ అక్బర్ తప్పక సంధి కంగీకరించును. కాని, సిసోదియా వంశమువారు మ్లేచ్ఛునకు లోబడవచ్చునా? ” అని ప్రశ్నించెను. సభలో నెవ్వరును నోరు తెఱవ లేదు.

సాధ్య మగునంతవఱకును యుద్ధములు జరిగెను. ఇప్పుడు మేవాడ్ దేశమున ఛావండ్ దుర్గము తప్ప రాజపుత్రులకు మఱియొక దుర్గము లేదు శత్రువులు క్రొత్త సేనతో నప్రతిహత మగు గతితో దేశ మంతయు వ్యాపించుచుండిరి. యుద్ధమా? ప్రతాపుఁ డేలాగున యుద్ధము చేయును? సైన్యమా లేదు. సైనికులకు జీతము లిచ్చుటకు ధన మున్ననో, నదియును లేదు పోనీ, దుర్గమో? నిలుచుటకు నీడయే సరిగా లేదు చావండ్ దుర్గమున నున్న యెడల శత్రుహస్తములలోఁ బడుట నిశ్చయము. ఈపని చేయుట మేలా? అంబీర్ మార్వాడ్ మొదలగు దేశాధీశులవలె మొగల్ చక్రవర్తికి లోబడుట మంచిదా? లోబడి, సంధి వేడుట కాక యుపాయాంతరము లేదా?

దేనికొఱ కింతపర్యంతము ప్రతాపసింగు శత్రువులతోఁ బెనఁగుచు రాజపుత్రరక్తమును దేశ మంతటను వెదఁజల్లుచుండెనో, ప్రాసాదమును విడిచి కుటీరము లందును గుహలయందును నివసించుచుండెనో, పవలనక రేయి యనక నిరంతరము కష్టములు సహించుచుండెనో యట్టిస్వాతంత్ర్యమును విసర్జించునా? రాజస్థాన దేశ ప్రభువులందఱును మ్లేచ్ఛదాసులయిరి. ఇప్పుడు మహారాణా సయితము తురకవానికిఁ దల వాంచునా? బప్పారావుల నిర్మలవంశ మింతకాలమునకు తురుష్కులకు దాస్యము చేయునా?

రాజపుత్రు లెల్లరు నిర్వ్యాకు-లయి యుండిరి. కర్తవ్య మేమి!

నేను లొంగినను తేపు మరల స్వాతంత్ర్యము నవలంబింప వచ్చును. అక్బర్‌షాహా ధీమంతుఁడు, పరాక్రమశాలి. అతని తరువాతి చక్రవర్తి యితనివంటివాఁడు కాకపోవచ్చును. అప్పుడు మేవాడ్ రాజ్యము స్వాతంత్ర్యము వహింప వచ్చును. కాని, యిప్పుడు సిసోదియా వంశము తురకకు లొంగినయెడల నిక ముందు గౌరవ ముండదు.

ఇట్టి యాలోచనలు జరుగుచున్న సమయమున నొకానొక పురుషుఁడు పత్రిక గొనివచ్చెను. ఆపత్రికను లిఖించిన యతఁడు పృథ్వీరాజు. అతఁడు మహాకవి, యోధ. పత్రిక ఛందోబద్ధమై యుండెను.

బికానీర్ డిల్లీ సామంత రాష్ట్రము. బికానీర్ సంస్థానాధీశుని తమ్ముఁడు పృథ్వీరాజు డిల్లీనగరమున నివసించుచుండును. ఇతనికి ప్రతాపసింహునియం దన్న మిక్కిలి భక్తి. మేవాడ్ స్వాతంత్ర్యమును స్మరించి పృథ్వీరాజు తనహీనస్థితివలని విచారమును మఱచు చుండువాఁడు. ఆకాలమున హిందువు లేమి ముసల్మాను లేమి మహారాణాను ప్రశంసింపనివారు లేరు.

ప్రతాపుని సంధిప్రార్థనాపత్రిక నందుకొని అక్బర్‌షాహా చెందిన యానందమునకు మేర లేదు. ప్రతాపునివంటి ప్రబల వైరి తనంతఁ దానే సంధి వేడుటచే మొగల్‌చక్రవర్తి సంతోషసూచకముగా నుత్సవములు చేయించెను.

ఈ విషయముల నాలోకించి పృథ్వీరాజు కుపితుఁడై, అక్బరుతో ని ట్లనెను.

“జహాఁపనా, అది కల్పితపత్రిక ప్రతాపుని కీర్తిని బాడు చేయుటకయి యతని శత్రువులు దానిని గల్పించియుందురు. నే నామహావీరుని బాగుగా నెఱుఁగుదును. ప్రతాపసింగు మీకు లొంగుననుమాట కల్ల!”

పిమ్మట పృథ్వీరాజు పద్యములతో నుత్తరము వ్రాసి, మహారాణాకుఁ బంపెను ఆయుత్తరము నేటిసభలో ప్రతాపుని చేతికి వచ్చినది అతఁడు దానిని బఠింప సాగెను.

పృథ్వీరాజు లేఖ

పురుషులు పరాక్రమంబుఁ గోల్పోయినారు
పొలతులు సతీత్వమును గోలుపోయినారు
హిందువుల గౌరవము నశియించి పోయె
తమరు లేకున్న యెడల నంతయును నున్న

హిందువుల కాశ యెల్ల మీయందె కలవు
వీరు లందఱ నక్బరు నిలిచినాఁడు
ఉదయసింగు తనూజాతు నొకనిఁ దక్క

క్షాత్ర ధర్మము పూర్తిగా సమసిపోయె!
రేపు మాయుచునుండు ‘నౌరోజు’ లందు
సుందరుల గౌరవంబు ‘ఖుష్రోజు’ నాడు.

తుదకు నకలంక మైన చిత్తోడు కూడ
దక్కు మాలిన విపణి కేతెంచు నొక్కొ !

విభవముల నన్నిటిని మీరు విడిచినారు,
వంశధర్మము మాత్రము వదల లేము.
ఆశలను వీడి చివర కాయక్బరునకు
యోధులే యెందఱో లొంగుచున్నవారు.
తురకవానికి లొంగె నన్ దుర్యశంబు
అల్ల హమ్మీరుసింహుని యభిజనమున
కొక్కదానికి మాత్రమే యొదవ లేదు !

క్షాత్ర ధర్మంబుఁ జేతి ఖడ్గంబు తోడ
నిష్కలంకమ్ముగా మీరు నిలిపినారు !

బహు దినమ్ములు వ్యాపారి బ్రదుకఁబోఁము !
పిదప మేము సుక్షత్రియ బీజముకయి
క్షత్రియ కులావతంస మా స్వామివారి
సన్నిధికి రావలసి యుండు. జనము లెల్ల
దేవరను నమ్మియున్నారు. దేశమందు
ప్రబలుచున్నది కలుషంబు. ప్రభువువారు
నిలుప వలయును ధర్మమ్ము నిశ్చలముగ !

ప్రతాపసింగు పత్రిక నొకసారి రెండుసారులు మూడు సారులు చదివి యిట్లనెను :

"వీరులారా, అపవిత్రతామధ్యమున ప్రతాపుఁడు పవిత్రముగా నుండును. మేవాడ్ దేశమున నుండుటకు వీలు లేని పక్షమున మఱియొక దేశమునకుఁ బోవుదము. అంతే కాని స్వచ్ఛ మగు సిసోదియా వంశమునకు గళంకము వాటిల్లరాదు!"

౨౭

మహారాణా ప్రతాపసింగు దేశములోని ప్రధాన యోధుల తోడను, సైన్యముతోను, గుటుంబముతోను మాతృ భూమిని విడిచి, అరావళీ పర్వతములు దాటి మరుభూమి ప్రాంతమున విడిసి విశ్రాంతి తీసికొనుచుండెను. అది సంధ్యాసమయము. పర్వతరాశి యింకను రాజపుత్రులకుఁ గానబడు చుండెను. మఱునాఁడు కనబడదు. ఏ ప్రదేశమున సిసోదియా వంశ్యులు బహుకాలమునుండి నివసించుచుండిరో, సమరసింహ సంగ్రామ సింహులవంటి మహావీరు లేదేశమును శాసించిరో యట్టి రాజస్థానము మఱునాటి యుదయమున కనబడదు! రాజపుత్రులు విచారముతో నిశ్శబ్దముగా బర్వతరాశిని విలోకించు చుండిరి. స్త్రీలు తమ శిశువులను జంకఁ బెట్టుకొని, సజలనయనలై, అరావళీ పర్వతములను వారికిఁ జూపుచుండిరి.

"సుందరమగు మేవాడ్ దేశమున సిసోదియా వంశము నిలుచుటకు నీడ లేదు!" అని మహారాణా నిట్టూర్పు విడిచెను.

సభాసదులు నిశ్శబ్దముగా నుండిరి. అప్పుడు "ఇంకను సిసోదీయులు స్వదేశమున నుండుటకు వీలు కలదు, యుద్ధము చేయుట కవకాశ మున్నది!" అనుమాటలు వినబడెను. ఎల్లరు విస్మితులై ధ్వని వీతెంచిన వంకఁ జూచిరి. ఆమాటలు పలికిన పురుషుఁడు మంత్రి భామా షాహి.

భామా షాహి కొన్ని మాసములనుండి ప్రతాపుని విడిచి యుండెను. రాజు యుద్ధములలో మునిఁగి తేలుచుండగా మంత్రి ధనము సంగ్రహింపఁ జనెను. మహారాణా సిసోదీయులతో స్వదేశమును విడుచుచుండె నని భామా షాహకుఁ దెలిసెను. తోడనే యావృద్ధమంత్రి వేగముగాఁ బయనము చేసి, నేఁడే ప్రతాపుని శిబిరమును చేరి వడఁకుచున్న కంఠముతో "ఇంకను సిసోదీయులు స్వదేశమున నుండుటకు వీలు కలదు. యుద్ధము చేయుట కవకాశ మున్నది!" అని పలికెను.

ప్రతాపుఁ డులికిపడి, నూతనోత్సాహముతోను, నాశతోను మంత్రి నుద్దేశించి, యిట్లు పలికెను:

"అమాత్యపుంగవా, మీవాక్కు వ్యర్థము కానేరదు. కాని, యింకను యుద్ధము చేయుట కవకాశ మున్నదా? నాకేమియు బోధపడుట లేదు. తమరు నిర్దేశింపుఁడు."

అప్పుడు వృద్ధుఁడు చేతులు జోడించి "దేవా, ఈదాసుఁడు బహు దినములనుండి తమసేవ చేయుచున్నాఁడు. ఈ సేవకుని పితృపితామహ ప్రపితామహులు బహు పురుషాంతరములు

మంత్రిపదవియం దుండిరి. ఆపదవియం దుండి మాపురుషులు వంశానుక్రమముగా సంగ్రహించి యుంచిన ధన మపరిమితముగా నున్నది. ఆధనముతో నిరువదియైదు వేల సైనికులను బండ్రెండు సంవత్సరములవఱకును భరింప వచ్చును. అనుజ్ఞ యయ్యెనేని దాసుఁ డాధనము నేలినవారి పాదములకడ నుంచును!" అని వినయపూర్వకముగా పలికెను.

మంత్రి చూపిన స్వామిభక్తికి మెచ్చి, క్రమ్మిన కన్నీటిం దుడిచికొని, ప్రతాపుఁ డిట్లనెను.

"అమాత్యపుంగవా, మీప్రభుభక్తికి మిక్కిలి సంతసించితిని. ప్రభువులు తా మిచ్చిన ధనమును మరల దీసికొందురా? ప్రతాపుఁ డిప్పుడు దారిద్ర్యము ననుభవించుచున్నను దన యనుచరుల ధనమును గ్రహింపనేరఁడు."

"దేవా, నేను ప్రభువువారికి ద్రవ్యము నిచ్చుట లేదు. మేవాడ్ దేశపు విత్తమును దద్రక్షణార్థ మిచ్చుచున్నాను. నిష్ప్రయోజకుఁ డగు కుమారుఁడు తన తల్లి కింతకంటె మఱే మీయఁ గలఁడు? దేవరవారు దేశమును రక్షించుటకు నిజ రక్తమును ధారవోయుచుండ, నేను తుచ్ఛధనము నొసఁగుటకు వెనుదీయవలెనా?"

"అమాత్య ప్రవర, మీమాటలు యుక్తియుక్తముగ నున్నవి. మీ స్వదేశానురాగము నిరుపమానము. మీవాక్య

ములను శిరసా వహించితిని. మీరొసఁగు ధనమును గ్రహించి, మఱియొక పర్యాయము ప్రయత్నము చేసి చూచెదను ”

ప్రతాపసింగు క్రమ్మఱ మేవాడ్ భూమిపై నిలిచెను; ధన బలముతో మఱియొకసారి ప్రయత్నము చేసి చూచెను. ఆ ప్రయత్నము ఫలితము రాజస్థాన చరిత్రయందుఁ గానఁబడు చున్నది.

దేవరీ యను ప్రదేశమున షాహాబాజ్ ఖాన్ సైన్యములతో విడిసియుండెను. ప్రతాపుఁడు దేశమును విడిచి పాఱిపోవు చుండె నని యతఁడు భావించెను. కాని యాకస్మికముగా మహావాతమువోలె నల్దిక్కులనుండి ప్రతాపుని బలములు వచ్చి వానిపైఁ బడెను. విఖ్యాత మగు దేవరీయుద్ధక్షేత్రమున షాహాబాజ్ ఖాన్ ససైన్యముగా నశించెను.

ప్రభంజనము వీవ సాగెను. 'అమాయిత' పర్వతదుర్గము రాజపుత్రులకు స్వాధీన మయ్యెను. అచ్చటి మునల్మాను లెల్లరు నిహతు లయిరి.

ప్రకంపన మింకను జెలరేగెను. కుమల్మీర్ దుర్గము దొరకెను. దుర్గరక్షకుఁ డగు అబ్దుల్లా తనబలముతో మడిసెను. ఉదేపూర్ స్వాధీన మయ్యెను. ఇవ్విధమున ప్రతాపసింగు పండ్రెండు మాసములలో ముప్పది రెండు పర్వతదుర్గములను గెలుచుకొనెను.

చండమారుత మింకను విసరఁ దొడఁగెను. చితోడ్, అజ్మీర్, మండల్‌గడ్, ఈమూడును దప్ప తక్కిన దేశమంతయు రాణాకు స్వాధీన మయ్యెను. మహాపరాక్రమశాలి, మేధావంతుఁడు, విపులైశ్వర్య సంపన్నుఁడు నగు అక్బర్ షాహ పదిసంవత్సరములలో గెలిచిన భాగములను ప్రతాపుఁడొక వత్సరములో జయించెను.

మహావాత మింకను విసరఁ జొచ్చెను. ప్రతాపుఁడు మేవాడ్ రాజ్యమును దాటి, తనప్రధానవైరి యగు మానసింగు రాజధాని నాక్రమించి, మల్లపుర మనువాణిజ్య ప్రదేశమును కొల్లబెట్టెను.

రాజపుత్రులు సూర్యమహాల్ దుర్గము నాక్రమించి, మొగలులను వధించి, దానిని గెలుచుకొనిరి. యుద్ధములో తేజసింహ దుర్జయసింహులు పరాక్రమము చూపిరి.

దుర్గములో తేజసింగు మొదట ప్రవేశించెను; నియమనము తరువాత దుర్జయసింగు ప్రవేశించెను. అప్పుడు తేజసింగు తనశత్రువును గాంచి "దుర్గాధిపా, మీయనుమతి లేకుండ దుర్గములో నడుగు పెట్టితిని. కావున క్షమింపవలెను. మహారాణావారి పనిలో నివ్విధమున చొరవ చేసితిని. మీదుర్గమును మీరే యేలుకొనుఁడు. నేను వెడలిపోవుచున్నాను!" అని చెప్పెను.

ఈవాక్యములు మర్మములను భేదింప, దుర్జయసింహుఁ డిట్లనెను:

"రాథోడ్, ఘటనాక్రమమున నీవే దుర్గములో నడుగు బెట్టితివి. మంచిది! నీయనుచరులతో దుర్గమును రక్షించుకొనుము నేను నీకడ బిచ్చ మెత్తను. దుర్గద్వారము మూసికొమ్ము. చోండావతుల బాహువులందు బల ముండునేని, బిమ్మటిమాట తెలియునులే!"

"రాజకార్యమున మీదుర్గములోఁ జొచ్చితిని. మీరు దొరకిన దని విశ్వాసఘాతుకుఁడను కానేరను. రాథోడులు ద్రోహము నెఱుఁగరు. చోండావత్, ఇప్పటికిని విదేశీయులతోడి యుద్ధము ముగియ లేదు. కాఁబట్టి మనలో మనము పోరాడుట మంచిది కాదు. విదేశీయులతోడి పోరు సాంతము కాగానే రాథోడులు సూర్యమహాలునకుఁ దప్పక రాఁగలరు."

అని పలికి, తేజసింగు తన యనుచరులతో దుర్గమునుండి నిష్క్రమించెను దుర్జయసింగారక్తనయనములతో రాథోడ్ వీరుఁడు చనుచున్న వైపునకుఁ జూచుచుండెను.

సూర్యమహాల్ విజయము తరువాత భీమగడ్ దుర్గము రాజపుత్రుల వశ మయ్యెను. దుర్గము బావురు మనుచుండెను. దేవీసింగు కీలోకములోఁ గల ప్రియవస్తువులు యుద్ధమునందు, నగ్నిహోత్రము నందును నశించినవి.

ఇంచుకసేపు దేవీసింగు నీరవుఁడై నిలిచియుండెను. సూర్య రశ్మి యతని ముఖముపైఁ బడుచుండెను. ప్రభాత వాత మా తని శుక్ల కేశములను గదలించు చుండెను. వీరుఁడు దేవీసింగు పుత్రశోకమును నిశ్శబ్దముగా ననుభవించుచుండెను.

మెల్లన తేజసిం గతని సన్నిధికిఁ జని "ఆర్యా, తమను నే నేలాగున నూఱడింపఁ గలను ? బాలుఁడు మహారాణా వారి సేవలో బహిరంగ యుద్ధమున ప్రాణములు విడిచినాఁడు" అని పలికెను.

దేవీసింగు నిట్టూర్పు విడిచి "రాజపుత్రుల ధనము, బలము, పరివారము, ప్రాణము—సమస్తము మహారాణావా రివే. రాజకార్యమున చందనుఁడు మరణించినందులకు దుఃఖ ములేదు. ఈపాడుయుద్ధము వృద్ధుని విడిచి, కుఱ్ఱవాని నెత్తు కొని పోయినదే యని విచారించుచున్నాను !" అని యాఁక సముకంకఁ జూచి "వత్సా, చందనా ! నన్ను నీతో నేల కొని పోవైతివి !" అని యాక్రోశించెను.

దేవీసింగు నేత్రములనుండి కన్నీరు ప్రవహించుచుండెను. అతఁడు సామాన్యవ్యథ నొందు చుండుట లే దని భావించి, తేజసింగు వృద్ధుని హస్తమును దన శిరస్సుపై నుంచుకొని, "తాతా, మీపుత్రుఁ డొక్కఁడు పోయినాఁడు. ఇంకొకఁడు జీవించియున్నాఁడు ఆశీర్వాదము కొఱకు తేజసింగు మిమ్ము

ప్రార్థించుచున్నాఁడు. ఈపుత్రు నాశీర్వ దింపుఁడు ! ” అని వచించెను.

“ భగవంతుఁడు నిన్ను రక్షించుఁ గాక ! పితృసింహాసనము మీఁద నిలుపును గాక ! ”

“ దేవీసింహుని సాహాయ్యము లేకుండ నాయనగారి పీఠము నా కేలాగున లభించును ? మానాయనగారి పట్టాభిషేకమును జూచితిరి. నన్నుఁగూడ బీఠముపై నిలుపరా ? ”

దేవీసింగు కన్నీటిం దుడుచుకొని, దుఃఖము నెట్లో దిగ మ్రింగి, ఖడ్గము గట్టిగాఁ బట్టుకొని “ నాజీవితమున కింకొక యుద్దేశ మున్నది ! శపథమును విస్మరింప లేదు. ” అనెను.

౨౮

ఒకనాటి సాయంకాలమున తేజసింగు భిల్లసర్దారు భీమ చాందును జూడఁబోవుచుండ, హ్రదతటమున భిల్లబాలిక యతనికిఁ గానఁబడెను. ఆబాలిక నగుచు, గంతులు వేయుచు రాగము తీయుచు నతనిసమీపమునకుఁ జనెను.

“ మధుప మొక్కటియే గాక మారుతంబు
గూడ పుష్పరసంబును గ్రోలుచుండు. ”

తేజసింగు కుపితుఁడై బాలికచేతిని పట్టుకొని “ నీవు వాఁడ వయినపక్షమున నీయాచాపలమునకుఁ దగినశాస్తి చేసి చేసియుందును ! ” అనెను.

“నే నేమి చేసినాను? నన్ను విడిచిపెట్టు. ఇక నేను గీతము పాడను. గీతము పాడినప్పుడు నీకుఁ గోపము వచ్చు నని నా కేలాగునఁ దెలియును?”

“దుర్మార్గురాలా, ఎందు కీగీతము పాడినావు? పుష్పను నిష్కారణముగా నిందించితివేని యీవేళ నాచేతినుండి తప్పించుకొని పోలేవు!”

“పుష్ప యనగా నెవరు? నేను దరిద్రభిల్ల బాలికను నేను పూవులు కోయుచుందును, పుష్పసంబంధ మైన పాటలు పాడుచుందును. ఇతరుల సంగతి నా కేమి తెలియును? నన్ను విడిచిపెట్టు.”

బాలిక నిజముగా బాలికయేనా? కేవలము పుష్పసంబంధ మైన పాటలనే పాడుచుండెనా? తేజసింగున కాబాలికహృదయ మెన్నఁడును స్పష్టముగా నవగత మగుట లేదు. మెల్లగా నతఁడు లలాటమందలి స్వేదబిందువులను తుడిచికొని “నిష్కారణముగా గోపము తెచ్చుకొంటిని” అనుకొనెను.

“వింటి నొకమంచి సంగతి—వింటి నిట్లు:
జరుగ నున్నది యట పుష్పపరిణయంబు!”

అని కన్నియ నవ్వుచు, చప్పటలు చఱచుచు పాడెను.

“ఎవ్వనికిఁ బెండ్లి యగును?”

“మఱెవ్వరికి? తుమ్మెదకు—”

“పుష్పకుమారి నెవఁడు పెండ్లియాడునో విన్నావా?”

"నా కేలాగునఁ దెలియును? నీవు విన్నావా?"

"దుర్జయసింగు పుష్పకుమారిని వివాహమాడ యత్నించెను. కాని యామె సమ్మతింప లేదు. ఆ వివాహముకంటె మరణమే మే లనెను."

"నా కాసంగతి తెలియదు."

"ఏ సంగతి తెలియదు?"

"సంబంధము చెడిపోయె నన్నసంగతి."

"మఱి యేమని తెలిసినది?"

"దుర్జయసిం గెవతెనో వివాహమాడుట నిశ్చయ మనియు నింతలో మునల్మానులు సూర్యమహాలును ముట్టడివేసి రనియు తెలిసినది. మఱి—"

"మఱి యేమి?"

"మ తేమియు లేదు."

"అ దేమో చెప్పు! చెప్పనియెడల దెబ్బలు తిందువు."

"మఱి యాకన్య దుర్గమునుండి పాఱిపోవుటకు ముందు వరుస కొక యుంగర మిచ్చిన దట."

అతని నేత్రములు నిప్పులుగురిసెను. కాని తేజసింగు కోపము నణచుకొని "నీ వడవిదానవు, నీమీఁదఁ గోపము తెచ్చుకొని లాభము లేదు. ఎదుటినుండి దూరముగా పో!" అని చివాలున నామెను నీటిలోనికి విసరివైచెను.

కన్నియ యీఁదుచు నావలి కేగి, సిక్తకేశములతోను, నార్ద్రవసనముతోను, పెద్ద బండపై నిలిచి నవ్వుచు, నాకాశము మాఱుమ్రోఁగు నట్లు లీరీతిగాఁ బాడెను.

చాల నబ్బుర మా పెండ్లి జరుగఁ గలదు !
వరుఁడు వే ఱెవ్వఁడును గాఁడు—వాయురాజు !
మొదటినుండియు బెండ్లికై మొత్తుకొనెడి
బంభరకుమారుఁ డందులోఁ బాటగాఁడు !

తేజసింగు లేచి నిలువబడెను. ఆతనిమనస్సు చెదరియుండెను. ఇంతపర్యంత మతఁడు పుష్పకుమారుని నమ్మియుండెను. కాని యిప్పుడు భిల్లకన్యావాక్యములచే నతని కామెపై సందేహము కలిగినది. యుద్ధములు జరుగుచుండుటచే పుష్పకుమారితోఁ బ్రసంగించుట కతనికి వీలు దొరికినది కాదు. పుష్పకుమారి దుర్జయుని భార్య యగు నను ప్రవాదము తేజసింగున కనేకపర్యాయములు వినవచ్చుచుండెను. అతఁడు వ్యథ నొందుచుండెను.

తేజసింగు బయలుదేఱి పోవుచుండెను. భిల్లకుమారిగీత మింకను నతని కర్ణములందు ధ్వని చేయుచుండెను.

పుష్పకుమారీదేవి దుర్జయసింగునెడ నిశ్చయముగా ననురక్తయై యుండెనా ? తేజసింగును మఱచిపోయెనా ? దుర్జయున కామె యంగుళీయకము నిచ్చియుండునా ? తేజసింగు గుండెలు తటతటఁ గొట్టుకొనెను.

పుష్పకుమారి నాతఁడు మనస్సులో దర్శింపఁజొచ్చెను: ఆనేత్రములు, ఆముఖము, ఆపెదవులు, ఆమాటలు—సమస్తము గోచరించెను. పుష్పకుమారి యెప్పటికి, యెన్నటికిని చపల కానేరదు.

ఇంతలో కొన్ని సంగతులు తేజసింగు మనస్సులో మెలఁగఁ దొడఁగెను, హృదయాందోళనము మెండయ్యెను.

పర్వతము మీఁద మంచే ప్రకారముగా మెల్లన లేచి క్రమక్రమముగా విస్తరిల్లి, శైలమును సంపూర్ణముగా నావరించి, సూర్యుని గప్పివేసి, దిక్కుల నప్రసన్నము గావించి, పెద్ద మేఘరూపము దాల్చి, లోకమునకుఁ జీకటి నాపాదించునో, యా ప్రకారముగానే సంశయ మేఘము మెల్లగా నభివృద్ధి నొంది, నేఁడు తేజసింహుని ప్రసన్న హృదయము నావరించినది. ఆ యంధకారమున నతని ధీప్రభ నష్ట మయినది.

౨౯

పుష్పకుమారి రాజపుత్రకన్య. ఆమె తండ్రియు, తిలకసింహుఁడును ప్రాణస్నేహితులు. ఆకారణమున తిలకసింగు స్నేహితుని పుత్రికను దన కుమారునకు వివాహము చేయ నంగీకరించెను. పదేండ్ల బాలుఁడు నేడేండ్ల కుమారియు నొకనాడు కలిసికొనిరి. తోడనే వారికి బరస్పరానురాగము జన్మించెను.

శుభలగ్నము స్థిర మయ్యెను. సమస్త ప్రయత్నములును జరిగెను. అట్టి తరుణమున అక్బర్ షాహా చిత్తోడు ముట్టడి వేసెను. తద్రక్షణార్థము తిలకసింగు నతని మిత్రుఁడును జని, యుద్ధము నందు మడిసిరి. తరువాతఁ గొన్ని దినములకు తేజసింగు దుర్గభ్రష్టుఁడై, భిల్లుల నాశ్రయించెను.

ఏడుసంవత్సరముల బాలికయుఁ బదివత్సరముల బాలుఁడును ప్రణయ మన్న నేమియో యెఱుఁగుదురా? కాని, రాజస్థాన దేశస్థులు చిన్నతనము నుండియు నాడిన మాట తప్పఁగూడ దని నేర్చికొందురు. ఆ బాలిక సత్యమును మఱవలేదు. ఒకనాడు చూచిన బాలుని ముఖవైఖరి నా బాలిక త్వరలోనే మఱచి పోయెను: కాని తాఁ జేసిన వాగ్దానమును మాత్రము విస్మరింప లేదు.

తిలకసింగు వంశమును మిగుల నవమానించుటకై తేజసింగున కుద్దిష్టయైన వధువును దుర్జయసింగు బలవంతముగాఁ బెండ్లియాడ యత్నించెను. పితృమరణానంతరము పుష్పకుమారికి రక్షకులు లేరు. ఆయున్నవార లైనను దుర్జయసింగు పక్షావలంబులు, నుపజీవులు. దుర్జయసింగును వివాహమాడ వలసిన దని వా రామెను బలవంత పెట్ట సాగిరి. "నాభర్త మృతి నొందినాఁడు. నే ననాథను. కాబట్టి యన్న్యాశ్యము" అని పలికి పుష్పకుమారి సమస్తాభరణములను వివర్జించెను. అప్పటి కామె పంద్రెండేండ్లది.

చిన్నతనము నుండియు శారీరక పరిశ్రమచే మన దేహ ములు దృఢపడుచుండును. క్లేశములచేత మానసిక ప్రవృత్తులు బలపడి స్థిరప్రతిజ్ఞ కలవార మగుదుము. శిరస్నాయువులు స్ఫూర్తి నొందును. తలంపులకంటెను, దుఃఖములకంటెను మనస్సుకు మంచి శిక్షకుఁడు దొరకఁడు, మానసికదౌర్బల్యము నకుఁ దగిన చికిత్సకుఁడు లభింపఁడు. విచారము కమ్మరవాని వలె నిర్దయతో సబలముగా మాటిమాటికి హృదయమును మోదుచుండును. ఆయాఘాతములచే మనము భీతి నొందు దుము. ఆర్తనాదము చేయుదుము. కాని యాచింత దయ యనుమాట నెఱుఁగదు, తన పని మానదు. తుదకు మన మనస్సులు దృఢము లగును, మనోవ్యాపారములు స్థిరము లగును, ప్రతిజ్ఞలచంచలము లగును. క్లేశము లనుభవింపని వారిహృదయములు దుర్బలములై యుండును.

బాల్యము నుండియుఁ గష్టము లనుభవించుచుండుటచే నామె కోమలహృదయములు గట్టిపడి, యినుమువలె దృఢ మయ్యెను. తనవారల బెదరింపుల చేతను, పరిచారికల యుప దేశముల చేతను, దుర్జయసింహుని దూతికల ప్రలోభ వాక్య ములచేతను నామెమనస్సు చలింపకపోవుటయే గాక చిన్న నాటి ప్రతిజ్ఞ మఱింత బలపడఁ దొడఁగెను. దుర్జయసింగును పెండ్లియాడు మని లోకులు బోధించిన కొలఁది పుష్పకుమారి యావీరబాలుని నామమును భక్తితో స్మరింపఁ జొచ్చెను.

చుట్టముల నిందావాక్యముల నామె నిశ్శబ్దముగా సహింప సాగెను. ప్రతిజ్ఞను పలుమాఱు జపించుచు జనమధ్యముగఁ దిరుగుచున్నను తన నేకాకినిగానే భావించుచు, తోటలో కుసుమములు గోయుచు, మనోజ్ఞానములను వెలికి రానీయకుండ లోపలనే యణచుకొనుచుండెను. అభ్యాసమువలన సహింపరాని కష్టము లుండునా? పుష్పకుమారి పరుల చెలిమి నపేక్షించుట లేదు; ప్రియవాక్కుల నాకర్ణింప నభిలషించుట లేదు; భ్రుకుటీభంగములకు, మర్మభేదివాక్యములకును వ్యథ నొందుట లేదు. ఆమె బాల్యమున సత్యము నీతియును పరిపాలించెను. చీకటి పడిన కొలది దీపశిఖ తేజోవంత మగును; ఎల్లరు బాధింపఁ జొచ్చినకొలది తలిదండ్రులు లేని యాబాల పూనిక మఱింత నిశ్చలము కాసాగెను.

దుర్జయసింగు పలువిధములయాశలు చూచి పుష్పకుమారిని ప్రార్థించెను. దూతికలు శతముఖముల నతని విపులైశ్వర్యమును, పరాక్రమమును, యశస్సును వర్ణించుచుండిరి. సను సమి విని పుష్పకుమారి గంభీరముగా "నే ననాథను" అని ప్రత్యుత్తర మిచ్చుచుండెను.

ఈ సంగతుల నెఱింగి యామె చుట్టములు మిగుల నాగ్రహము నొంది పుష్పకుమారిని బెదరించియు, బలవంత పెట్టియు, బహుదినము లవివాహితనై యున్న పక్షమున స్వచ్ఛమగు వంశమునకుఁ గలంకము కలుగు నని బోధించుచుండిరి

సమస్తము విని పుష్పకుమారి గంభీరముగా "నే ననాథను" అని బదులు చెప్పుచుండెను.

తుదకు దుర్జయసింగా మెబంధుగులతో నాలోచనఁ జేసి యామెను సూర్యమహాల్ దుర్గమునకు రావించెను. దుర్జయుని యభిప్రాయమును గ్రహించి పుష్పకుమారి యివ్విధమున నాత నికి కబురంపెను:

"చోండావత్ ప్రభూ, మీరు విక్రమవిశాలురనియు, నేది చేయుటకైనను సమర్థు లనియు విన్నదానను. కాని మీతోడి వివాహమునకు ముందు పుష్పకుమారి యాత్మహత్య చేసికొనకుండ నివారింపఁగలరా ? తిలకసింగుగారిభార్యను వధించి యుంటిరని విన్నాను; మఱియొక స్త్రీహత్య చేసి పాతకమున కొడిగట్టుదురా ?"

## ౩౦

కొంతకాలము చనెను. ఒకనాడు చారణదేవుఁడొకఁడు వచ్చి, పుష్పకుమారితో "చిన్ననాడు మీరు చూచిన యా రాథోడ్ వీరుఁడు జీవించియున్నాఁడు. అతఁడు స్వదేశ సంరక్షణార్థము యుద్ధము చేయుచున్నాఁడు; చిన్ననాటి ప్రతిజ్ఞలు విస్మరింప లేదు" అని చెప్పెను.

స్వప్నమువలె నాచారణుఁడు వానిమాటలును నంతరించెను. కాని యావృత్తాంతమును మాత్రము పుష్పకుమారి

మఱచిపో లేదు. ఆమె హృదయమున నుల్లాసాంకుర ముద యించెను. ప్రభాతమున ప్రథమ కిరణముచే నెవ్విధమున నుద్యానకుసుమములు వికాసము నొందునో యవ్విధముననే చారణుని వాక్యములచే నామె యంతరంగమున నాశ మొలకెత్తెను.

ఎవ్వని నామమును స్మరించుచు నామె యింతవఱకును జీవించియున్నదో యట్టిప్రాణేశ్వరుఁడు సజీవుఁడై యున్నాడా! అతఁ డానవాలు నంపినాఁడు. చిన్ననాటి మాట మఱవ లేదు. ఇంకను సందియ మేల? పుష్పకుమారి బాల్యవృత్తాంతములను నామిత్రుని ముఖమండలమును జ్ఞప్తికిఁ దెచ్చుకొన యత్నించుచుండును. అతఁ డిప్పుడు బలము గలవాఁ డయి, దేశము కొఱకు యుద్ధము చేయుచున్నాఁ డని వినుటచే నామె యతని యున్నత శరీరమును, ముఖకాంతిని మానసచక్షువులతోఁ జూడఁ బాడుపడు చుండెను. అతని వదనము సరిగాఁ గానఁబడునది కాదు; అదే భావముతో నుండుటచేత నొకొక్కప్పుడు కొంచెము పొడకట్టునది. ఆవీరుఁడు నిండువెన్నెలలో నిలిచి, తనహస్తమును గ్రహించునట్లును, నతని పెదవులు తనకరమును మృదువుగా స్పృశించినట్లును పుష్పకుమారికి దోచుచుండును. కాని, యామూర్తి చారణ దేవునివలె నుండునే! ఏలనో?

పుష్పకుమారికి దుర్బుద్ధి లేదు. అంతరంగమున నాచిన్ననాటి స్వామినిదక్క మఱెవ్వరి నామె తలచుటయే లేదు.

అయినను, కల్పనాశక్తి మిగుల మోసగత్తె! ఏప్రదేశమును గూర్చి మాటిమాటికి వినుచుందురో యాస్థలమును జూడ కున్నను గల్పనాబలముచే నయ్యది మనోనేత్రమునకుఁ గానబడు చుండును. చూడనివారిని గూర్చి చెప్పగా విన్నదానింబట్టి చింతించిన కొలఁది మానసమున నొకా నొకరూపము ప్రతిష్ఠిత మగును. భావించినపురుషుని యాకృతి కన్నుల యెదుట నుండును. పుష్పకుమారి తనహృదయేశ్వరుని వదనమును భావించిన తోడనే చారణుని యాననము మనోగోచర మగు చుండును. తేజసింహుని పరాక్రమమును దలచు నప్పుడు చారణుని విశాలవక్షమును, నాజాను బాహువులును జ్ఞప్తికి వచ్చుచుండును. అతని కంఠస్వరమును భావింప నెంచునప్పుడు చారణుని వాఙ్మాధుర్యము కర్ణములలో ధ్వనిచేయును! పుష్ప కుమారి విశ్వాసఘాతుకరాలు కాదు. ఐనను తేజసింగును దలచిన తోడనే చారణునిమూర్తి కానఁబడును! ప్రత్యంశము చారణునితో నేకీభవించును!

పుష్పకుమారి చారణుని కొఱకుఁ బ్రతీక్షించుచుండెను. దినములు గడుచుచుండెను. మాసములు చనుచుండెను. రజత కాంతిని నిరసించుచు పండువెన్నెలలో నింక నాచారణ దేవుఁడు కనబడఁడాయెను. రాత్రివేళ నాకమనీయ కంఠము వినఁబడదాయె! తేజసింగును గూర్చి తెలుపువా రెవరు?

ఆకసమునఁ గాలమేఘముతో విద్యుల్లత విహరించులాగున

నాశయు నిరాశయు నామె మానసమున విహరింపఁజొచ్చెను. సమస్తము నామె నిశ్శబ్దముగా సహించుచుండెను.

ఆకస్మికముగా ముసల్మానులు సూర్యమహాలు నాక్రమించిరి. చీకటి పాటున నొకభిల్ల యోధ పుష్పకుమారిని స్థానాంతరమునకుఁ గొనిపోయెను. పిమ్మట నామె రాజకుటుంబములో జేరెను. అటు తరువాత నామె రాజకుటుంబముతోపాటు వివిధ ప్రదేశములందు నివసించెను. యుద్ధము నిలిచి యుండుటచే ప్రతాపునకుఁ గొంచెము విశ్రాంతి లభించినది. కాని యా రాజర్షి కుటీరమునందే నివసించుచుఁ గ్లేశము లనుభవించుచుండె. చితోడ్‌గడ్ స్వాధీనము కాకుండుటచే నతఁడు తాపసివలె కాలక్షేపము చేయుచుండెను. మహారాజ్ఞియు పుష్పకుమారియు నాకుటీరమునందేయుండిరి. ప్రతాపుని జీవితకాలములో చితోడ్ దుర్గమునురాజపుత్రులు జయింప లేదు. మహారాణా ప్రతాపసింగాపర్ణశాలయందే మరణించె నని రాజస్థానచరిత్రవలనఁ దెలియుచున్నది.

పర్ణశాలకు సమీపముగా సెలయేఱు ప్రవహించుచుండును. సాధారణముగా పుష్పకుమారి యచ్చటినుండి జలముఁ గొని పోవుచుండును. నేటి సాయంకాలమున నామె నీరు తేఁ బోయి, కలశమును గట్టుపై నుంచి, మబ్బులు గ్రమ్మియున్న నభోమండలముపైన దృష్టి నిగిడ్చెను. చాలసే పామె గగనము వంకఁ జూచుచుండెను. ఆమె యేమి తలపోయు చుండెనో!

ఇంతలో మేఘము గర్జిల్లెను. చప్పున నామె హృదయము దడ దడఁ గొట్టుకొన సాగెను. అంతలో దూరమున సంగీతము వినఁబడెను. ఆగాన మామె హృదయమును సంచలింపఁ జేసెను, వెనుకటి సంగతులను జ్ఞప్తికిఁ దెచ్చెను ఆశచే నామె మనస్సు విప్పారెను.

"చలచిత్తలు వనితలు; వా
రలకంటెను నీటిమీఁది వ్రాతలు, మెఱపుల్
చలనంబు నెఱుఁగ ననియెదు
పలుకు లసత్యములు కావు పరికించు నెడన్.

భువనమునం జంచల వ
స్తువు లన్నిటిఁ జేర్చి యొక్కచో, వ్రాయఁ దగున్
"జవరాలి సత్య" మంచును :
పురుషోణుల నెపుడు నమ్మఁబోకుము మనసా !"

పుష్పకుమారి స్తంభీభూత యయ్యెను. చారణుఁ డామె సమీపమునకు వచ్చి "ఈగీతము దేవిగారి మనస్సునకుఁ బట్టినదా ?" యని యామె నడిగెను.

కొంతతడవు మ్రాన్పడి యుండి, తరువాత నామె "చారణ దేవా, ఆపాట యర్థము నాకు బోధపడినది కాదు ! వెనుకటి సారి మీ రీలాటి పాట పాడలేదే !" అనెను.

ఆకోమల స్వరము నాకర్ణించినచోఁ బాషాణము కూడ ద్రవించి యుండును. కాని చారణుని మనసు కరగ లేదు. "గీతము నేను రచించినది కాదు" అని యతఁడు వచించెను

"మీకు కీర్తన నేర్పినవారు కుశలముగా నున్నారా ?"

"లేరు. వారు దుస్స్వప్నములచేఁ గలత నొంది యున్నారు. వారు తమ కిచ్చిన యానవాలును జూడఁగోరుచున్నారు"

పుష్పకుమారి భీతిల్లెను. చారణుఁ డిచ్చిన యుంగరము పోయినది! ఆమె దానిని మెడలోఁ గట్టుకొని జాగ్రతగా నుండెను. కాని భీమచాందు నివాసమునకు వచ్చినపిమ్మట నంగుళీయము కనఁబడ లేదు; ఎంత వెదకినను దొరక లేదు.

"ఆయంగుళీయక మెక్కడ ?" అని చారణుఁడు కోపముతో నామె నడిగెను.

పుష్పకుమారి మాటాడ లేదు.

"ఆయుంగర మెక్కడ ?" అని క్రోధ సంచలిత స్వరముతో చారణుఁడు పృచ్ఛ చేసెను.

పుష్పకుమారి యస్ఫుట స్వరముతో నిట్లనెను: "చారణ దేవా, ప్రమాదమును క్షమింతురు గాక! ఆవీరుని కేలాగునఁ దెలుపుదు—"

చారణుఁడు సింహనాదము చేసి "ఆయుంగర మెక్కడ ?" అని మూడవ పర్యాయ మామెను బ్రశ్నించెను.

“నేను దౌర్భాగ్యురాలను ఆయుంగరము పోఁగొట్టుకొన్నాను”

“దాసితో తేజసింహుని ప్రేమను బోఁగొట్టుకొన్నావు!”

చారణ వేషధారి యగు తేజసింగు మహావేగముగఁ గంటికిఁ గనఁబడకుండఁ జనెను!

౩౨

రాత్రి రెండుజాములవేళ తేజసింగు భీమగడ్ దుర్గమునకు మరలి వచ్చెను చంచలచిత్త యగు యువతి కోస మిన్నిదినములు వ్యర్థ పుచ్చితిని. ఇక దుర్గవిజయప్రయత్నము చేసెద నని తలపోసెను.

అర్ధరాత్రమున నల్వంకల సైన్యము రాశీభూతము కాఁజొచ్చెను. తేజసింగు వారలనడుమ కేగి “బంధులారా, శత్రులపైఁ బగదీర్చుకొను సమయము వచ్చినది! నావెంట రండు!” అని పలికెను.

తేజసింహుని యాగర్జనము విని, యాతని భ్రుకుటీభంగమును జూచినవారికి తిలకసింహుని వృత్తాంతము జ్ఞప్తికి వచ్చెను. నిశ్శబ్దముగా నెల్లరును సూర్యమహాల్ దుర్గమువైపు గాఁ జనిరి.

పర్వతములమీఁదుగను నుపత్యకల వెంటను నిశ్శబ్దముగా నారాత్రివేళ సైనికు లరుగుచుండిరి. తేజసింహుని సైనికు లొకసారి యడవినడుమగను, మఱియొకసారి మడువుప్రక్క

గను, నింకొకసారి పర్వతముమీదుగను బర్వతముక్రిందుగను జనుచుండిరి. సైన్యము నడుచుచున్నంతసేపు తేజసింగు నోటి వెంట మాట యెవ్వరు విన లేదు తిలకసింహుని కొమరుని హృదయమున రోషానలము ప్రజ్వరిల్లుచున్న దనియు, నిక దుర్జయునకుఁ బరిత్రాణము లే దనియు నెల్లరు భావించిరి.

తుదకుఁ సైన్యము సూర్యమహాల్ దుర్గము నెదుట నిలిచెను. పర్వతశిఖరము దుర్గమును గిరీటమువలె ధరించినట్లుండెను. ఆపర్వతము దుర్గము నాకాశపటమునఁ జిత్రింపఁబడినట్లు కాన్పించుచుండెను. నల్వంకలఁ బర్వతమాలయు నిరంతర పాదపశ్రేణియుఁ గానవచ్చుచుండెను. ఆరాత్రివేళ నాయంధకారములో సూర్యమహాల్ దుర్గము లోకమును బ్రశాంతముగ నున్నది తేజసింగించుక యాగి పిత్ర్యమైన దుర్గమును దూరమునుండి వీక్షించి తనలో "నాయనగారనుమతింతురు గాక! పదునెన్మిదిసంవత్సరముల ప్రవాసము తరువాతఁ గుమారుఁడు నేడు తనదుర్గమునఁ బ్రవేశించును!" అనుకొనెను.

నిశ్శబ్దముగా సైనికులు సూర్యమహాల్ దగ్గఱ నిలచిరి. ప్రశాంత విభావరియందుఁ బ్రమత్తుఁడై యుండు శత్రువుపైఁ బడ గొంద ఆలోచన చేసిరి. తేజసింగు భ్రుకుటీభంగముతో "తండ్రిదుర్గమునఁ బుత్రుఁడు తస్కరునివలెఁ బ్రవేశింపఁడు, రాజపుత్రుఁడు నిద్రించు శత్రువుపైఁ బడఁడు!" అని పలికెను.

పిమ్మట నుచ్చైః స్వరమున రణభేరి మ్రోగెను. ఆభాంకారమునకుఁ బర్వతములు ప్రతిధ్వను లీనెను. అంతట తేజసింగు "తిలకసింహుని పుత్రుఁడు నేఁడు తండ్రిదుర్గమునఁ బ్రవేశించును. చేత నైనవారు మార్గమునరికట్టుఁడు" అని మేఘగంభీర నిస్వనమునఁ బలికెను.

ఆభేరీ భాంకారము నాతనిగర్జనము నాకర్ణించినవారు తేజసింగుగతి నిరోధ మొనర్చుట మానవుల కసాధ్య మని తలచిరి. దుర్గముమీఁది కావలివాండ్రు భాంకారము నాకర్ణించి పరికించి చూడఁగా శత్రుసైనికులు చీమలబారువలె దుర్గము నారోహించుచుండిరి.

తోడనే వారు దుర్జయసింగున కీవృత్తాంతముఁ దెలిపిరి. ఆతఁడు లేచి దుర్గప్రాకారముమీఁద కరుదెంచి, కొలదిదినముల క్రిందట రాఠోడు చేసినప్రతిజ్ఞ నిర్వహించుట కేతెంచినాఁడని గ్రహించెను. "తిలకసింహుని కుమారుఁడా! బహుకాలము నుండి యీరోజుకొఱ కెదురుచూచుచున్నాను. నేఁడు హృదయశాంతి యగును. నీవో నేనో నేఁడు మరణింపవలెను. ఈ లోకములో మన కిరువురకును చోటు లేదు!" అని యతఁడు రోషముతో ననుకొనెను.

దుర్జయసింగు నాదేశప్రకారము రెండు వందల మంది యోధులు ప్రాకారమునుండి క్రిందికి దిగిరి. మిగిలినవారు

మార్గములో నుండిరి. దుర్గముగోడపై నల్వంకల కాగడాలు వెలిగినవి. ఆ కాంతి బహుదూరము వ్యాపించినది.

ఇక యుద్ధము చేయక పర్వతమారోహించుట పొసగదని తేజసింగు గ్రహించి గంభీరస్వరమున యుద్ధమునకాదేశమొసగి సైన్యమునకుఁ దానగ్రగామియై బల్లెము ఖడ్గమును బూని శత్రువులపై కుఱికెను.

అచ్చట పైనున్న కొద్దిసైనికులు క్రిందిబహు సైనికులను పైకెక్కకుండ నాపగలరు. కాని తేజసింగు నడ్డగించుటకు వీలులేక పోయెను. రాఠోడుసైనికులు దుర్గాంతమున ప్రతిహతము నగుపరాక్రమముతో చోండావతుసైనికులపైఁ గవియుట చూచి దుర్గవాసు లెల్లరు విస్మితు లయిరి. శీఘ్రముగఁ గోలాహలము చెలరేగెను. ఇంచుక సేపటిలో రెండువందల చోండావతులు వాయుతాడితపత్రములవలె యథాయథలయిరి. అనేకులు నిహతు లయిరి. కొందఱు శిలాఖండములవలెఁ బర్వతమునుండి క్రిందికి దొరలిరి. హతశేషులు ప్రాకారాభిముఖులై పరుగిడిరి. శవరాశిమీఁదుగా తేజసింహుని రాఠోడుసైనికులు సింహనాదము చేయుచుఁ జనిరి.

పైనుండి దుర్జయసింగిది యంతయు విలోకించి నిశ్శబ్దముగా సైన్యముతోఁ బ్రాకారముమీఁద నిలిచెను. అతఁడు పండ్లు బిగబట్టి యుండెను. నేత్రములనుండి విస్ఫులింగములు రాలుచుండెను "తిలకసింగు కుమారుఁడు తండ్రివలె యుద్ధము

చేయ నేర్చినాఁడు. అయినను దుర్బలహస్తముతో దుర్జయ
సింగు ఖడ్గము పట్ట లేను. వీరపుత్రా, నేను నీయుద్ధవాంఛ
తుద ముట్టించెద !" ననుకొనెను.

ఇంతలో తేజసింగుసేన ప్రాకారము దగ్గఱకుఁ జనగా మరల
యుద్ధ మారంభ మయ్యెను. రాథోడులు గోడ దుమికి లోనికిఁ
బోవ యత్నించిరి. చోండావతుల బల్లెములు త్రిప్పుచు వారి
నరికట్టుచుండిరి. తేజసింగుసైనికులు కొందఱు గోడపై కెక్కిరి.
దుర్జయునిసైనికులు కొంద ఱుత్సాహముతో గోడమీదినుండి
క్రిందికి దుమికి యుద్ధము చేయఁ జొచ్చిరి. వెంటనే యుభయ
పక్షములకుఁ బ్రచండయుద్ధ మారంభ మయ్యెను. రాత్రివేళ
దివిటీల వెలుతురులో శత్రుమిత్ర భేదము లేకుండఁ బోయెను.
రక్తము ప్రవహింప సాగెను. శవములపై నిలుచుండి సైనికులు
పోర సాగిరి సింహనాదములం దార్తుల దీనస్వరము మగ్న
మయ్యెను. బహువత్సరములనుండియు వైరభావము వారల
హృదయములఁ బ్రజ్వరిల్లుచున్న ట్లుండెను. క్రోధముచే వారు
కలగుండువడి యుద్ధరంగమును బర్వతములను దద్దరిల్లఁ జేయు
చుండిరి. చోండావతులు మాటిమాటికి సాలుంబ్రా దుర్జయ
సింగుల నామములు భయంకరముగా నుచ్చరించుచుండ,
రాథోడు లాధ్వని మించునట్లు జయమల్లు తిలకసింహుల నామ
ధేయము లుచ్చైః, స్వరమున నుగ్గడించుచుండిరి. నిశాయుద్ధ
మునకుఁ జుట్టుపక్కల పర్వతవాసులును సమీపప్రదేశవాసు

లును దద్దరిల్లి, నేఁడు తిలకసింగు పుత్రుఁడు తండ్రిదుర్గమునఁ బ్రవేశించుచున్నట్లు గ్రహించిరి.

ప్రాకారముప్రక్కఁ గోలాహల మాకాశ మంటునట్లు యుద్ధ తరంగము లుప్పొంగెను తేజసిం గందుఁ జొరక యేకాగ్ర చిత్తమున మహాబలముతోఁ గోటతలుపులు బ్రద్దలుచేయ యత్నించుచుండెను. ద్వారము పెద్దమ్రానికఱ్ఱతోఁ జేయ బడినను తేజసింహుని కుఠారాఘాతములకు దడదడలాడఁ జొచ్చెను ఇంతలో బ్రచండనాదముతో ద్వారము భగ్నము కాగా రాథోడులు సింహనాదము చేసిరి.

ద్వారమును రక్షింపనిచో దుర్గము దక్క దని తెలిసికొని దుర్జయసింగు స్వయముగా భగ్నద్వారముకడ కేతెంచి శత్రు మార్గము నిరోధింప యత్నించెను. దుర్గమందలి సాహసులు బలవంతులు నగు చోండావతు లెల్లరుఁ బ్రభువుచుట్టు మూగిరి. తేజసింగు, తద్భటులును మార్గము చేసికొనపోవఁ బ్రయ త్నించుచుండిరి.

అప్పుడు రెండు ప్రక్కలనుండి యుత్తాలతరంగములు రెండు పరస్పరము కొట్టు కొన్నట్లుండెను. ఉభయ పక్షము లవా రన్యోన్యవేగముచే స్తబ్ధులయిన ట్లుండిరి. ఎవరును ముందునకుఁ గాని వెనుకకుఁ గాని పోవకుండిరి. లెక్క లేని శవము లాద్వారముకడ రాశీభూతము కాఁ జొచ్చెను. వాని పై నిలిచి యిరుపక్షములవారును పోరు సల్పుచుండిరి. దుర్జ

యసింగానాడు యథార్థముగా యోధృనామము నిలుపు
కొనెను. ఆతని శరీరము నెత్తుటఁ దడిసియుండెను కన్నులు
నిప్పులు గురియుచుండెను. ఆతఁడు భయంకరముగాఁ బ్రతిజ్ఞ
చేసి, ద్వారము రక్షించుచు నానురబలముతో శాత్రవులను
బ్రతిహతులం జేయుచు సింహనాదముతోఁ దన సైనికులను
బ్రోత్సహించుచుండెను. కాని నేడు తేజసింగు దైవవరమున
బలిష్ఠుడైన ట్లున్నాఁడు. ఆతని గమన మడ్డగించుట మానవుల
కసాధ్యము! అతిమానుషబలముతో నతఁడు శత్రువులను
బ్రతిహతులంజేసి సింహనాదముతో ద్వారమునఁ బ్రవేశించెను.

ఆతని డాలు నెదుం నేదో మంత్రబలముచే మానవబల
మాగిపోవుచున్న ట్లుండెను ఆ మహావీరుని నేత్రద్వంద్వము
జాజ్వల్యమానమై యున్నది. ఉష్ణీషము, శరీరమును రక్తసిక్త
ములై యున్నవి. పాల్పాంశు వగు బారుటీలు గుడిచేతఁ
ద్రిప్పుచు తిలకసింహుని పుత్రుఁడు తండ్రిదుర్గమునఁ బ్రవే
శించెను.

భూమ్యాకాశములు కంపించునట్లు మహా కోలాహలముతో
రాథోడుసైనికులు పదునెనిమిది వత్సరముల తరువాత సూర్య
మహల్ దుర్గమునఁ బ్రవేశించిరి.

ద్వారము భగ్నమై రాఠోడులు మహా కోలాహలముతో దుర్గములోఁ బ్రవేశించినపుడు దుర్జయసింగించుక చింతా క్రాంతుఁడై మెలమెల్లన లలాటమందలి స్వేదమును రక్తమును దుడుచుకొని, రాఠోడ్ చోండావతుల యుద్ధము ముహూర్త మాత్రము విలోకించెను.

ఇంతలో తేజసింగు కనబడగా దుర్జయసింగు దృఢస్వరమున నతనితో "రాఠోడ్‌వీరా, నీయుద్ధమునకు సంతోషించినాను. నీతండ్రి బాహువులందువలె నీబాహువులయందు నసామాన్య శక్తి యున్నది. కాని, యీసారి జాగ్రత!" అని హెచ్చరించెను.

"చోండావతులారా, మనదుర్గము పోయినది, కాని యభిమానము పోవ లేదు. రాజపుత్రుల గౌరవము రక్షింపుఁడు! చోండావతుల గౌరవము మీ చేతులయందున్నది" అను దుర్జయుని వాక్యము లాకర్ణించి భూమ్యాకాశములు కంపించునట్లు చోండావతు లెల్లరు సింహనాదము చేసిరి. ఇంకను రాఠోడుల విజయము సంశయగ్రస్తమనియు, చోండావతులు ప్రాణములు విడుతురు గాని నేటియుద్ధమునఁ బరాభవము నొల్లరనియు దోచెను.

నిరాశాబలముచే బలిష్ఠులై భగ్నసేతువు జలతరంగములపైఁ బడునట్లు చోండావతు లీపర్యాయము రాఠోడులపైఁ

బడిరి. ఇక రాఠోడులు ముందునకుఁ బోవలేక సముద్రతరంగ ములవంటి చోండావత్తరంగములయెదుట వెనుకడుగు వేయ సాగిరి.

పర్వతదుర్గము మాటిమాటికిఁ గంపించునట్లు రోషముతో మహావీరుఁడు తేజసింగు సింహానాదము చేయుచుఁ దన నిడివి బల్లెమును ద్రిప్ప నారంభించెను. మరణమందుఁ గృతసంకల్పు లగు చోండావద్వీరులు కంపించ లేదు. క్రమముగా రాఠోడులు వెనుకడుగు వేయ సాగిరి.

ప్రభువు నుత్సాహముచే రాఠోడు లుత్సాహితులై రాక్షసులవలె యుద్ధము చేయ సాగి మాటిమాటికి చోండావ న్మండలిపై వేగముతోఁ బడుచుండిరి. సారెసారెకు శత్రు వేగము నరికట్టుటకై ప్రయోజనము లేకపోయెను. అల్పసంఖ్యాకు లయ్యుఁ గృతసంకల్పు లగు నా శత్రువులు దైవవరముచే బలిష్ఠు లయిన ట్లుండిరి. వారి గమనము నిరోధించుట మానవుల కసాధ్యముగ నుండెను. శత్రుగమనమున కాటంకము కలుగ లేదు. రాఠోడులు వెనుకడుగు వేయుచుండిరి.

"తిలకసింహుని కొమరుడు తిలకసింహుని దుర్గమునఁ బ్రవేశింప నుండగా సైనికులారా, యెచ్చటికి వెనుకకుఁ బోవు చున్నారు ?" అని వృద్ధ రాఠోడు దేవీసింగు ఖడ్గహస్తుఁడై శత్రుమధ్యమునకుఁ గుప్పించి దుమికెను. అతనిని రక్షించుటకై రాఠోడు లెల్ల రీసారి ముందునకు దుమికిరి. ఇంచు మించుగా

చోండావతు లెల్లరు నిహతు లయిరి. యుద్ధము సమాప్త మయ్యెను.

నెత్తుటఁ దడిసిన వృద్ధదేవీసింగు తటాకంత తేజసింగు చేయి పట్టుకొని "తేజసింహా, నా సంకల్ప మీడేఱినది! ఇంక నాకు సెల వియ్యుము! తండ్రివలె యశస్వివి కమ్ము! ఇదియే నా యాశీర్వచనము!" అనెను.

దేవీసింహుని కళేబరము నేల రాలెను. గుఱి తప్పని దుర్జయుని బల్లెముతో నాతని యురమ్ము విద్ధమై యుండెను.

యుద్ధముముగిసెను. దుర్జయసింగు నతనియనుచరులు కొలది మందితప్ప తక్కిన చోండావతు లెల్లరు మడిసిరి. దుర్జయుని ఖడ్గము విఱిగినది, ముఖము నెత్తుటఁ దడిసినది, నేత్రములనుండి యగ్నికణములు రాలుచున్నవి. చోండావద్వీరుఁ డింకను యుద్ధమునకు సిద్ధముగా నున్నాఁడు. రణపిపాస యాతని కింకను శమింపలేదు.

దుర్జయసింగు ప్రాణము లెవ్వరు తీయరా దని తేజసింగిది వఱకే యెల్లర కాజ్ఞాపించి యుండెను. కాని రాఠోడు లెల్లరు జిఘాంసచేఁ గలగుండు వడుట చూచి, మరల నిప్పుడు తేజసింగుచ్చైఃస్వరమున "దుర్జయసింగు శరీరముపై శస్త్రమిడువాఁడు నాకుఁ బరమశత్రు!" వని యాక్రోశించెను.

రాఠోడులు శాంతించిరి. ఆ ప్రశాంతి నడుమనుండి యొకానొక స్వర మిట్లు వినవచ్చెను: "ప్రభువువారి యానతి శిరసా

వహింపఁ దగినది. కాని, మంటవలెఁ బుత్రశోకమున కడుపు
దహించుకొని పోవుచున్నది ! వీఁడు నాపుత్రహంత !"

క్రోధప్రేరితుఁ డగు వృద్ధగోకులదాసు క్షణములో దుర్జయ
సింగుపైఁ బడి బాకుతో నతనియురమునఁ బొడిచెను. దెబ్బ
తినుచు దుర్జయసింగు భగ్నఖడ్గముతో గోకులదాసు శిరముపైఁ
బ్రచండముగా దెబ్బ దీసెను. మృతదేహములు జంటగా
నేలపై రాలినవి. నేటికి గోకులదాసుని పుత్రశోకము చల్లాఱినది !

## ౩౮

సంధ్యాసమయమున పువ్వుకుమారి నీరు దెచ్చుటకు సెల
యేటికిఁ జనెను. ఆమె పూర్వమువలెనే దుఃఖము సహించు
చుండెను. ఎంత బాధ నొందుచున్నను నామె కన్నీటిచుక్క
విడిచి యెఱుఁగదు. ఎవ్వరితోడను స్నేహము చేయఁగోరలేదు.
ఎవ్వరును దన్ను దయదలచ వలెనని భావింపలేదు.

ఆమె ముఖమండలము కొంచెము పాండువర్ణమును దా
ల్చెను, నేత్రయుగ్మము తేట తగ్గి యుండెను. ఏదో గభీర
చింత యామె యాననము నాచ్ఛాదించి యున్నట్లు చూచు
వారికిఁ దోచును.

సంధ్యాసమయమున నామె మంచినీరు తేఁబోయెను.
ఆమె ప్రవాహ తీరమున నడుచుచుండగా వెనుక కొళభిల్లకన్య

మెల్లన వచ్చుచుండెను. పుష్పకుమారి వెను దిరిగి చూచి "అమ్మాయీ, ఆపత్కాలమున నీతండ్రి మాకు జో టిచ్చెను. మహారాణా వా రాసంగతి యెన్నటికిని మఱచిపోరు. నీవు రాణిగారిని దర్శింప వచ్చినావా ?" అని యడిగెను.

"ఈ నది యొద్దున తోటలో సంపంగి పూవు కోసి కొని పోవచ్చితిని. నా కొక పుష్పము నిత్తురా ?"

"తీసి కొని పో !"

"దేవీ, మీముఖము పాలి యున్న దేమి ?"

"ఏమో !"

"నే నెఱుఁగుదును"

"ఏమి యెఱుఁగుదువో ?"

"మీముఖము పాలిపోవుటకుఁ గారణము."

"ఎందుచేత ?"

"ఏదో వస్తువు పోఁగొట్టు కొన్నారు. ?

"ఏవస్తువు ?"

"బంగారు నగ, హారము, ఉంగరము—ఏదో యొకటి."

పుష్పకుమారి యులికిపడి, పిమ్మట మెల్లగా "ఔను ! అమ్మాయీ, ఉంగరము పోఁగొట్టుకొని దానితో రత్నమును గూడఁ గోల్పోయినాను !" అనెను.

"అందుకయి దుఃఖమా ! ఉంగరము పోయిన, మరియొక యుంగరము వచ్చును."

" అంగుళీయము పోయిన మఱి యొకటి రాఁగలదు. కాని, పోయిన రత్న మీజన్మలో లభింపదు ! "

" ఏలాటి రత్నము ! ముత్తెముల దండ ? హృదయముసఁ దాల్చు పదార్థమా ? "

" అగును ! హృదయమునఁ దాల్చుపదార్థమే ! కాని, ముత్తెముల దండకంటె మిక్కిలి విలువ గలది. అమూల్యము! "

" ఏ మయి యుండును ? "

పుష్పకుమారినేత్రమునుండి బాష్పకణము జాఱి నేలపై బడెను. భిల్లకన్య సంపంగిపుష్పమువంకఁ జూచుచున్నట్టు లుండి తానుగూడఁ గన్నులు మూసికొనెను. కొంతతడవున కామె " అమ్మగారూ, సంపగిపూవును గోసి యిచ్చిన పతము న మీరత్నమును వెదకెదను. నే నడవులలోఁ దిరుగుచుం దును. రత్న మొకవేళ దొరకినను దొరకవచ్చును. " అనెను.

భిల్లకన్య చాపలము గ్రహించి, పుష్పకుమారి యేమియుఁ బలుకక, చంపకప్రసూనమును గోసి యామె కిచ్చెను. భిల్ల కుమారి గంభీరముగా " దేవు పుష్పకుమారీ దేవిగారికి మఱల రత్నము లభింపఁ గలదు ! " అని పలికెను.

మఱునాటి యపరాహ్ణమున పుష్పకుమారికి రత్నము లభించెను ! సూర్యమహల్ దుర్గాధిపతి యగు రాథోడ్ తేజసిం గామెను బ్రతిమాలుచుండెను ! ఆమె హస్తయుగ్మము కన్నీటిలోఁ దడిసిపోవుచుండెను.

వారిరువురి వివాహము మహావైభవముతో జరిగెను. మహారాణా స్వయముగా వివాహమునకు విచ్చేసెను. పాలేశ్వరీదేవి ముత్తెములదండను పుష్పకుమారి మెడలో వైచెను.

వధూవరుల సుఖమునకు మేర లేకపోయెను. తేజసింగు ప్రణయకటాక్షముతో "పుష్పా, ఒకనాడు నీయెడ నను మానము నొంది నీకుఁ గష్టము కలిగించితిని ఆసంగతి మఱచితివా ?" అనెను.

"అందు మీదోసము లేదు. అది నాదుష్కర్మ ఫలము. ఆయుంగర మేలాగునఁ బోయినదో ?" అని పుష్పకుమారి కొంచెము కంటితడితోఁ బల్కెను.

"పుష్పా, నీయజాగ్రతవలన నాయుంగరము పోలేదు."

"మఱి యేలాగునఁ బోయినదో ? దొరకినయెడల దాని నెన్నటికిని విడిచి యుండును."

తేజసింగు తనయంగీలోనుండి యంగుళీయమును దీసి, పుష్పకుమారి హస్తమునం దిడెను. పుష్పకుమారివాక్కు స్తంభించెను, కన్నులు బాష్పవర్షము గురిసెను.

పిమ్మట తేజసింగు భార్య నూఱడించి, యుత్తరము నామె చేతిలోఁ బెట్టెను. చూడగా నది భిల్లకుమారి పంపినట్లు తెలియ వచ్చెను. అంత నామె యీలాగునఁ జదివెను :

"సింగుజీ, ఒకనాడు మీయుంగరము పోయిన సంగతి జ్ఞాపకమున్నదా ? ఆరోజున మీరు ఉంగరము దొరకిన యెడల

నీదే ? అని చెప్పినారు. పుష్పకుమారీదేవిని మహారాజ్ఞి గారిని మాయింటి కొకనాడు తీసికొనివచ్చినారు. ఆదినమున పుష్ప కుమారి నిద్రించుచుండగా నుంగరమును భిల్లబాలిక దొంగి లించినది.

"నే నిట్లు భావించితిని. పుష్పహస్తమున కయిదు వ్రే ళ్ళున్నవి. నాచేతికి నయిదు వ్రేళ్ళున్నవి. ఆమె యుంగరమును బెట్టు కొన్నపక్షమున నేనుమాత్రము పెట్టుకొనఁగూడదా ? రాజపుత్రులు, భిల్లులు — ందఱు నొకసృష్టిలోని వారయి నప్పు డుంగరముపై నామె కధికార మున్నప్పుడు నాకుమాత్ర మధికారము లేదా ?

"కాని, నేను సంగతులను గ్రహించుటలో భ్రాంతి పడి యుండవచ్చును. మీరు కాననకుసుమమును గోరక, యారా మకుసుమము నిచ్ఛగించి యుందురు ఆ రాత్రి యుద్యాన పుష్ప మనియే పుష్పకుమారి కుంగరము నొసఁగితిరి. అరణ్య పుష్ప మనియే కాబోలు భిల్లకన్యకు దాని నీయురైతిరి!

"నేటిసంజవేళ పుష్పకుమారిని జూడఁ బోతిని. ఆమెకడ నుండి రెండుపుష్పములను దీసికో నెంచితి. మీ రామె కిచ్చిన యంగుళీయములో రత్నమును నయిత మిచ్చితి రఁట. నా కుంగరము దొరికినది. రత్నము లభించినది కాదు.

"రత్న మమూల్య మని యామె చెప్పినది. అట్టిసందర్భ మున ఉంగరము నుంచుకొన్న లాభ మేమి ? ఈవస్త్రవాహకుని

ద్వారా అంగుళీయమును బంపితిని. ఆమెవస్తువు నామెకుఁ జేర్పుఁడు.

"పుష్పకుమారితో రత్నమును వెదకి యిచ్చెద నని చెప్పి నాను. కాని యెంత వెదకినను నది లభింప లేదు. నా కట్టి భాగ్యము లేదు. మీరు పుష్పదగ్గఱనుండి దానిని దీసికొన్న పత్రమునఁ దిరుగ నామె కిచ్చివేయ వలెను."

ఈ పత్రికను మూఁడు పర్యాయములు చదివి. పుష్పకుమారి మందహాసముతో "ఆముగ్ధబాలిక యుంగరము సుందరముగా నుండుటచే హరించినది!" అని పలికెను.

భిల్లకన్య పుట్టినింటనే నివసింపఁ జొచ్చెను, గాని గృహ కృత్యములను నిర్వహించునది కాదు. ఆమె సర్వదా పర్వత ములమీఁదను, గాననములందును బరిభ్రమించుచుండును. ఒం టిగా హ్రదతటమునఁ గూరుచుండి, పాటలు పాడుచుండును. భిల్లాంగన లామెను దిట్టుచుండువారు. స్వభావమును, వర్తన మును గ్రహించి యామె నెవ్వఁడును బెండ్లి యాడ లేదు.

ఆప్రదేశమున బహుదినముల వఱకు నర్ధరాత్రమున సంగీత ధ్వని వినఁబడుచుండెను. ప్రత్యూషమునం దప్పుడప్పుడు బాట సారులకు హ్రదతటమున బిందువదనయు, నుజ్జ్వలనయనయు నగు యువతి కానఁబడు చుండెడిది. ఆమె పిశాచాంగన యని లోకులు వాకొను చుండెడివారు.

3x

౧౫౯౭ సంవత్సరమున ప్రతాపుఁడు మృతి నొందెను. అటు తరువాత అక్బరు చక్రవర్తి యించు మించుగా నెనిమిది సంవత్సరములు రాజ్యము చేసెను. అతఁడు జీవించి యుండగా మేవాడ్ దేశమును జయించుట కెట్టి యత్నము జరుగ లేదు.

జహాంగీర్ సింహాసన మెక్కి, మేవాడ్ జయించుటకై ప్రయత్నము చేయసాగెను. ప్రతాపుని పదునేడుగురు బిడ్డలలో మొదటివాఁ డగు అమరసింగు తండ్రి తరువాత సింహాసన మధిష్ఠించెను. ప్రతాపుఁడు మరణించునప్పుడు అమరసింగును బిలిచి, ఢిల్లీతో నెల్లప్పుడు యుద్ధము చేయుచుండుమని యాన తిచ్చెను. అట్లే చేయుదు నని కుమారుఁడు తండ్రి సన్నిధిని బ్రతిజ్ఞ చేసెను. శ్రీ లగునంతవఱకు జనకునియానతిని కుమారుఁడు నెఱవేర్చెను. అనంతము లగు జహాంగీరుసైన్యములతో అమరసింగు పదునాలుగు సంవత్సరములు యుద్ధము చేయుచు, మొగల్ సేనల నోడించుచు దేశమును సంరక్షించెను. ప్రతాపుని సోదరుఁ డగు సాగరజీని జహాంగీరుచక్రవర్తి యభిషేకించి చితోడుకు రాజుగాఁ బంపెను. అన్నకుమారుఁడు స్వదేశముకై యుద్ధము చేయుచుండగా తాను మొగల్ దాసుఁడై చితోడు నేలుచుండె ననుచింత దుర్భరము కాగా సాగరజీ చితోడుమర్గ మమరసింగున కర్పించి, జహాం

గీరుసన్నిధికిఁ బోయి రోషాభిమానములచే నాత్మహత్య చేసి కొనెను.

ఇంతకాలమునకు చిత్తోడుదుర్గము లభించినది. కాని యిఁక మొగలులతో యుద్ధము సాగించు టసాధ్యము. ప్రతియుద్ధము నందును అమరసింగునకు సైన్య ధనములు నష్టములగుచుండెను. అతఁడు విజయము నొందినను, కలిగిన నష్టములు పూడుట లేదు. మానవున కెంతవరకు సాధ్యమో యంతవఱకు కమరసింగు ప్రయత్నము చేసెను. తుదకు ౧౬౧౩ సంవత్సరమున నతఁడు మొగలుల యాధిపత్య మంగీకరించెను! పాదుషా కుమారుఁ డగు సుల్తాన్ ఖురం సన్నిధి నతఁడు సామంతు డయ్యెను. తరువాతఁ దనపుత్రుఁ డగు కరుణసింగును జమీరాతులో నున్న జహాంగీరు శిబిరమునకు సుల్తాన్ వెంటఁ బంపెను. సుల్తాన్ ఖురం (తరువాత షాహె జహాన్ అను పేరిట పాదుషా యయ్యెను) యువరాజు కరుణసింగును వెంటఁ గొని అజమీరు కరిగెను. ఇంతకాలమునకు మేవాడ్‌లో బడుటచే జహాంగీరు కెంతయు సంతోషము కలిగినది. అందుచే యువరాజును పాదుషా సాదరముగా నాహ్వానించి తన సింహాసనమునకు కుడిప్రక్కన పీఠము వేయించి యమూల్యపదార్థములు పారితోషికముగా నొసఁగి దనవెంట నూర్జహాన్ మహారాజ్ఞి కడకుఁ గొనిపోయెను.

నూర్జహాన్ పేరు జగద్విఖ్యాతము. ఆమె యెంత చక్క నిదో అంత బుద్ధిమంతురాలు. తన యత్యంత రూప లావణ్య చాతుర్యములచే భర్తను వశంవదుని గావించుకొని యసాధా రణ మైన బుద్ధిబలముచే సమస్తభారతవర్ష శాసనకార్యములు నిర్వహించుచుండెను.

నూర్జహాన్ కరుణసింగును సాదరముగా నాహ్వానించి ఖిల్లత్, ఏనుఁగు, గుఱ్ఱము, ఖడ్గము మొదలగు కానుక లిచ్చి, యాతనికి మనఃప్రీతి కావించెను. చక్రవర్తియు మహారాణియు బహువిధముల యువరాజును సన్మానించిరి. కాని, ప్రతాప సింహుని మనుమని ముఖమున వికాసము లేదు. ప్రాతః స్మరణీయుఁ డగు ప్రతాపసింగు స్వాతంత్ర్యప్రభువు. కాని అమర సింహకరుణసింహులు నేఁడు సామంతు లయినారు! అజమీా రులో మహావైభవము నడుమ కరుణసింహుని లలాటము చింతాక్రాంతమై బొమముడిపాటుతో నుండెను.

ఇవ్విధముగా సన్మానించి బహుమానము లొసఁగి చక్ర వర్తి కరుణసింగును వీడ్కొలిపెను. ఈసందర్భమున కరుణ సింగుకు పన్నెండు లక్షలరూపాయలు, నూటపది గుఱ్ఱములు, అయి దేనుఁగులు బహుమాన మిచ్చినట్లు జహాంగీరు తన చరిత్రలో వ్రాసెను. సుల్తాన్ ఖురం వేఱుగా బహుమతు లొసఁగెను.

కరుణసింగు సెలవు తీసికొని స్వదేశాభిముఖుఁడై వెడలెను. ఆనాఁటి కోలాహలము సాయంసమయముతో ముగిసినది. రాత్రివేళ జహాంగీరు నూర్జహాన్ దగ్గఱకుఁ బోయి చిఱునవ్వుతో "కరుణసిం గెన్నఁడు మన దర్బారు చూడలేదు. కావున లజ్జాళువై సర్వదా నతశిరస్కుఁడై యుండెను!" అని పలికెను. లావణ్యమూర్తి నూర్జహాన్ మందహాసము చేసి, విశాలనేత్రములతో జూచి, "అది కాదు, మనసేనల మేవాడ్ స్వాధీన మయినది, కాని అఖండస్వతంత్రు లగు శిశోదీయుల కింకను పారతంత్ర్య మభ్యాసము కాలేదు!" అన్నది.

నూర్జహాన్ మాట యథార్థము. ప్రతాపసింగు కుమారుఁడు అమరసింగు పారతంత్ర్యము సహింప లేకపోయెను సుల్తాన్ ఖుర్రం చక్రవర్తి ఫర్మానా నొసఁగుట కేతెంచి నప్పుడు అమరసింగు దానిని స్వీకరింపఁ జాలకపోయెను. సుల్తాన్ ఖుర్రం మానసింగుకు మేనల్లుఁడు, రాజపుత్ర స్త్రీకి జన్మించినవాఁడు, రాజపుత్రుల నెట్లు సన్మానింప వలెనో యతనికిఁ దెలియును. అతఁ డమరసింగున కిట్లు కబు రంపెను: "నేను మహారాణా వారితో కేవలము బాంధవ్యము కోరుచున్నాను. మ రేమియు నక్కఱ లేదు. మహారాణావారు రాజధానినుండి వెలుపలికి వచ్చి, ఢిల్లీచక్రవర్తి ఫర్మానా మాత్రము స్వీకరింపుఁడు. నేను మేవాడ్ దేశమునుండి మొగల్ సేనల నన్నిటిని తొలఁగించి తీసికొని పోవుదును."

లోబడిన రాజు నెవ్వరు నింతగా సన్మానింపరు. అయినను మహారాణా విజితుఁడు; ఇప్పుడు ఢిల్లీ పాదుషా ఫర్మానా బలముచే దేశము పాలింపవలసి యుండును. ఈయూహా లమరసింగుకు దుర్భరము లయ్యెను. తండ్రికడఁ జేసినప్రతిజ్ఞ యతనికి జ్ఞప్తికి వచ్చినది. అమరసింగు ఫర్మానా గ్రహింప లేదు.

మహారాణా తనయోధులను సభాభవనమున కాహ్వానించెను. చవ్హాణ్, రాఠోడ్, ఝాలా, ప్రమర్, సిసోదియా వంశస్థులు రాజసభకు విచ్చేసిరి. తేజసింగు కూడ నేతెంచెను. ఇప్పు డాతని కేఁబది సంవత్సరములు దాటినను శరీరము పూర్వమువలెనే తిన్ననై బలిష్ఠమై యున్నది. ఆతని ప్రక్క కుమారుఁడు గజపతిసింగు కూరుచుండెను.

దూత యరుదెంచి సుల్తాన్ ఖుర్రం కోటవాకిట నున్నాఁడనియు, మహారాణావారచటికిఁ జనినయెడల ఫర్మానా నొసఁగి ఢిల్లీనగరమున కరుగు ననియు విన్నవించెను. సభాసదు లెల్లరు నిర్వాక్కులు నిస్తబ్ధులు నయిరి. కొంతసేపటికి యోధు లెల్లరు చూచుచుండ మహారాణా లేచి కుమారుఁడు కరుణసింగులలాటమున రాజటీక నుంచి యిట్లనెను: "ప్రతాపసింహుని పుత్రుఁడు తండ్రిసన్నిధిని జేసినప్రతిజ్ఞను విస్మరింప లేదు. పరులకు లోబడి రాజ్యము చేయనేరఁడు. నేఁటి

నుండి యువరాజు ప్రభువు. నేను వృద్ధుఁడను. వానప్రస్థాశ్రమ మవలంబించినాను !”

ఆహాఁడే (౧౬౧౬) అమరసింగు రాజధాని యగు ఉదేపురము విడిచి “నచౌకీ” యను ప్రదేశమున కేగి యచ్చట నివసింపఁ జొచ్చెను. అటుపిమ్మట అమరసిం గై మూ సంవత్సరములు జీవించియుండెను. కాని యెన్నఁడు రాజధానిలోఁ బ్రవేశింప లేదు. రాజదండము పరిగ్రహింప లేదు !

సమాప్తము



శ్రీకొండపల్లిప్రెస్, రాజమండ్రి— ఇ. జి. 14—500—1946.